# ఆంధ్రులారా!

అజ్ఞానాంధకారమునుండి బయటబడి,
శారీరిక, ఆత్మిక, సామాజికోన్నతిని
బడయ దలచినచో,

?

## వైదిక ధర్మ గ్రంథ మండలి

పక్షానికి వెలువడు గ్రంథముల
తప్పక చదువుడు.
౩౫౦ పుటలలో కాగల్గిన గ్రంథములకు
సాధారణ సభ్యుల
సం॥ చందా రు. ౧—౮—౦ మాత్రమే.

వివరములకు—

ప్రకాశకుడు

వైదికధర్మగ్రంథమండలి
దేవిడీబాగు, సుల్తాన్ బజారు.

ఓమ్

# దైవభక్తి

వైదిక ధర్మ గ్రంథ మండలి

బహుధ



శ్రీ పైడిమఱ్ఱి వేంకట సుబ్బారావుగారు

ప్రకాశకులు

మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు

వెల రు. ౧—౦—౦

గోలకొండ ముద్రాక్షరశాల

హైదరాబాదు - దక్కను.

# రెండు మాటలు

పామరులేమి, పండితధారులేమి దైవభక్తియను పేర చేయు మోసములను జూచి నేడు అనేకులు దైవభక్తియొక్క సత్య స్వరూపమును తెలుసుకొనజాలక ఇదియొక బూటకపు నాటకమనియు, మోసకులుచేయు చర్యలే దైవభక్తియొక్క లక్షణములనియు తలచి భ్రమకులోనై భక్తివిముఖులైనారు. ఇట్టి వారికి దైవభక్తియననేమో మహాపురుషులు దానినిగురించి యేమిచెప్పియున్నారో సర్వులకు సులభముగా తెలియునటుల (ఉర్దూభాషలో) శ్రీ ఖుష్హాల్ చందుగారు గుల్బర్గా జైలులో దీనిని వ్రాసి దేశీయుల కర్పించిరి.

ఇయ్యది నేను చదివిన తరువాత ఆంధ్రభాషలో నిట్టి గ్రంథముండుట చాలా అవసరమని తలచి నామిత్రుడగు శ్రీ పైడిమర్రి వెంకటసుబ్బారావుగారిని దీనిని ఆంధ్రములో ననువదించుటకు కోరితిని. వారు శ్రమయనక అనువదించి తొందరగా నాకోర్కె నెరవేర్చినందులకు వారికి నే నెంతయు కృతజ్ఞుడను. ఈ గ్రంథములో లోపము లేమయినను పాఠకులు శ్రమయనక సవరించుకొని దీనివలన లాభముపొంద ప్రార్థితులు.

ఇట్లు,
మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు
ప్రకాశకుడు.

# సూచన

ఈ గ్రంథముతో మా గ్రంథమండలికి రెండవ సంవత్సరము విజయవంతముగా ముగిసినందులకు సంతసించుచు, మా మండలి సాధారణ సభ్యులగు వారిని నిరుటివలెనే మరల ఈసంవత్సరము తమ చందా ధనమును పంపి మండలి అభివృద్ధికి తోడ్పడ ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
ప్రకాశకుడు.

# మహారాజ పోషకులు

మ. రా. శ్రీ దోమలపల్లి నరహరి రావుగారు
జమీందారు (కాకులకొండారం)

,, కరార్ రాంచదర్ రావుగారు (కరారు రాంవరం)

# రాజ పోషకులు

మ. రా. శ్రీ గోద బాలకిషన్ ఆర్యగారు (బొల్లారం)

,, ఆర్. కె. వాసుదేవ మొదలియారుగారు
(సికింద్రాబాదు)

,, యం. నారాయణరావు వకీలుగారు
(మహబూబునగరము)

,, కొమరగిరి వేంకటరంగారావుగారు
దేశపాండ్యాజమీందారు (మంత్రాజుపల్లి)

,, ఎదిరెల లక్ష్మయ్యగుప్తగారు (మక్తల్)

,, రాంపాలు లాహోటిగారు, ఆర్యసమాజమంత్రి
కరీంనగర్

,, వల్లూరి వెంకట శేషాచలపతి రావుగారు (మంత్రాజుపల్లి)

# పోషకులు

మ, రా. శ్రీ రాజా వెంకటభూమా రెడ్డిగారు (అనుమాగు)

,, యాముజాల రాఘవ రెడ్డిగారు నారాయణగూడ.

,, డాక్టరు ముత్యాల దొరస్వామినాయుడుగారు
హిమాయత్ నగరు

,, బేలెల లక్ష్మయ్యగారు అబ్దుల్లారిసాలా

,, మద్ది వెంకట నారాయణ రెడ్డిగారు సిరిపేట

,, పులుసాని వెంకటపుల్లా రెడ్డిగారు, హుమాయూత్ నగరు

,, పులుసాని రాంరెడ్డిగారు హుమాయూత్ నగరు

,, రాజా ఆలా వెంకటప్రతాపరెడ్డిగారు    పొన్నాజిపేట

,, నెమరుగొమ్ముల అనంతరావుగారు    వడ్డెకొత్తపల్లి

,, కుందురు గోపాల్‌రెడ్డిగారు    రంగాపురం

,, ఎదిరె వెంకయ్య కండే రామయ్య గుప్తగారలు    మఖ్తర్

# సహాయకులు

శ్రీ ఆర్యసమాజము సికింద్రాబాదు.

మ. రా. శ్రీ కొత్తిరెడ్డి హనుమంతరెడ్డిగారు    చౌటపల్లి

,, ఇభరాంపట్నం రాఘవాచారిగారు    సుల్తాను బజారు

,, సోముసోమేశ్వరరావుగుప్తగారు    సుల్తాను బజారు

,, కె. బాబురావు యాదవగారు    ఇస్సామియా బజారు

,, నర్సింగ ప్రసాదుగారు    ఖమ్మంమెట్టు

,, కొమరవెల్లి నర్సయ్యగారు    మంథన

,, లోకేచిన రామన్నగారు మత్తెదారు    మంథన

,, చీటి వెంకట నర్సింహారావుగారు దేశముఖు    ఘట్టుపల్లి

,, బి. శాయిరెడ్డిగారు    మొసరి

,, వరకాంతం గోపాల్‌రెడ్డిగారు వకీలు    లింగంపల్లి

,, ఆలా గోవిందరెడ్డిగారు    దుబ్బాక

,, కె. గోపాలస్వామి పిళ్లై, డాక్టరుగారు    అఫ్జల్‌గంజి

,, వెంకటనారాయణరెడ్డిగారు మత్తెదారు    నందిగ్రామం

,, కె. వెంకటరెడ్డి వకీలుగారు    పాలేపల్లి

,, పెద్ది నరసయ్యగారు    హైదరాబాదు

,, సి. ఆర్. రామకృష్ణారెడ్డి వర్మగారు డాక్టరు    బొల్లారం

,, జి. గంగారెడ్డి ముస్తాజర్‌గారు    మంచిర్యాల

,, ఆంజనేయస్వామివారు    రాచాల

,, మాదిరెడ్డి రామారెడ్డిగారు కంట్రాక్టరు
నారాయణగూడ

,, ఆర్యసమాజము నిజామాబాదు

మ. రా. శ్రీ తేలుకుంట్ల వేంకటేశ్వరరావు గుప్తగారు
మహారాజగంజ

,, తాటికొండ విశ్వనాథంగుప్తగారు శిద్దిపేట
,, కుంటగంగారెడ్డిగారు మంథని
,, రాచమళ్లగంగయ్య కలకొండలక్ష్మయ్య మార్చెంట్సు
అండ్ కమీషన్ ఏజంటు మహబూబునగర్
,, బిల్లచెర్ల వెంకటప్పయ్యగారి లింగయ్యగుప్తగారు
మిర్యాలగూడెం

మ. రా. శ్రీ నెదిరె గోపాలరెడ్డిగారు వకీలు జమీందారు
నల్లగొండ

,, పి. రామప్పారెడ్డిగారు కొడకండ్ల
,, కె. కనకయ్య గుత్తెదారుగారు నల్లగొండ
,, తాటికొండ కనకయ్యగారు మంద్రాజుపల్లి
,, నెల్లూరిఅమరమ్మగారి నర్సయ్యగారు మంద్రాజుపల్లి
,, ,, యాదయ్యగారు ,,
,, కత్తిం క్రిష్ణారెడ్డిగారు సురిదేపల్లి
,, నారవరాజు హన్మంతనర్సింహారావు దేశముఖు
సురిదేపల్లి
,, డాక్టరు పేరం సూర్యనారాయణగారు
మిర్యాలగూడెం
,, రేగడ సీతారామయ్యగారు జాగీరుదారు, గుంజపడిగె
,, గోరెంట్ల శ్రీరాములుగారు మంద్రాజుపల్లి

# అభిమానులు

మ. రా. శ్రీ పాశం రామారెడ్డిగారు వకీలు (మిర్యాలగూడెం)

,, కె. రామలక్ష్మయ్యగారు వకీలు (మిర్యాలగూడెం)

,, దేవులపల్లి రంగారావుగారు వకీలు (మిర్యాలగూడెం)

,, డి. నర్సింహారెడ్డిగారు వకీలు, మిర్యాలగూడెం

,, నెమరుకొమ్మల రంగారావుగారు వడ్డెకొత్తపల్లి,

,, కేతిరెడ్డి పురుషోత్తమరెడ్డిగారు మఖ్తాదార్ గొట్టిపర్తి

,, నాయిని వెంకటరాం నరసయ్యగారు రెడ్డిగూడెం

మ. రా. శ్రీ అమృతలాల్ గారు ఖమ్మం టింబరుమర్చంటు.

,, తాటికొండ కన్నయ్యగారు మంద్రాజుపల్లి.

,, ఎదిరె శేషయ్య కొత్త సంగయ్యగారు మక్తల్

,, చెండె పాపయ్య ఆకారపు చంద్రయ్యగుప్తగారు (మహబూబ్ నగరం)

,, గంధం నారాయణ సన్సు కలకొండ రామచంద్రయ్యగారు, (మహబూబ్ నగరం)

,, కోడూరు రామారావుగారు (డాక్టర్ కరీంనగరం)

# దాతలు

## మిరియాలగూడెము

మ. రా. శ్రీ అప్పనరాములు, బిలంచెర్ల లింగయ్యగార్లు

,, పారేపల్లి కోటయ్యగారు.

,, గారు నరసయ్యగారు

,, గంధం చంద్రయ్యగారు

,, చిలకల వేంకయ్యగారు

,, కుక్కడపు బిక్షమయ్యగారు

,, జయిసెకోటయ్యగారు

,, నాగుబండి వెంకయ్యగారు

,, నారాయణగారు

,, తిరునగరి నాగయ్యగారు

,, పూడత్తు సుబ్బారాయశాస్త్రిగారు

,, ఓరుగంటి లచ్చయ్యగారు.

మ. రా. శ్రీ చిటుపోలు మల్లికార్జునంగారు.

,, మచ్చా నారాయణ వేముల మల్లికార్జునంగార్లు.

,, చీదెళ్ల రాములుగారు

,, తిరునగరి దుర్గయ్యగారు

,, ముక్కా అప్పయ్యగారు

,, చిల్లంచర్ల గోపయ్యగారు

,, ఆదిమూలబల్ దేవుగారు

,, చిల్లంచర్ల రంగయ్యగారు

,, బోనాల శ్రీరాములుగారు

,, గోజె విఠోబాగారు

,, తైడ్ల రాములుగారు

,, తిరునగరు రామస్వామిగారు

,, తిరునగరి నరసింహాంగారు.

,, చిటుపోలు సూర్యనారాయణగారు.

మ. రా. శ్రీ నాగుబండి వెంకట్రామయ్యగారు.

,, కర్నాటి క్రిష్ణయ్యగారు

,, చిటుపోలు లక్ష్మినారాయణగారు

,, నాగుబండిలక్ష్మినరస్సయ్యగారు

,, ఆవులపిచ్చయ్యగారు

## వరంగల్లు

,, మద్దాల అనంతరావుగారు

,, దుగ్గిశెట్టి వెంకటయ్యగారు

,, మధురకమల చంద్రయ్యగారు

,, చంద్రశేఖరంగారు

,, ములుకల భీమయ్యగారు.

,, ఆర్యసమాజము (హనుమకొండ)

## భువనగిరి

,, ధాత్రిక ప్రేమరాజయ్యగారు.

,, వబ్బవీరభద్రయ్యగారు

,, సిద్దుల బాలరాజయ్యగారు

,, ,, గౌరినర్సయ్యగారు

## షక్తిల్

మ. రా. శ్రీ డాక్టర్ యస్. శివరాంశింగుగారు.

,, జి. శంకరప్పగారు

,, భూతుపూరి హనుమప్పగారు.

,, శకులాది వీరన్నగారు

,, హకీం నాగోరావుగారు

,, వట్టంపాండు రంగయ్యగుప్తగారు

,, వెంకన్నగారు యస్. వై.

,, ధర్మాత్మ మానిగారు

,, హకీం అశన్నగారు

,, జి. వెంకటస్వామినాయుడుగారు

,, పావిర శెట్టి సీలకంఠంగారు

,, బి. హనుమంతరెడ్డిగారు

,, భిక్కీలాల్ గారు ,, ధన్ శింగుగారు.

## నల్లగొండ

,, గాజులదొడ్డ వీరయ్యగారు.

,, యం. నారాయణరెడ్డిగారు (వకీలు)

,, పోల్కంపల్లి లక్ష్మీకాంతరావుగారు (వకీలు)

,, పులిజాల వెంకటరంగారావుగారు (వకీలు)

## సూర్యాపేట

మ. రా. శ్రీ గవ్వా అమృతరెడ్డిగారు

,, శీరపల్లి నారాయణగారు.

,, మయిందర్ కర్ పెద్దోజీగారు.

,, సోమా శివయ్యగారు.

,, శింగిరికొండ సత్యనారాయణగారు.

,, వెదిర రాఘవరెడ్డిగారు

,, యామా రామ నర్సయ్యగారు

,, ఓరుగంటి వెంకన్నగారు.

## మహాబూబునగరం

,, పి. నరసింహారావుగారు వకీలు.

,, వగూరి చిన్నప్పగారు (ఆంజనేయ భక్తసమాజాధ్యక్షుడు)

,, పెద్ద శంకరరావుగారు, వకీలు.

,, కోటకొండ శిద్ధలింగప్పగారు.

,, యస్. ముత్యాలు అండ్ సన్సుగారు.

,, లక్కాకుల బసప్పగారు

,, కె. ముగ. గుప్త (బవరు) బట్టల దుకాణం.

మ. రా. శ్రీ ముచ్చర్ల లక్ష్మయ్యగారు ఆర్యసమాజము
మహబూబ్ నగర్.

,, కనికె లింగప్ప గారి మల్లప్పగారు

,, నర్సింగరావుగారు మక్తెదారు గండ్వీడు మం[illegible]

,, శ్రీ విజ్ఞానప్రచారిణీ గ్రంథాలయముగారు.

,, హకీం చొప్పకట్ల రాజయ్యగారు

,, తంగెళ్లపల్లి నరసింహారావుగారు

,, ఘట్టు సీతారాములుగారు

,, సువర్ణం అనంతరాజన్నగారు.

,, దొంతుల రాజయ్యగుప్తగారు.

## మహాదేవపురం

ఊర వెంకటజగన్నాథరావుగారు మక్తెదారు

,, దూలం దుర్గాగౌడుగారు

,, సిరుపురపు నారాయణగారు.

## నిజామాబాదు

,, వి. యస్. ఆచార్యగారు ఫోటోగ్రాఫర్.

,, వడ్లూరి రాజరామాచారిగారు విశ్వకర్మ
సంఘ కార్యదర్శి.

## మందార్జుపల్లి

మ. రా. శ్రీ గోళ్ల వెంకటరంగంగారు

,, కీ. శే. గోళ్ల కనకయ్యగారు,

,, తుమ్మ రామచంద్రగారు

,, కాందూరి సింహాచార్యులుగారు

,, రాగి నారాయణగారు.

,, దేవబత్తిని సీతారాములుగారు

## సురిదేపల్లి

,, గడుపూడి కోటయ్యగారు

,, అమరనాయిని చంద్రశేఖరరావుగారు

,, శిరిపురపు కోటంబరావుగారు

## ఖమ్మంమెట్టు

,, ఆర్యసమాజం ఖమ్మం, యం. శివప్రసాదుగారు.

## గొట్టపర్తి

,, కేతిరెడ్డి జనార్దనరెడ్డిగారు దేశముఖు.

,, నెల్లుట్ల అనంతరామారావు రంగారావుగార్లు

## కరీంనగరం

మ. రా. శ్రీ సి. యచ్. వెంకట్రామరావుగారు కవిరాజు.

,, ఆరుట్ల కృష్ణారెడ్డిగారు

,, యస్. మలహరిగుప్తగారు

,, ఆంధ్రజనసంఘముగారు ఖానగడ్డ.

## గొలిగూడెము

,, సి. బాలనరసింహముగారు

,, జి. సర్వయ్యగారు ప్రేమసాగర్ ప్రెస్.

,, పి. సత్యనారాయణగారు ఆర్య ముల్కిస్టాండరు

,, కటకం నారాయణగారు

## ఉస్మాన్‌గంజ్

,, పి. శివప్పగారు
,, బచ్చు రాజేశ్వరగుప్తగారు

## సుల్తాన్‌బజారు

దక్షిణ ఖాదీ భండార్ అండు రాష్ట్రీయ ఖాదీబండారు
,, విఠల్‌ప్రసాదుగారు వైద్యరాజ్
,, రాంశెట్టి వెంకటస్వామిగారు శుద్ధఖాదీభండారు

## మహారాజుగంజు

,, లద్దిపల్లి పెంటయ్యగారు
,, కె. నరసింహారావుగారు

## గోల్లఖిడికి

,, కృష్ణనారాయణగారు
శ్రీమతి, యస్. యస్. పద్మావతీదేవిగారు.
మ. రా. శ్రీ ఆకుల వీరప్పగారు వర్ధమాను-
,, చెన్నాది శ్రీనివాసరావుగారు వచ్చునూర్
,, పాలేపల్లి నారాయణగారు ఊర్లపల్లి
,, పుప్పాల జగ్గయ్యగారు ఛంద్రికాపురం
,, వింద్రపల్లి వర్పయ్యగారికుమార్తె ఆనందాదేవిగారు
అన్నపూర్ణవిలాస్
మ. రా. శ్రీ బి. సత్త్యయ్యగారు ఆర్యసమాజం ఈదీబజారు
,, ఓంప్రకాశ్ గారు పాలిబండ
,, యమ్. అనంతయ్యగారు బీరుఖాన్ బాగు

,, పురం విశ్వనాథంగారు మలకపేట
,, చింతల వెంకటనర్సయ్యగారు మల్కాపురం
,, బాల్ రెడ్డిగారు ఉమదాబజారు
,, గజవాడ వీరమల్లయ్యగారు శంషాబాదు
,, శ్రీ బందెనగౌడుగారు అజ్జాకుల
,, బూరుగుపల్లి శిద్దప్పగారు శంషాబాదు
,, మార్నేని జగన్నాథరావుగారు అయ్యవారిలు
,, గుండవరం జగన్నాథరావుగారు గట్లనర్సింగాపురం
,, భద్రయ్యగారు మచిర్యాల
,, దేశోద్ధారక భాషానిలయము దామరచర్ల
,, బండ రాఘవరెడ్డిగారు బండకొత్తపల్లి
,, యంరాం చంద్రయ్యగారు కొడకండ్ల
శ్రీమతి. ఎ. ఆర్. లక్ష్మీబాయిగారు వేములపల్లి
మ. రా. శ్రీ సి. యెచ్. మహాదేవుగారు సుందరగిరి
,, కటంగూరు కేశవరెడ్డిగారు పర్కాల
,, ఎ. వెంకటరమణారావుగారు దేశముఖు పోలంపల్లి
,, శెట్టి శాంతప్పగారు మరికల్
,, కలవల వెంకటేశ్వరరావుగారు యేపెకుంట్ల
,, ఊటుకూరు వెంకటేశ్వరరావుగారు కొదుమూరు
,, కొలిపాక సత్యమూర్తిగారు తిర్మలాయపాలెం
,, ఈదులపల్లి రామచంద్రరావుగారు రామేశ్వరం
,, ఘట్టు బాపుగారు గుంజపడిగ
మ. రా. శ్రీ మేడిశెట్టి వెంకయ్యగారు శంషాబాదు
,, వేణుగోపా లాంధ్రభాషానిలయము
,, శ్రీరంగారావుగారు తోటపల్లి వెంపటి



ఓమ్ భూర్భువస్వః తత్సవితుర్వరేణ్యమ్,
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.

సమర్పణము:—

ఏమిసమర్పింతును? నాయొద్దనేమైనయున్న గదా? నాకడ యేమియునులేదు. నాశరీరము సయితము నాదికాదు. ఇదియును నీమందిరమే గదా! ప్రియతమా! అయితే నేమియర్పింతును? ఈవిచారమాలికనా? ఇది నా య ది యే నా? ప్రభూ! యిదియును నీకృపా ప్రసాదితమేయని నీవెఱుంగుదువు. ఇంక నీ యీప్రసాదితమునే నీకర్పించుటలో నాదేమిపోవును?

తే-గీ॥ నాదియనువస్తువెద్దియు లేదునాకు
ఉన్నయవియెల్లజూడగ నన్నినీవె
నీపదార్థంబులే ప్రీతి నీకొసంగ
నాకువ్యయమగునదియేమి ప్రాకటముగ.

నాథ మీవస్తువునే మీరుస్వీకరింపుడు.

సెంట్రలు జైలు గుల్బర్గా
వైశాఖ శు. ౧౦-౧౯౯౭ విక్రమ

మీభక్తచరణరజము.
ఖుష్ హాల్ చంద్.

# ఉ ప హా ర ము

పితేవ పుత్రాన్ప్రతి నోజుషస్వ.
తండ్రివైనమమ్ము నీపుత్రులను ప్రేమింపుము.

అజరా సస్తే సఖ్యేస్యామ.
మేము నీమైత్రియందెప్పుడును వృద్ధులముగాకుందుము
గాక!

వేనస్తత పశ్యన్నిహితంగుహా.
సద్యత్రవిశ్వం భవత్యేక నీడమ్। యజుః
జ్ఞానియగువాఁడట్టి సత్ బ్రహ్మమును
హృదయమను గుహాంతరమున, దాఁగియున్నటులఁజూచును.

# దైవభక్తి

## ప్రస్తావన

ఒక విద్వాంసుని వాక్యమేమన మనుష్యుఁడు తన జీవితమును ముగించి ప్రపంచమును విడిపోవునరికి ప్రపంచమునగల సంతోషసముదాయమునుగాని లేక జగత్తునకు సంతోషముతోఁగల సంబంధమునుగాని యభివృద్ధిచేసి యుండవలెను. మనము వృద్ధిజేసితిమా మనము ధర్మానుకూలమైన జీవితమును గడిపితిమని యెంచవలెను. అట్లుగాక మనము ప్రపంచముయొక్క హర్షసముదాయమును తక్కువగను, శోకసముదాయము నెక్కువగనుజేసి ప్రపంచమును విడనాడితిమేని యందఱును మనము ధార్మికజీవనము గడుపలేదని భావింతురు. ధార్మికజీవనము గడుపుటకు దానికిఁ దగిన ప్రయత్నము చేయవలసి యుండును. ఏపనియును ప్రయత్నములేక చేయఁబడఁజాలదు. ఇందువలన దానిని గుఱించిన ప్రయత్నము చేయనేవలయును. ప్రయత్నించుట కుపాయ మేమనగా, నొక మనుష్యుని స్థితిలోనుండి, మనకర్తవ్యము లెయ్యి

వియని యోచింపవలెను. మనము వానిని గ్రహించి, వానిని పూర్తి జేయ ప్రయత్నించుచో, నిది కేవల ప్రయత్నమే గాక ప్రయత్నముతోఁ బాటు, హార్ద పరిమాణము నందభివృద్ధి చేయుట యను నుద్దేశపూర్తికిఁ గ్రియాత్మక సాధనము కూడనగును.

మనుష్యుని కర్తవ్యములు.

మనుష్యుని విధులు సంక్షిప్తముగా మూఁడు భాగములుగా విభజింపవచ్చును. ఆ భాగములివి:—

(౧) మనుష్యుఁడుత్తముఁడగుటకుఁ దనకొరకై యేమి చేయవలెను?

(౨) అతనికి నితర ప్రాణులయెడఁ గల కర్తవ్యమేమి?

(3) ఈశ్వరునిగురించి యతఁడేమిచేయవలెను?

వీనినే ఇతర శబ్దములలో (1) శారీరిక (2) సామాజిక (3) ఆత్మిక, ఉన్నతులనవచ్చును. కర్తవ్యములయొక్క యీవి భాగములఁగూర్చిన వివరము సర్వజనులకుఁ దెలియుటకుగాను వ్రాయుటుచితము.

కర్తవ్యముల మొదటి భాగము.

ప్రథమకర్తవ్యము- ఈ విభాగమునందు మనుష్యుఁడు, తన్నుగూర్చి యేమిచేయవలెనను విషయము విచారింపవలసి యుండును. ఇచ్చట దాని వివరమే సంగ్రహముగా వ్రాయఁబడుచున్నది. (౧) మొదటికర్తవ్యము తన యింద్రియములను బలపఱచుకొన వలెను. మనుష్యుని బాహ్యస్థూల శరీరమా పాద

నందువలన నతఁడా సత్యవిరుద్ధ కర్మమును బలవంతముగా నాచరింపకుండును.

కర్తవ్యముయొక్క రెండవ విభాగము

మనుష్యుఁ డితరులయెడ నేమి యొనరించవలెను? దీనిని గూర్చిన విధు లీ విధముగానుండును.

(౧) తనహృదయములో నతఁడెవరియందును నీర్ష్యా ద్వేష భావములనుంచరాదు. ఇట్టిభావములు గలిగియున్నందు వలన నితరుల కెవరి కేమియు హానికలుగుట, కలుగకపోవుట యొకసందిగ్ధవిషయము- కాని వీనివలన నతని హృదయము నులీమసమైనందున, నేలాటిమంచిభావములను యోచించుట కును, విచారించుటకును, నతఁడు యోగ్యుఁడై యుండఁడనుట నిశ్చితము.

(౨) మనుష్యుఁడు నాస్తికుడుగాక యితరుల కెవరికిని బాధనివ్వఁజాలఁడు. ఈశ్వరుఁడు వ్యాపకత్వమువలన మను ష్యులందఱి “శరీరములందును వ్యాప్తుఁడైయున్నందువలన, నత ని నిరాదరణము చేయక యాతని నివాసమందిరము నెవఁడెట్లు శిథిలపఱుపఁజాలును? ఇట్టినిరాదరణమే నాస్తికత.

(౩ మనుష్యుఁడు తన్నుగూర్చివిచారించినట్లే, యితరు లనుగూర్చియు చింతపడవలెను. అతఁడు తన యున్నతియొక్క రహస్యము వరులయున్నతియందు డాఁగియున్నదని చక్కఁ గాఁ దెలిసికొనవలెను.

కర్తవ్యముయొక్క మూఁడవ విభాగము,

ఈశ్వరప్రేమ- ఈశ్వరవిశ్వాసము వలన మనుష్యుఁడు తనయాత్మను శక్తివంతమొనరించు కొనగలుగును. ఈశ్వరుని నెఱుఁగుటకు తననుముందుగా తెలిసికొనుట ముఖ్యము. ఎందుకన నీశ్వరజ్ఞాన మింద్రియములవలన లభించునది గాదు. ఇంద్రియముల ప్రవృత్తి బాహ్యానియమముల వైపుననుండును. కావుననేయయ్యవి బాహ్యావిషయములనుతప్ప నితర మిద్దియును గాంచఁజాలవు- కాబట్టి వానిని "బహిర్ముఖము"లనవచ్చును, వీనికి విపరీతముగా నాత్మ "అంతర్ముఖ" మైయున్నందువలన తనను గాంచగలదు. మఱియు తనయందుగల పరమాత్మని నయిత ముగనఁజాలును. తననేచూడ (తెలిసికొన) జాలనియెడల పరమాత్మని నేవిధముగాఁ జూడఁగలుగును? ఇక్కారణమున తన్నుఁదెలిసికొనుటను గూర్చినశిక్షణమును విద్వాంసులు లోకమునకు ప్రారంభమునుండి నేఁటివఱకును దిన్నగానొసంగుచునే వచ్చియున్నారు. "Know thySelf" అనునొక ప్రసిద్ధ మగులోకోక్తి గలదు. 'స్పినోజా' యను వారొకచోట నిట్లు వ్రాసిరి-"ప్రవ్యక్తికి తనయొక్కయు, తనభావములయొక్కయు జ్ఞానము కలదో, యతఁడుపరమాత్మని ప్రేమించుచున్నాఁడని యతనినిగూర్చి యొవ్వఁడైనవలసి యుండును." ఒకవేళ మనకు పరమాత్మజ్ఞానము గలదని మనము పలికితిమేని, మన మతనిని మనకల్యాణముకొఱకు నావశ్యకుఁడని మాత్రమెఱుంగుదుమను నింతయే దాని యభిప్రాయము. అతనిని కూలంకషముగా

నెఱుఁగుట మానవశక్తికిమించినపని. ఒక ఉర్దూ భాషాకవియిట్లు వ్రాసియున్నాఁడు. అదిచాలాబాగుగనున్నది.

"నాప్రియునియందేమి మంచి విశేషముగలదో చూడుము."

"మనస్సులోనికి మాత్రము వచ్చునుగాని, బుద్ధిలోనికి మాత్రము రాకుండును". మనమతనిని తెలిసికొనవలసినట్టియు అథవా ప్రేమించవలసినట్టి యవసరమేమి? ఈప్రశ్నకు సమాధానమును బొందుటకొఱకు క్రిందలిఖింపఁబడిన పంక్తులు విచారణీయములు.

ప్రపంచమునందు శాంతి, మానవసోదర భావముతో, దేశ, వర్ణ, జాతి, భేదశూన్యముగా సమస్త దేశస్థులందఱును ప్రేమయను నొక యుత్కృష్ట సూత్రబద్ధులగానుంచి నందుల కుఁగారణము, అందునేకమాత్రకారణము వాస్తవికాస్తికతయై యున్నది. వేదమునందీ విషయము స్పష్టమైన శబ్దములలోనిట్లు వర్ణింపబడి యున్నది. (*) ఈ పృథివియందు నివసించునట్టి సమస్త మనుష్యులొక విశాలకుటుంబముగా నున్నారు. వారియందొకఁడు గొప్పవాఁడుగాఁగాని, మరియొకఁడు చిన్నవాడుగాగాని లేఁడు. అందఱును సోదరులు- వారియందఱితండ్రి పరమాత్మఁడును, వారియందరితల్లి పృథివియైయున్నారు. ఎప్పుడు మొదట మనుష్యునకు నీశ్వరునియందు సార్వత్రిక పితృభావ

---

* అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ
యువాపితాసు పారుద్ర ఏషాం సుదుఘా పృథివీసుదినా మరుద్భ్యః॥
ఋగ్వేదము.

విశ్వాసముకలుగుచున్నదో యప్పుడే వేదప్రతిపాదితమైన యీ విశ్వాసోదర భావానుభవమును మనుష్యుఁడు పొందఁగలుగుచున్నాఁడు. ఈ విశ్వాసమే మున్ముందు గలుగవలసియున్నది. మనుష్యుని హృదయమునందు నీశ్వరవిశ్వాస మాత్రపాతమగుచుండుట ఈశ్వర ప్రేమయొక్క యారంభరూపమై యున్నది. ఇట్టి విశ్వాసమేవృద్ధిబొందుచు నిశ్చయాత్మక జ్ఞానరూపమును బొందును. అప్పుడే ప్రేమయుత్కృష్ట రూపమున ప్రాదుర్భవించును. దానియందు ప్రేమి తనప్రియతముని ప్రేమయందు మగ్నుడై తన మంచిచెడ్డలను మఱచిపోవుచున్నాడు. ఇట్టి ప్రేమయొక్క యుత్కృష్టదశయే భక్తియన నొప్పారుచున్నది. భక్తిభావమునందు భక్తుఁడే కేవలముగా తానుశాంతముగను, ప్రసన్న వదనముతోను నుండుటయేగాక తనసంపర్కమునజేరునట్టి ప్రాణిమాత్రుల యాహ్లాదమునకుఁ గారణుఁడగుచున్నాఁడు. ప్రపంచమునందలి యధికతర ప్రాణిసముదాయమీరీతిగా నుండఁజాలదనుట నిశ్చయము. కాని ధ్యేయము సర్వులకిదియే యైయున్నయెడల నెవరునీమార్గము నందెంతమాత్రము నడచుదురో వారింతటినుండియే సుఖశాంతిసామ్రాజ్యవృద్ధికి నొకమట్టునకు నిది కారణముకాఁగలదు. కావున ఆస్తికభావము నేఁడును పురాతనరూప త్యాజ్యవస్తువు కానేరదు. ఇదియొక చైతన్యయుక్తమై వర్తమాన జగదశాంతిరూపరోగైకమాత్రచికిత్స యగుచున్నది. దీకినిఫలముగా అశాంతిపరిపీడిత ప్రాపంచికపురుషులం

కును, వారైరోపీయులుగాని, ఆసియాఖండవాసులుగాని. సంతోషముతోనైనను, శోకముతోనైనను, ఈ చికిత్సావిధిని సేవింపవలసియే యుండును. అస్తు-- ఈచికిత్సావిధి సేవనమును నీశ్వరవిశ్వాసమువలన మనుజునియాత్మ బలయుక్త మగుచున్నదను విషయము చెప్పఁబడియున్నది. ఆత్మయందు శక్తియును బలమును, నేరీతిగాఁగలుగుచున్నవను విషయము నేయిందునిప్పు డెఱిగింపఁబోవుచున్నాము. దీనికి ముఖ్యమైన సాధనము లైదు గలవు:

మొదటిసాధనము:— ఆత్మకు ప్రతికూలమైన కార్యములనుండిదూరముగనుండి యనుకూలకార్యముల నాచరించుట.

ప్రతికూల కార్యములవలన నిర్బలతయును ననుకూల కార్యముల వలన నాత్మయందు సబలతయును గలుగును- ఈశ్వరుని దివ్యగుణములొకటినుండి యనంతము వరకును ప్రాణిమాత్రులశ్రేయముకొరకు ప్రయుక్తములై యున్నవి- ఇందువలన వీలైనంతవరకు వానినుండి యెన్నిగుణములను మనుష్యుఁడు తనయాత్మలోనికిఁ దేఁగలుగుచున్నాడో వానిని దెచ్చుకొనుట మనుష్యునికర్తవ్యము- ఇతరులకుఁగష్టము నిచ్చునట్టివే ఆత్మకు ప్రతికూలములైన కార్యములు- ఈశ్వరీయగుణమనగా మనవలన నాత్మానుకూలమైనట్టియు, నితరులకు కష్టమునివ్వనట్టియు కార్యములను చేయఁగలుగుచున్నాడు- గుణములను తనలోనికిఁగొను సాధనమే జపము- కాబట్టి దైనిక

జపమునకుఁ గొంచెము సమయము ప్రతివ్యక్తియును నొసంగ ప్రయత్నింపవలెను-

రెండవసాధనము— ఆత్మనిరీక్షణము ( Self introspection ) వలన మానవునియందలి యాత్మప్రతికూల కార్యములన్నియును దూరమగును. ఆత్మనిరీక్షణమనఁగా మనుష్యుఁడొక ప్రత్యేకసమయమునందు నితరవిషయములందు ధ్యానమివ్వక కేవలము తన కృత్యములను తెలిసికొని వానిని పరమాత్మసాక్షిగా వదలిపెట్ట నిశ్చయించుచున్నట్లు చేయుట, మఱియు నట్టి నిశ్చయమును సదా స్మరించుచుండుటయు నగుచున్నది. నిద్రింపఁబోవు సమయమున నిట్టి కార్యము మిక్కిలి యుత్తమరీతిని జేయఁగలుగవచ్చును. నిత్యమునట్టి సమయమునందే యిరువదినిమిషములిద్దానికొఱకు వ్యతీతపరుపవలెను. దీనికి ఫలితముగా ననేకదుష్కృత్యములును, దుర్గుణములును విడిపోవును. ఎట్లు జపముద్వారా మనుష్యునియందు శ్రేష్ఠగుణములు కలుగుచున్నవో యటులే యాత్మనిరీక్షణముద్వారా యతనియందలి దుర్గుణములు తొలఁగిపోవును.

మూఁడవసాధనము— ఆత్మబలవృద్ధికి మూఁడవసాధనము తపస్సు. కష్టములను సహించుట తపమనఁబడుచున్నది. కష్టములను సహించుటవలన మనుష్యునియందు సాహసము వృద్ధియగును. దానివలన నెట్టికష్టములును కష్టితమొనరింపవు. సౌఖ్యకాములగు పురుషులు సర్వదా సుఖముల పాలగుచుందురు. కాని తపస్సంపన్నులును, ప్రసన్నతతోడ కష్టమును

సహించునట్టి వ్యక్తులును, సుఖమయజీవితమును గడుపుచుందురు. మహాభారతమునందొకచోట ద్రౌపదీదేవి వలన సత్యభామకు నీతియుపదేశింపఁబడిన విషయము గలదు. ద్రౌపదీదేవి యిట్లు సత్యభామతో ననును. "సుఖం సుఖేనేహ న జాతు లభ్యం దుఃఖేన సాధ్వీ లభతే సుఖాని" సుఖదుఃఖములను చక్రములొకటి తరువాత నొకటి క్రమముగా మనుష్యుని ముందఱకు వచ్చుచుండును. ఒకానొక వ్యక్తి తన ప్రయత్నములతో దుఃఖమను చక్రమును త్రిప్పుద్వారా తనముందఱకుఁ దెచ్చుకొనిన మొదల నిశ్చయముగా దానివెన్నంటువచ్చునది సుఖచక్రమే యైయున్నది. మనుష్యుఁడు తనజీవనమువలన తానుకోరినంతకాలము సుఖచక్రమును తనముందుంచుకొనఁగలఁడు. దుఃఖితుఁడగు మనుష్యుఁడు నిర్బలాత్ముఁడును, సుఖియగువాఁడు సదా సబలాత్ముఁడునుగా నుండురు.

జ్ఞానసాధనము— స్వాధ్యాయము నాల్గవసాధనము. సత్యగ్రంథ పఠనమువలన మనుష్యుని విచారములు విశాలములై యుండును. మనస్సంకోచమునుండియు, సంకుచిత క్షేత్రమునుండియు మనుష్యుఁడు దూరమైపోవుచుండును. సంకోచమువలన నాత్మయందు గ్లానియు, ఉదారతవలన నాత్మయందాహ్లాదమును గలుగును. మనుష్యుల యభిరుచిని చెఱచునట్టియు, వారియందు కువాసనారుచులనుత్పన్నము చేయునట్టివియునగు గ్రంథముల నెప్పటికిని పఠింపరాదు. ఉత్తమ పురుషులయొక్కయు, మహావ్యక్తుల యొక్కయు జీవితములును,

ధార్మిక, సదాచార, జీవనోన్నతి ప్రదాయకములగు పుస్తక రాజములే స్వాధ్యాయ యోగ్యములగును.

అయిదవసాధనము — మానవహృదయమున సత్కృష్ట సేవాభావోదయమే యైదవసాధనము. సేవవలనమనుష్య హృదయము విశాలమగును. మరియు సద్గానియందు నిరభిమానత కలవగును. సేవవలన కేవల సేవకుని కుపకారము గలుగుటేగాక, సేవితునకును శ్రేయము గలుగును. మీ పొరుగులోనొక దొంగతనముచేయు స్వభావముగల వ్యక్తిగల డను కొనుఁడు ఇఁక మీరతని నేప్రకారముగా నుద్ధరింపఁగలరు? అతనిని మాటిమాటికి దొంగయనిపిలుచుచు లజ్జితునిగావించి, తద్వారా యుద్ధరింపఁగోరుదురుకాబోలు. కాని యది సంభవముగాదు. మీరీవిధముగా సారెసారెకు వెక్కిరించుచున్నందువలన, విసుగుగొని, యతఁడొకనాఁడు "సరెమందిది నేను దొంగనేకానిండు. మీయిష్టమువచ్చిన పనిచేయుఁడు." అనిపలుకును. ఇప్పుడతఁడు నిస్త్రపుఁడై పోయినాడు. అతనియందు చోరుఁడనుమాటవలనగలుగుసిగ్గు మిగిలియుండలేదు. ఎట్టిపతితవ్యక్తియును, సారెసారెకు నతనియవగుణములను వర్ణించుచుండినందువలన, బాగుపడఁజాలఁడు. బాగుపడుమార్గము వేరొండుగలదు. అద్దాని నవలంబించినందువలననే సఫలతగలుగును. నీవెట్టివ్యక్తియందలి దుర్గుణముల నెప్పుడును వచింపకుము. ఆవ్యక్తియొక్క సుఖదుఃఖములందు, విశేషించి దుఃఖమునందు పాల్గొనుము. ఈవిధమున రెండు మూఁడు పర్యా

యములు చేసినందున వలన నతఁడు నీవు చెప్పకముందే న్యాయము గానే తన దుర్గుణములను విడనాడఁ గలుగునంతగా, నీవలన ప్రభావితుఁడును కృతజ్ఞుఁడునునై యుండగలఁడు.

సేవను గురించిన యొక యుదాహరణము,

వంగదేశమునందు భక్తిమార్గప్రచారకుఁడైన చైతన్యులవారి జీవితమందలి యొకఘటన చాల శిక్షాప్రదమై యున్నది చైతన్యులవారొక సమయమున తమకొందరి శిష్యులతోను, అనుయాయులతోనుగూడి వంగదేశమునందలి యొకనగరమునకు వెళ్లిరి. అచ్చటనొక వాటికయందు వారు విడిసిరి. నగరవాసులు వారి దర్శనార్థము రాసాగిరి వారా వచ్చినజనులతో నొకప్రశ్న నడిగిరి. అదియేమన "మీనగరమున నందరికంటెను దుష్టుఁడైన మనుష్యుఁడెవ్వఁడున్నాఁడు?" ప్రతియొక్కఁడును, "మఘాయియను వాఁడీనగరమున నందరికంటెనధిక దుష్టుడు అతఁడు సాధారణముగా నందఱకును గష్టకారణుఁడై యున్నాఁడు." అనిపలికెను. అప్పుడు చైతన్యులవారు తమశిష్యులవిద్దఱను పోయిమఘాయిని పిలుచుకొనిరండని పంపిరి- ఇద్దరుశిష్యులును మఘాయియొద్దకునేగిరి, అతఁడా సమయమున తనమిత్రులతోఁగూడి సారాయిని గ్రోలుచుండెను. శిష్యులా గురుసందేశమును వినిపించినతోడనే, యతఁడు పట్టెసీసానొకదానిని గొని యొకశిష్యునిశిరముపైన వైచెను. శిరమ్మున గాయముపడి నెత్తురు ప్రవహింప దొడఁగెను. శిష్యులు గురువుల వారి సన్నిధిని జేరి జరిగినవిషయము నంతయును వినిపించిరి- గురువులవారు

తమ పదుగురు శిష్యులను బోయి, మఘాయి సంతోషముతో రానియెడల నతనిని బలవంతముగానైన పట్టుకొనిరండనిపంపిరి. అంతటమఘాయి పట్టుపడి చైతన్యుల . రి సమీపమునచేరెను. చైతన్యులవారొక మృదులతల్పము నొకదానిని క్రిందపఱిపించియుంచిరి- మఘాయియాతల్పముపైన శయనింప జేయబడెను- అతఁడు తనకు శిక్షదొరుకునని చింతిల్లుచుం డెను- కానిచైతన్యులవారు వచ్చియతని పాదములయొద్ద కూర్చుండి, తనహస్తములతో పాదముల బినుకుచుండునట్లతఁడు చూచుచున్నాఁడు. మఘాయి భీతుఁడై . లేచికూర్చుండెను. అతనిహృదయము తబ్బిబ్బునొందెను. అతఁడు చైతన్యులవారి కేల్దమ్ములను తనకాళ్లపైనుండితీసివైచి, గద్గద హృదయముతోను, కంపితహృదయముతోడను, బాష్పవారిపరిపూరిత నయనంబులతోడను చైతన్యులవారితో నిట్లుసాంజలియై విన్న వించెను- "మహాత్మా! నేనొకగొప్పపాతకిని నేననేకగొప్ప యపరాధముల నొనరించితిని- మీరెందుచేకు మీపవిత్రపాణి ద్వంద్వమును నాపాపభూయిష్ఠ నీచశరీరమునంటి మలినయుక్త మొనరించుకొంటిరి?" ఇప్పుడీ మఘాయి పూర్వపుమఘాయి కాఁడయ్యెను. ఇప్పుడతనియందు నాత్మవిమర్శన జ్ఞానముత్పన్న మైనది- అతఁడు తన దుష్కృత్యములనేవగించుకొనుచుం డెను. ఎక్కువ వ్రాయఁబనిలేదు. చైతన్యుని జీవితచరిత్రము మఘాయి చైతన్యులవారికి శిష్యులలో సర్వశ్రేష్ఠుఁడయ్యెనని వచించుచున్నది. ఇది యంతయును చైతన్యప్రభుని సేవాబుద్ధి

ఫలితమే. ఇంక పైనం జెప్పంబడిన యైదు విషయములనుబట్టి యాచరణము చేయుచున్నందున నాత్మ బలవంతమగుచున్నది. నిస్సందేహముగా మానవుండు మొకటి ముఖ్యములైన విధు లనుపాలించి శ్రేష్ఠుండగుచున్నాండు. కడపట వివరింపంబడిన యీయైదు నియమముల నాచరించినందువలన తనయాత్మను నయితము సామర్థ్యవంతము గావించు కొనవచ్చును. అప్పుడే యతనియందున్నతమైన ఆస్తికభావములు జాగృతినిపొంది యీశ్వరోపాసనాభిముఖుడై, భక్తిమార్గపథికుండు గాం దనరు చుండును. అద్దానిప్రచారముయొక్క యుద్దేశ్యముతోనే యీ గ్రంథము వ్రాయంబడియున్నది. మఱియు నందులకే యీ కొలది పంక్తులు వ్రాయంబడియున్నవి.

"దైనికమిలాప్ లాహోర్" పత్రికా సంపాదకులును ఆర్యప్రాదేశిక ప్రతినిధిసభాలాహోరు యొక్క ప్రధానియును నగు, శ్రీయుత, లాలా, ఖుషుహాల్ చందుగారీ సమయమున నాతోడ సెంట్రల్ జైలు గుల్బర్గా (హైద్రాబాదు రాష్ట్రము) యందున్నారు. ఎవరు వీరికుటుంబము నెఱుంగుదురో వారు, లాలాగారును, వారికుటుంబమును నెట్టియుచ్చశ్రేణియందుగల విశుద్ధ ఆర్యజీవితమును గలిగియున్నారో బాగుగా నెఱుంగుదు. లాలా ఖుషుహాల్ చందుగారు భక్తిమార్గాదులన్నియును గల వారు. కావుననేవారు కారాగృహవాస సమయమును పదుప యోగ మొనరించుచు భక్తినిగూర్చిన యీగ్రంథమును వివరిం చినారు. అనేకపర్యాయములు కారాగృహమునందలి ప్రతి కూలతలవలన వారిస్వాస్థ్యము చెడియుండెను. మరియు ననేక విధములైన కష్టములను సహింపవలసియుండెను. అయినను

భక్తియందలి ప్రేమచేతవారు గ్రంథమును వ్రాయుట మాత్ర లేదు- పుస్తకము (హిందీమాతృక) యొక్కభాష మిగుల యుత్తమమును సరళమును హృదయంగమమునై యున్నది. దానియందు సర్వవిషయములును. ప్రతియొక్కఁడును, అథవా సుశిక్షకులును లాభముపొందునట్లుగా వర్ణింపఁబడియున్నవి. వారిచేత వ్రాయఁబడిన (స్వీయగాథ) రామకథవలన వారాశ్రయించినమార్గముచేత వారికెంతశాంతిగలిగినదియు, స్పష్టమగుచున్నది. ఇక్కారణముననే యనేక సోదర సోదరీమణులు లాభముపొందవచ్చిన యవకాశమిచ్చుటను వారుముఖ్యముగ గమనించిరి. పుస్తకమును సర్వసాధారణముగాఁజూచినను దాని యుపయోగము విదితమగును.

భక్తియొక్కవిధి, మనోనిగ్రహ సాధనములు, సంకల్పములు, సంస్కారములు, స్వాధ్యాయము మున్నగుననేకయుపయోగవిషయములీ గ్రంథమునందు ద్యోతకములై యున్నవి. "ఎవరుభక్తిలాభమును పొందఁగలరను" విషయమీపుస్తకమునందే భాగమునగలదో దానిని పాఠకులు విశేషధ్యానముతోఁబఠింపవలెను.

ఈపుస్తకమే సదుద్దేశముతో వ్రాయఁబడియున్నదో దానిని పాఠకులు ధ్యానమందుంచుకొని, యధికాధికముగ దానినుండి లాభమును పొందప్రయత్నింతురని విశ్వసించుచున్నాను. పుస్తకము వాస్తవముగఁ బ్రచారయోగ్యముగనున్నది. ఈక్రిందిశబ్దములతోడ నీపుస్తకమును పాఠకుల యెదుట నుంచుచున్నాఁడను.

షెల్టర్ ఔడ్ - గుల్బర్గా,
27 మే, 1936.

నారాయణస్వామి.

# రామకథ.

(స్వీయగాథ)

సాధారణ బాలుఁడు, పసిపలనిశాని చోళమును ధరించి కన్నతల్లి కమ్మని జోకొట్టులతో నిద్రింపనిచ్చగించునట్టి జీవనారంభ సమయమున, నేనందఱును నిద్రించిన నీరవ నిస్తబ్ధనిశాసమయమున 'గాయత్రీ' మాతయొక్క జోలపాటలను వినుచుండెడివాఁడను. పిల్లవాండ్రకు నాటపాటలు మిక్కిలి యాకర్షకములుగా నుండును. కాని నాకన్ననో 'గాయత్రీ' మాతయొక్క మృదులాంకమునఁ జేరియాడుకొనుటే యన్నిఁటి కంటెను నాకర్షకముగా నుండెడిది.

నేనుఖిన్నుఁడనై — ప్రపంచముతోడ నిరాశజెంది యుండువాఁడను. ఎనిమిని, తొమ్మిది వర్షముల చిన్నప్రాయమునసే నేను జీవించుట నిరర్థకమని యనుభవమును పొందితిని. నిశ్చేష్టుఁడనై, ప్రపంచగవేషణము చేయుచు దుఃఖించుచుండును. మరియు నాయొక్క మూకభావమందు, మాగ్రామము వెలుపలఁ గన్పట్టు ఆనల్లనికొండల నడుగుచుండును —

నాతోనెవ్వరును ప్రసన్నులై యుండ రెందులకు? అధ్యాపకులు, మిత్రులు, బంధుబాంధవులు, తదితరులు నాయందు ప్రేమతో వర్తించ రెందులకు? ఆకొండలు నిర్జీవములు, నిష్ప్రాణములు, అయ్యావి నాప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము నొసంగఁజాలవు. మఱియు నొసంగవును. నాయొక్క యశ్రుపూర్ణనేత్రములను వాడినముఖకమలమును, స్వర్గీయ నిత్యానంద స్వాములవారు మాగాత్రిమునగు జాలాలుపూరు జిల్లానందు, దయచేసియుండిన దినములలో, నొకనాఁడు వీక్షించినాతో దీనికారణమును గూర్చి ప్రశ్నించిరి.

నేనిటులు పలికితిని:— "నేను జీవించుట నిరర్థకము. నాతోనెవ్వఁడును ప్రసన్నుఁడై యుండఁడు. ఏవిషయమునందు నాకుఁ బ్రవేశములేదు. ఇట్టి జీవనమువలన లాభము?" స్వాములవారు నాభగ్నహృదయమును సంధానపఱచి నన్నాశ్వాసించి యీరీతిఁబలికిరి— "నిరాశ చెందకుము. నేను నీకొక మార్గము నెరిగింతును, దాని ననుసరింపుము. అంతప్తహృదయమునకు శాంతిదొరకును. సమస్త, శోకవిఘ్న బాధావళి దూరమగును."

అంత నాకు యిసుమునందు మంచినీటి తియ్యదనము జూచినట్లయ్యెను. ఈయంధకారమయ సంసారమునందుజ్జ్వల జ్యోతియొక్క మధురాభాసము గన్పించినది. నేను గడ్డిపఱకను సహాయముగాఁగొని, "మహాత్మా! మీయనుకంపను జూపుఁడని" పలికితిని. వారియాజ్ఞానుసారము కాగితము ముక్క తీసు

కొని వచ్చినమీదట స్వాములవారు దానిపైన గాయత్రీమంత్రమును లిఖించిరి. నాకు మొదటినుండియు గాయత్రీమంత్రము కంఠస్థమైయుండినను, ఆదినమున దానినిజూచి నాకన్నులొక గొప్ప అద్భుత జ్యోతిస్సువలన బ్రకాశితము లయ్యెను.

అటుపిమ్మట వారు దానియర్థమును తెలుపుచు, ఎప్పుడింటియందలి జనులందఱును నిద్రించియుందురో, అప్పుడు నీవు లేచికూర్చుండి, యీమంత్రమును జపింపుమని వచించిరి.

ఈసంగతి జరిగి నేటికి దాదాపు ౪౪ సంవత్సరములు జరిగినవి. కాని యొకదినమైనను గాయత్రీ మాత యొక్క యొడియందుఁజేరి యుండనట్లునాకు జ్ఞాపకములేదు. ఈజపము చేత నానిరాశజెందిన హృదయమునకు ఆశలభించినది. నాభిన్నమైన చిత్తమునకు రసమును, అశాంతుఁడనైన నాకు శాంతియు లభించినవి. ఏయేరీతి నేనీమంత్రమును జపించసాగితినో యాయా విధముగానే నాయభిరుచి భగవద్భక్తియందు నుత్తరోత్తరకాలమున నతిశయింపఁదొడఁగినది. ప్రతి తడవను మంత్రము నాపైన నొకనూతనతేజస్సును ప్రసరింపఁజేయుచువచ్చినది. తుదకు దాని ప్రభావముచేత తదితర మెద్దియు దానికంటె నాకర్షకమైనది గానుపించ దయ్యెను.

భగవానుని కృపవలన, సత్యమైన ఆర్యజీవనమును గడుపునట్టియు, నీశ్వరభక్తులైనట్టియు, జననీ జనకుల గృహమునందు జన్మించితిని, వారిశిక్షణ పోషణాదులవలన నాయందుభక్తితత్త్వము సంపూర్ణముగానిండి నిబిడీకృతమై పోయినది. దీనికి

బిమ్మటను పరమేశ్వరుని కృపగలిగి నందువలన సంసారయాత్ర కువలసిన జీవనసంగతిగా దైవభక్తిచేత నంకితమైన సతీమణి లభించినది. వివాహానంతరము నాభక్తిభావనను ఆప్రాణసతి యింకను తీవ్రతరము గావించినది. సహధర్మిణి యనంతరము సంతానము సయితము భగవద్భక్తి యుక్తమైనదే ప్రాప్తమైనది. నేను నలువైపులనుండియు, ప్రభుప్రేమ, ప్రభుభక్తి, ప్రభువిశ్వాసములతో నోతప్రోతమైయుంటిని. ౧౯౦౨ వ సంవత్సరమున 'పూజ్యమహాత్ములైన హంసరాజుగారితో సమాగమమైనప్పుడు పరమేశ్వరప్రేమపైన నొక యద్భుతప్రభావము ప్రసరింపచేయబడినది. దీని తరువాత నాకు * బంధువులు ధర్మపుత్రీ పుత్రుల నిమిత్తము దొరికినవారును సత్యమైన యీశ్వరభక్తి సంయుక్తులు, ఇవ్విధముననాకు సంప్రాప్తమైన సహృదయులుకూడ ప్రభుభక్తిచేత నభ్యలంకృతులైనవారే.

ఇట్టి యనుకూలమైన వాతావరణమునుగాంచి భగవద్భక్తి దినదినము గాఢమై పోవదొడగినది. జీవితములో నప్పుడప్పుడు, బంధు మిత్రాదులచేత నంపూర్ణ సౌఖ్యము లేర్పడి

---

* యజ్ఞప్రేమిలాలా, ధనీరామ్‌భల్లా, లాహోరుభల్లా షూ కంపెనీ యధికారియు, హాఫీజాబాదు ఆర్యసమాజ ఫదానుల గూడా దౌలత్‌రామ్ గారు కపూర్,

* ఉదాహరణముగా, బాబా గురుముఖసింహు, బాబా మహారాజసింహు ఆఫ్ బాబా ప్రద్యుమ్నసింహు అండ్ సన్సు, అమృత్‌సర్ మరియు మాస్పూర్ నందలాలు గారు జాలంధరు వాస్తవ్యులు.

యుండుటచేత నాకీమార్గమున కృత కృత్యుఁడ నగుటకు సహా యములభించినది. భాగ్యోదయకాలము నికటముననే తెంచు తరి హఠాత్తుగా గురువర్యులును లభించిరి. వారు తాము స్వయ ముగా నే చేయూఁతనొసఁగి నన్ను భగవానుని సమ్ముఖమున గూర్చుండజేసి, యా తేజస్స్వరూపుని ప్రకాశపుంజమును గన్పిం పజేసెను. ఎప్పుడైనను నేనేకాకినై నాజీవితముయొక్క యద్భు తమైన ఘటనముల నాలోచించిన, నాకివ్వానియన్నిఁటి యం దును నాప్రియజననియగు "వేదమాత" యొక్క కరకమలమే సన్నిహితమై గోచరించుచుండును. నేను గాయత్రీమాత కృపా పాత్రుఁడనేగాక నితర మేమియును గాను. నేను పొందిన దేదైనను నా మెరయాశీఃపరంపరవలననే పొందియున్నాను.

నావలెనే యాతురతతోను, దుఃఖములతోను, బాధితు లై యున్న బాలబాలికా,యువతీ,యువక, వృద్ధా,వృద్ధ గణము నాజీవితముయొక్క యీ రామాయణము వలన నేమేని లాభము పొందఁగలరని మాత్రమే యీకథను వర్ణించుటయందలి యభి మతము. వారుడోలాయమానులై పలుకష్టములకు గురియై యుండుటకు మారుగా నొక నిశ్చిత సఫలమార్గమును బడయ గలుగుటయందు నగ్రసరులై యుండఁగలరు.

హైదరాబాదు రాజ్యమున ధార్మిక సంగ్రామమును గూర్చియొక సంవత్సరార్థము కారాగారమున బద్ధు డనై వచ్చి, యీకారాగృహయాత్రా "ప్రసాదమును" నా సోదరీ సోదరులకేమి యొసంగవలెననియూహా వొడమినది.

సౌభాగ్య వశాత్తు నేనే జెయిలు (గుల్బర్గా జెయిలు) నందుబంధితుఁడనై యుంటినో యద్దానియందే మహాత్మ నారాయణ స్వాములవారును బంధితులై యుండిరి- వారిసత్సంగము సంపదుండి, ప్రతినిత్యము నుపనిషద్రహస్యముచేత శ్రవణానందము గాంచుచునుండ నాహృదయాంతరాళమునుండి "దైవభక్తి" యొక్క ప్రసాదమే యుపయుక్తముగా నుండునని ప్రతిధ్వని వచ్చుచుండెను. కాని ప్రసాదము నొసంగుటకు నేనెవఁడను? నాయొద్దనున్న వస్తువేయేమిటి? ఇదియంతయును 'వాని' కృపా ప్రసాదితమే. వానియాజ్ఞపైననే దీనిని మీయొక్క సమ్ముఖమున నుంచుచున్నాను. మంచిదనిపించనిండు — అనిపించకపోనిండు బాగుగ నుండనిండు, లేకుండకపోనిండు, యీ ప్రేమాంకితమును స్వీకరింపుఁడు.

సెంట్రల్ జెయిలు గుల్బర్గా
వైశాఖ శుద్ధ పాడ్యమి ౧౯౩౯
13 ఏప్రియల్ 1939,

భక్తచరణరజోపనుఁడు.
ఖుష్ హాల్ చందు.

# నివేదనము

సుమారు 333 సంవత్సరములకు పూర్వమునందలి యితి హాసము యొక్క కరుణాజనకమైన ఘటనతిరిగి జరుగునాయేమి? మఱలనొకమారు భగవద్భక్తుఁడైన సంతు తుకారామునివలె నేను గూడ ప్రాయోపవేశము చేయవలసి యుండెనా? — ఈ ప్రశ్నలు గుల్బర్గా సెంట్రల్ జెయిలు యొక్క సూపరింటెండెంటు నా పుస్తకమును తిరిగి యివ్వక సాకుచెప్పుచుండి నప్పుడె నా యెదుటనిలిచినవి. ఆసమాచార మిట్లుగలదు: — ఈ గ్రంథముసిద్ధమైనది. జెయిలునందే శ్రీపూజ్య మహాత్మ నారాయణ స్వామిగారు ప్రస్తావనను సయితము వ్రాసియుండిరి. ఒకనాఁడు జెయిలుయొక్క సూపరింటెండెంటుగారు వచ్చి యిట్లనిరి. "మీరువ్రాసిన పుస్తకమును దానిలోనేమి వ్రాసితిరో చూచు టకు నాకిండు, రెండవవిషయము జెయిలునందు పుస్తకములు వ్రాయుట కాజ్ఞలేదు." నేనిట్లంటిని — "నేను పుస్తకము నా రంభించినప్పుడే మీకెరింగించితిని. అటుపిమ్మటను అనేకపర్యా యములు పుస్తకమును వ్రాయుచున్నానియుఁ దెలిపియుంటిని. ఆజ్ఞయేలేకుండిన యెడల నాసమయమున నన్నేందులకు వారిం చలేదు? రెండవ విషయము. జెయిలునందు పుస్తకములు వ్రాయఁబడుచునే యున్నవి. లోకమాన్యతిలకుఁడు 'గీతా రహస్యము'ను జెయిలునందే గదా వ్రాసినది, శ్రీ లాలా లజ పతిరాయ్‌గారు కూడ "భారత్ కీయితిహాస్" అను గ్రంథమును

ధర్మశాలయొక్క చెఱశాలయందు వ్రాసిరి. పండిత జవాహర్ లాలు నెహ్రూగారు సయితము విశ్వేతిహాసమును గురించి యొక పెద్ద పుస్తకమును నైనీ జెయిలునందు వ్రాసిరిగదా! కాని హైదరాబాదు రాష్ట్రమునందలి పద్ధతులే చిత్రముగా నున్నవి. ఇది ప్రభుభక్తి' దానిలో నేమి వ్రాయఁబడి యున్నదో చూతుమని చెప్పి యతఁడు తీసికొనిపోయెను. "కేవల మీశ్వరభక్తిని గురించియే వ్రాసియున్నాన"ని నేను నుడివితిని. దానికి నతఁడు దానిని తన యొద్దనె సురక్షితముగా నుంచఁగలనని యాయన పలికెను.

పై విషయము తరువాత నైదు వారములు జరిగి యాఱవ వారము సయితము జరుగుచుండెను. కాని పుస్తకము తిరిగి యివ్వఁబడలేదు. అప్పుడు నేనొకనాఁడు సూపరింటెండెంటుగారితో ప్రభుభక్తియొక్క పాండులిపి నాకు యివ్వవలసి యున్నదని పలికితిని. దానికి ప్రత్యుత్తరము హైదరాబాదు పై కచేరీకి పంపించఁబడినదని లభించెను. అప్పుడు నేనిట్లు పలికితిని. "అయ్యా! మీరు తమ యొద్దనె యుంచెదనని వచించి యీపుస్తకమును తీసికొని వెళ్లితిరి.,, అంతట నధికార పూర్ణ స్వరముతో--- మీరు పుస్తకమును వ్రాయనే వ్రాసితి రెందులకు? దీనికి నాజ్ఞయే లేకుండెను. ఇప్పుడు మీనుండి యాకలము సయితము తీసికొనఁబడగలఁదు" అనిరి ఇదివిని నాపుస్తకము 'తలాక్' (నష్టము) అయిపోయినదని తలంచు సావమయముననె నా కన్నులయెదుట నేఁటికి సుమారు 333 వర్షముల క్రిందటి యొక దృశ్యము నిలిచినది.

ఇదే దక్షిణదేశము. ఇచ్చటనే భగవంతుని ప్రియభక్తుఁడు సంతు తుకారాముగారుండిరి. వారుభగవద్భక్తితరంగ డోలికల నూఁగుచు నెన్నియో భజనలను రచించిరి. వానికి అభంగమను పేరుగలదు. ఆభజనములన్నియును మహారాష్ట్రము నందంతటను వ్యాపించిపోయినవి. భక్తులగువారు వాని నాడుచును నూఁగుచును పాడుచుండిరి. కాని యొకని దృష్టికి పరమేశ్వరభక్తుల యీసంగీతము నచ్చనేలేదు. అతఁడొక నీచమగు మాయనుబన్ని సంతు తుకారాముగారినుండి వారి భజనపుస్తకములన్నియును తీసికొని, పుస్తకము లింద్రాయణీ నదియందు పడవేయఁబడినవని యెరిఁగించెను. సంత తుకారాముగారి హృదయమునకు దానివలన గొప్ప వేటు తగిలినది. వారిహృదయము వికలమైపోయినది- వారింద్రాయణీ నదీతటమున నొక దేవాలయము నెదుటగూర్చుండి, ఎంతవరఁకు నాపుస్తకములన్నియును, నాకులభింపవో యంతవరఁకు నేనన్నపానీయములను గైకొననని ప్రతిజ్ఞ జేసెను. ప్రభుప్రియుఁడు ప్రాయోపవేశము నారంభించెను- ఒకటొకటిగాఁ బంద్రెండుదినములు గడచినవి. కడపట పదుమూఁడవ దినమున వారిస్థితి మిక్కిలిగాఁ జెడిపోవసాగిన, వారిపుస్తకములు వారికి నిచ్చివేయఁబడెను.

ఈ దృశ్యము నాదృక్కులయెదుట మెఱుపువలె పొడకట్టిపోయినది. నేను జెయిలు సూపరింటెండెంటుగారితో — “మీరు మాటను తప్పినారు. మీరు పుస్తకమును మీయొద్ద

మాత్రమే యుంచుకొని చూచుటకొరకుఁ దీసికొంటిరి. మీరు హైద్రాబాదునకు పంపించి యేమియును చిత్రముగావింప లేదు. ఇంకను నాకాలము నూడదీసికొనుటను గూర్చి పలికినందుకు నాకేమాత్రమును విచారములేదు- నేనీ దినమునుండియే నాసకల సౌకర్యములను కాలఁదన్నుచు నొకసామాన్య బంధితునివలె నుండుట కారంభింపగలను. మఱల మీతో నొక విషయమును తెలియఁజెప్పు చున్నాఁడను. అదేమన నేఁడు జూలై పదుమూఁడవ తేది. ఒకవేళ నాపుస్తకము 19వ జూలై వరఁకు నియ్యకున్న యెడల నేనిరువదవ జూలై నుండి నిరశన వ్రతము మొదలుపెట్టి నాప్రాణముల నర్పించఁగలను. మాటను పాలించనట్టియు, ప్రభుభక్తి పుస్తకమును ప్రభుత్వస్వాధీనము జేయునట్టియు వారిదయవలన బ్రతుకఁ గాంక్షింపను-" అని పలికి నేను తక్షణమే నావస్త్రముల విడిచి జెయిలుగుడ్డలను ధరించితిని. శయనించుటకు భూమిపైనొక గోనెతట్టును పఱచుకొని భగవంతుని ప్రార్థించుచుంటిని.

నాయందు సానుభూతిగలిగియున్న సత్యాగ్రహులు రిటైర్డుపంజాబు సెషన్ జెడ్జి లాలామురారిలాలుగారును, మహాశయఠాకురు దాసుగారు, వానప్రస్థులు హలధరశాస్త్ర్యులును, నటులనేజేసిరి. సంపూర్ణానశన వ్రతము 20 జూలైనుండి చేయ వలసియుండెను. కాని దానికొరఁకు సంసిద్ధత 14 వ జూలై నుండియే ప్రారంభించితిని. నేను జొన్నరొట్టెవి అయిదుకబళ ములను మాత్రమే 24 గంటలలో భుజించుచుంటిని. పంచ

ప్రాణముల సంతుష్టికొరకు, ఓం ప్రాణాయస్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయ స్వాహా, యనుచు జఠర హోమకుండమున నైదా హుతులను వేయుచుంటిని. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు దినములొకటి తరువాత నొకటి యీవిధముగా నే కడచిపోయి నవి. నేనీసంసిద్ధత యొక్క దినములలో, జెయిలున నివసించి నందువలనను, జెయిలునందలి పనికిమాలిన తిండివలనను, ప్రతి కూలమైన జలవాయువులవలన గలిగిన నానావిధములైన రోగ ములవలనను, వానిచేతఁగలిగిన నీరసమును నెదుటనుంచుకొని యనశనవ్రతము నారంభించిన తరువాతను, పదియో, పదునైదో దినములు జీవించియే యుండగలనని తెలిసికొంటిని. ఆఱవదిన మును వచ్చినది. హాపసయజ్ఞాదుల యనంతరము నేను సత్యా గ్రహబంధితులతో నన్నొకనిగ ప్రాయోపవేశమును జేయనిం దనియు, తాము సయితము నిరశనవ్రతమును ప్రారంభించినచో నాకుకష్టముగా నుండుననియు జెప్పి వేడుకొంటిని. ఆదినము సయితము కడుపును వట్టిగా నేయుంచితిని- ఒకవిధముగ నాది నము సయితమున శనవ్రతముగానే గడచినది. కాని సూపరిం టెండెంటుగారికి యిఱువదవ తేదినాడు నిరశనవ్రతము ప్రారం భమగునని తెలిసియే యుండెను. పందొమ్మిదవ జూలైనాడు సాయంకాలమున నాగదిలో కూర్చుండి భగవంతుని భజన ముచేయుచున్న సమయమున మహాత్మ నారాయణస్వామిగారు నన్ను బయటకురమ్మని పిలిచిరి- సూపరింటెండెంటుగారును

బయటనే కూర్చుండియుండిరి. నా పుస్తకముయొక్క పొందు లిపి వారిచేతిలోనుండెను. నేనుదగ్గరకు వెళ్లినప్పుడు వారు దానిని నాకిచ్చివేసిరి. ఇవ్విధమున దాదాపు 333 వర్షముల తరువాత దక్షిణ దేశమునందొక పర్యాయము మఱల సంతుతుకారాము విషయము స్మరణమునకు వచ్చినది-

నేను జెయిలునందు మూఁడు పర్యాయములు, నిరశన వ్రతము జేయనెంచితిని. పరమేశ్వరుని కృపవలన మూఁడు తడవలును నాకు సఫలతయేగలిగినది. మిగిలిన రెండింటికి 'ప్రభు భక్తి' తో సంబంధములేదు. అవి సత్యాగ్రహుల కష్టములను దూరముచేయుటకును, వారియెడ జెయిలు యొక్కయధికారుల మానవ దూరప్రవర్తనముల నెదుర్కొనుటకును సాగించియుంటిని. అందువలన నిచ్చట వానిని వర్ణింపఁబోను.

సెంట్రలు జెయిలు గుల్బర్గా
20 జూలై 1939.

భక్తుల దాసాను దాసుఁడు,
ఖుష్‌హాల్ చందు.

# అసార సంసారము.

---

ఈ సంసార మసారమైనది. శరీరము సర్వథాక్షణభం గురమైనది. లోనఁగొనిన శ్వాసము బయటకు వెడలినప్పుడు తిరిగి శ్వాసము లోనికి వచ్చుననిగాని, యిదియే డపటి శ్వాస మగుననిగాని, యెవ్వఁడును నొక్కి పలుకఁ జాలఁడు. యజుర్వే దాధ్యయనము జేయుచు ముప్పదియైదవ యధ్యాయమునఁ జేరి యందలి యిఱువది రెండు మంత్రములను స్వాధ్యాయము జేసి నంత, నా నేత్రములు విప్పినట్లయ్యెను. భగవంతుఁడీ ప్రపంచ మునకెందులకూఁ బంపియున్నాడు- జీవుఁడిచ్చటకు వచ్చి చేయ వలసినదేమి? జనన మరణములేమి? మరణానంతరమగు గతి యేమి? అనునిట్టి సమస్యలే నాముందర నిలిచి యుండెను- వీనిని గూర్చి విచారింపవలసిన యక్కఱ యెప్పుడును పొడసూప లేదు- కాని యీయధ్యయనము నన్నీ విషయములపై నాలో చింప బాధింపఁదొడఁగెను. ఈ యధ్యాయమునందలి నాల్గవ మంత్రమే యిది:—

అశ్వత్థే వో నిషదనం పర్ణే వో వసతి ష్కృతా
గోభాజ ఇత్కిలాసథ యత్సనవథ పూరుషమ్.

"రేపటివరఁకు ప్రపంచమును నిలునివమ్ము, నిలువకపోనిమ్ము ఇట్టియనిత్య ప్రపంచమున మీరలున్నారు. పత్రములవలె చం చలమైన శరీరమునందు మిమ్ము భగవంతుఁడు నివసింపఁజేసి యున్నాఁడు. కాని మీరింద్రియములకే దాసులైయున్నారు-

పరమాత్మునిని భజింపుఁడు. దీనినుండియే మీకు కళ్యాణము చేకూరును-" దయానంద సరస్వతీ స్వాములవారు దీనికి భావార్థము చేయుచు నీవిధముగా లిఖించియున్నారు- "మనుష్యులు నిత్యమైన సంసారమునందును, అనిత్యమైన శరీరాది పదార్థములను పొందుచు, క్షణభంగురమైన జీవితమునందు ధర్మాచరణముతో, నిత్యుఁడగు పరమేశ్వరు ననుసాసించుచు, ఆత్మ పరమాత్మల సంయోగమువలన నుత్పన్నమగు నిత్యసుఖమును పొందవలెను-

ఏమికాంగడే నివాసులు 5వ ఏప్రిల్ నాఁడు యేమగునది యెఱుఁగియుండిరా? బీహారువాసవ్యులు పగటివేళ తమతమ కార్యములందుఁ బ్రవేశించియుండిరి. కొందరు అంగళ్లలోఁ గూర్చుండియు, వీధులలో నడచుచు నుండిరి- తల్లులు తమబిడ్డలకు పాలిచ్చుచును, యేమియుఁ దెలియని బాలకులాడుచును, పాడుచును నుండిరి- ఈవిధముగ నందరును వారివారి పనులయందు మగ్నులై యుండ సహస్రసంఖ్యాకులు మృత్యు గహ్వరమున బ్రవేశించునంతగా భూమికంపింపసాగెను. విశాలమైన యట్టాలకములు భూపతనమైపోయినవి. నవ్వుచుండిన కుట్టివాండ్రేడువసాగిరి- బాజారులు శుభ్రముచేయు సమయమున సైకిళ్ళమీఁద నేపడియుండిన, సైకిళ్ళస్వారి చేయువారి శవములు గన్పట్టినవి- వారికిదిగుటకైనను తడవులేదయ్యెను- అందరును యెక్కడివారక్కడ మృత్యుగ్రాసమైపోయిరి- త్రవ్వించి శవముల పైకిదీయుసమయమున నేనక్కడనేయుంటిని- నా

యెదుటనె యొకయింటిని త్రవ్విరి. అందిరువురి కళేబరములు వెళ్లినవి- తల్లి బిడ్డనెత్తుకొని స్నానము చేయుచుండినది. సబ్బు బిళ్లఆమె చేతిలోననెయున్నది. మృత్యువు సమీపించునపుడు సబ్బుబిళ్లను క్రింద బెట్టుటకైనను విరామముకలుగలేదు- నిజము మాత్రమింతియు:—

"ఎలమి జీవించుట యేమినమ్మకము,
జలబుద్బుదము మనుష్య శరీరమనఁగ"

క్వెట్టానివాసులు వారి యదృష్ట మేమిధముగానున్నదియు నెఱింగియుండిరా? ఇరువదితొమ్మిదవ జూలై నాఁటిరాత్రి యెంతసంతోషముతో, నెంతయుత్సాహముతో, నెంతయుల్లాసముతో మనస్సునం దెన్నెన్నియూహలు గలిగి వారుశయించియుండిరోగదా! ఎందరు వివాహ ప్రథమ నిశాకంకణమును ధరించియుండిరో? ఎందరు యువతులు పెండ్లివసువు నలఁదియుండిరో? కాని రాత్రియందలి నిబిడాంధకారమున భూకంపముయొక్క యొకత్రోపుచేతనే యాయాశలన్నియును నీట గలిసినవి. శృంగారపూర్ణమైన పట్టణము మట్టికుప్పయైపోయినది. దలకోలఁదిగా మరణించిరి. సహస్రసంఖ్యాకులు ఏడ్చుటకు జీవించియుండిరి. ఏవిషయమును జూచి మనుష్యుఁడంతగా గర్వించును? యేమియోచించి యంతయమూల్యమైన జీవితమును వ్యర్థకార్యములందు వ్యయపెట్టుచుండును? ఓమనసా! యిప్పుడైనను నీవీ విషయమునుగూర్చి యోచించితివా?

చెట్టుయొక్క యాకులవలె నీశరీరమెప్పుడు పడిపోవున దియు నెవ్వఁడును వచింపఁజాలఁడు. ఎంతవరకిది వృక్షముతోడ నంటియున్నదో యంతవరఁకు సదుపయోగ మెందులకుచేయ రాదు? ఏమిమనసా! నీయిచ్ఛయేమియో చెప్పుము! ఈయల్ప కాలమునందెంతయో బాల్యావస్థయందు వ్యతీతమైపోయినది, ఎంతయో విద్యయందు గడచిపోయినది. ఎంతయో రోగము లందును వానియొక్క చికిత్సలయందును జరిగిపోయినది. ఎంత యోశరీర రక్షణమునందు గతమైనది. మరియు నెంతయో విష యవాసనా సంతృప్తికొరకు నష్టమైనది. ఇఁక నేమిచేయ నిశ్చ యింతువు? ఇప్పుడేశ్వాసలు సమాప్తమగుననియు, లేక కొంత కాలము తరువాత మునిగిపోవుననియు నెవ్వఁడెరుఁగును? నీవి శేషించినకాలమునైనను వృథాగాఁ గడుపఁగోరుదువా లేక సదుపయోగము చేయనిచ్ఛగింతువా? జీవితముయొక్క ముఖ్యో ద్దేశమును భగవానుఁడు తెలిపియేయున్నాఁడు. అదియన్నదో "భక్తి" అనిత్యశరీరమునందు నివసించు రెండునిత్యమైన జ్యో తుల సంయోగము. ఆత్మ, పరమాత్మల యోగము.

రాళ్ళతోనిండియున్న నది: —

యజుర్వేదము ౩౫ వ యధ్యాయముయొక్క పదవ మంత్రమునందిట్లుచెప్పఁబడియున్నది. —

అశ్మన్వతీరయతే సంరభధ్వముత్తిష్ఠత ప్రతరతాసఖాయః
అత్రాజహీమోఽశివాయే అసఞ్ఛివాన్వయముత్తరేమాభివాజాన్

"ఱాళ్లతో నిండియున్న సంసారరూపమగు నీనది ప్రవహించుచున్నది. ఓమిత్రులారా! ( దీనిని దాటుటకొఱకు ) నడుముకట్టుకొనుఁడు. లెండు. దాటిన పిదపనే సేదఁదీర్చుకొనుఁడు. దుఃఖదాయకములగు బంధనముల నిచ్చటనే వదలిపెట్టి కల్యాణప్రదమగు సత్యబలమును, ఆత్మబలముయొక్క నమ్మకముమీఁదనే దీనిని తరింపుఁడు. ఎన్నియో జారుడుబండలు గలవు. ఇందెంతమాత్రము ధ్యానము తప్పినను జారుటసిద్ధము సుఁడీ!

భర్తృహరి యీనది నిట్లువర్ణించియున్నాఁడు:—

శ్లో॥ ఆశానామనదీ మనోరథజలా తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ
మోహావర్త సుదుస్తరాఽతిగహనా ప్రోత్తుంగచింతాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నందంతి యోగీశ్వరాః॥

"ఆశానామముగల యీనదియందు మనోరథరూపమైన జలమునిండియున్నది. దీనియందు తృష్ణయను తరంగములును, రాగమను మొసళ్లునుగలవు. నానావిధములైన తర్కవితర్కములను పక్షులుగలవు. ఈనది ధైర్యమనెడు వృక్షము నూడఁబెఱుకునట్టిది. మోహమే దీనియందలి భయంకరమగు సుడిగుండము. చింతయనునది దీనికి నెత్తైనయొడ్డులు ఇట్టి యేటిని శుద్ధమనసశీలురగు యోగీశ్వరులే దాటి యానందమును పొందుదురు."

ఓమనసా! యీయొడ్డుననె కూర్చుండి యాటలనాడు చున్నావు- నీతోడివారు దాటిపోయిరి- పైగా కారు చీకట్లల ముకొనుచున్నవి- ఇంకను నీవు పాపపుమూటను మిక్కిలి భారవంతము చేసికొనుచునె యున్నావు- బరువైన మూటనెత్తుకొని యేవిధముగ దాటఁగలుగుదువు? నీవేవిషయములను సుఖములనియు, నానంద ప్రదములనియుఁ దలపెట్టియున్నావో యవి యేమైనను ప్రయోజనదాయకములగునా? ఓ బేలా! ఇది యిచ్చటి లంపటమేసుమా! నీవేమాత్రమును వెంట ధనమును గాని, సంపత్తినిగాని, మోటారులనుగాని, బండ్లనుగాని, మరి యేమియును గొనిపోఁజాలవు. కాని నీవేయాటలయందుఁ జిక్కి యున్నావో యవిమాత్రము నీపాపపుమూట నవశ్యముగా భారవంతము గావించును. నీవీనదిని దాటునప్పుడది బాధకమై యుండఁగలదు.

ఓసీ మనసా! నీవు ప్రతిక్షణమును మూటయందు బరు వెక్కువయే చేర్చుచున్నావు. లెమ్ము. ఈమూటను వదలుము. గడచుచున్న యొక్కొక్క క్షణమమూల్యమైనది. మరల నీకు లభించునట్టిది కాదు.

"ప్రియుని పట్టణము దూరముగానున్నది. పగలున్నది. ఒడ్డునకు చేరితివి."

సడువుము, లేనిచో నీవుపీడలోఁచిక్కి వగచెదవుసుమా!

ఇఁకనే యెంత సమయము నిలిచియున్నదో దానినిప్పుడు ధర్మాచరణమునందును, భగవద్భక్తియందును

గడుపవలెను. మనజీవనోద్దేశమునుండి విముఖుల గావింపకుండు టకుగాను మనస్సునకిప్పుడొక నిమునమును విరామ మొసంగ రాదు.

ఋగ్వేదముయొక్క ప్రథమ మండలమునందు ౧౬౪ వ సూక్తమునందలి ౩౭వ, ౩౮ వ మంత్రములందు మిక్కిలి యం దముగాఁ దన్నుతాను తెలిసికొనుటయును, అనిత్య శరీరమును పయోగించి లాభము నొందు విషయమును వర్ణింపఁబడి యున్నవి; —

నవిజానామియదివేదమస్మినిణ్యః సన్నద్ధోంమనసా చరామి.
యదిమాగన్ ప్రథమజాఋతస్యా దిద్వాచోఅశ్నువే భాగమస్యా
ఋ ౧-౧౬౪-౩౭

"నేనెట్టి వస్తువనో నాకు తెలియదు. రహస్యముగాఁ జేయఁబడినట్టి నేను మనస్సుతోడ సంపూర్ణుఁడనై యిప్పుడు చరించుచున్నాను. ఎప్పుడు ఋతువు (సృష్టివిజ్ఞానము) నకగ్రజ మైన యాత్మవిజ్ఞానము నాకు లభించునో యప్పుడే నేనీ వాక్య ము (వేదము) నందుభాగమును పొందఁగలను.

మఱియును,

అపాఙ్ ప్రాఙేతి స్వధయాగృభీతోఽమర్త్యోమర్త్యేనాస యోనిః
తాశశ్వంతా విషూచీనావియంతాన్యన్యం చిక్యుర్నని చిక్యురన్యమ్.
ఋ ౧-౧౬౪-౩౮

అవినాశియగు నాత్మ యీనశించు శరీరమునుకూడు కొని మాయా వశీభూతమున క్రిందికిని, పైకిని జనుచుండును. (ఉచ్చనీచ యోనులయందు చరించుచుండును.) క్షరము, అక్ష

రము నీరెండును కలిసియుండి యెల్లప్పుడు విభిన్నగతులై యుండును. ఈరెండింటియందు లోకులొక దానిని గాంచి రెండవ దానిని గనజాలకున్నారు. ఈ యక్షరము, యానంద స్వరూపియగు మహాక్షరమును గాంచగలు యమరజీవాత్మకును మరణించు శరీరమునకును సంబం గలిగింపఁబడియున్నది. ఈశరీరము పరమాత్ముని గన్గొను సాధనముగానున్నది. ఈ సాధనమనే సాధ్యమనియెంచి పూజింపఁ దొడఁగినచో నేమిగతియగును? మనపైన పడియున్న యాత్మ సమాచార మేమగును? ఎల్లప్పుడుశరీర నిందింపుఁడని దీనిభావముకాదు. ఎల్లప్పుడునిట్లు కా ఇదిదుర్బలమైనది- ఇద్దానిని గూర్చినజ్ఞానమునే మొట్ట పొందవలయును. ఇదియే యీశ్వరమందిరము. దీనిని రూపముగ సంరక్షింపనే వలయును. దీనికిఁ జక్కఁగా నన్న దుల నివ్వవలెను. ఇదియెంత స్వాస్థ్యముగాను, పుష్టిగాను, మనో యంత శీఘ్రముగా యాత్రికుఁడు పరమేశ్వరుని చేఁగలుగును. విరిగిన మోటారుబండి తనయజమానుని స్థానమున జేర్పఁగలుగునా? అది దారిలోనే పడవైచివే జబ్బుతోనున్న గుఱ్ఱపుతట్టు తనరౌతునిల్లు చేర్పగలుగు అట్లుకాదు. అది భయదారణ్యమునందే విడచివేయు కావున యానము మంచిదిగానే యుండవలెను. ఇందువ భక్తుఁడిట్లు ప్రార్థించును.

మమాగ్నే వర్చో విహవేష్వస్తు వయన్త్వేంధానాస్తన్వం పుషేమ
మహ్యంనమంతాం ప్రదిశశ్చతస్రస్త్వయాధ్యక్షేణపృతనా జయేమ.

ఋ ౧౦-౧౨౮-౧

"ఓ అగ్నిస్వరూపివియగు ప్రభువా! జీవన సంగ్రామము లందు నాలోన తేజస్సును, కాంతియును గలుగునుగాత! నీ జ్యోతిని వెలిగించుచు మేము, శరీరమును పుష్టియుక్తముగావింతుము గాక! నల్దిక్కులును నాకు ప్రణామాలవంగునుగాక! మీరు మాయధ్యక్షులై మాచేతసమస్త విరోధివర్గమును పరాజయమొనరింపఁ జేయుదురు గాక!

కావున శరీరము స్వస్థమై బలముగలిగియుండుట నితాంతావశ్యకమేగాక యనివార్యమున్నై యున్నది.

నేను శరీరమును భోగములనుండి వంచిత మొనరింపుఁడని వచించుటలేదు. కాదు. యెన్నిభోగములనుభవింపగలుగుదువో యనుభవింపుము. కానియిది జ్ఞప్తియందుంచుకొనుఁడు.

భోగా నభుక్తా వయమేవ భుక్తాస్తపో నతప్తం వయమేవ తప్తాః
కాలో నయాతో వయమేవయాతా స్తృష్ణాన జీర్ణా వయమేవ జీర్ణాః।

నేనువిషయములననుభవింపలేదు. విషయములేనన్ననుభవించినవి. నేనుతపముచేయలేదు. తపములేనన్నుతపింపఁజేసినవి. కాలముగడవలేదు మనమేగడచిపోయితిమి? మనతృష్ణజీర్ణమైపోలేదు. మనమేవృద్ధులమై జీర్ణించితిమి.

తేనత్యక్తేన.

సాంసారిక భోగములను పొందుటనుండి యెవ్వరునడ్డగింపరు. సమస్తమును వదలిపెట్టి యకర్మణ్యుఁడవుకమ్మనియు,

రము నీరెండును కలిసియుండి యెల్లప్పుడు విభిన్నగతులుగలిగి యుండును. ఈరెండింటియందు లోకులొక దానిని గాంచుచు రెండవ దానిని గనజాలకున్నారు. ఈ యక్షరము, రెండవ యానంద స్వరూపియగు మహాక్షరమును గాంచగలుగుటకై యమరజీవాత్మకును మరణించు శరీరమునకును సంబంధము గలిగింపఁబడియున్నది. ఈశరీరము పరమాత్ముని గన్గొనుటకొక సాధనముగానున్నది. ఈ సాధనమునే సాధ్యమునియెంచి దీనినే పూజింపఁ దొడఁగినచో నేమిగతియగును? మనపైన నాధార పడియున్న యాత్మ సమాచారమేమగును? ఎల్లప్పుడుశరీరమును నిందింపుఁడని దీనిభావముకాదు. ఎల్లప్పుడునిట్లు కానేరదు. ఇదిదుర్బలమైనది- ఇద్దానిని గూర్చినజ్ఞానమునే మొట్టమొదట పొందవలయును. ఇదియే యీశ్వరమందిరము. దీనిని పూర్ణ రూపముగ సంరక్షింపనే వలయును. దీనికిఁ జక్కఁగా నన్నజలాదుల నివ్వవలెను. ఇదియెంత స్వాస్థ్యముగాను, పుష్టిగాను, నుండునో యంత శీఘ్రముగా యాత్రికుఁడు పరమేశ్వరుని గాంచఁగలుగును. విరిగిన మోటారుబండి తనయజమానుని యథాస్థానమున జేర్పఁగలుగునా? అది దారిలోనే పడవైచివేయును జబ్బుతోనున్న గుఱ్ఱపుతట్టు తనరౌతునిల్లు చేర్పగలుగునా? అట్లుకాదు. అది భయదారణ్యమునందే విడచివేయును. కావున యానము మంచిదిగానే యుండవలెను. ఇందువలన భక్తుఁడిట్లు ప్రార్థించును.

మామగ్నేవర్చో విహవేశ్వస్తు వయన్త్వేంధానాస్తన్వం పుషేమ
మహ్యంనమంతా ప్రదిశశ్చతస్రస్త్వయాధ్యక్షేణపృతనా జయేమ.
ఋ ౧౦-౧౨౮-౧

"ఓ అగ్నిస్వరూపివియగు ప్రభువా! జీవన సంగ్రామము లందు నాలోన తేజస్సును, కాంతియును గలుగునుగాక! నీ జ్యోతిని వెలిగించుచు మేము, శరీరమును పుష్టియుక్తముగావింతుము గాక! సర్దిక్కులును నా ప్రమోలవంగునుగాక! మీరు మాయధ్యక్షులై మాచేతసమస్త విరోధివర్గమును పరాజయమొనరింపఁ జేయుదురు గాక!

కావున శరీరము స్వస్థమై బలముగలిగియుండుట నితాంతావశ్యకమేగాక యనివార్యమున్నై యున్నది.

నేను శరీరమును భోగములనుండి వంచిత మొనరింపుఁడని వచించుటలేదు. కాదు. యెన్ని భోగములనుభవింపగలుగుదువో యనుభవింపుము. కానియిది జ్ఞప్తియందుంచుకొనుఁడు.

భోగా నభుక్తా వయమేవ భుక్తాస్తపో నతప్తం వయమేవ తప్తాః
కాలో నయాతో వయమేవయాతా స్తృష్ణానజీర్ణా వయమేవ జీర్ణాః ।

నేనువిషయములననుభవింపలేదు, విషయములేనన్నను భవించినవి. నేనుతపముచేయలేదు. తపములేనన్ను తపింపఁ జేసినవి. కాలముగడవలేదు మనమేగడచిపోయితిమి? మనతృష్ణజీర్ణమై పోలేదు. మనమేవృద్ధులమై జీర్ణించితిమి.
శేవత్యక్తేన.

సాంసారిక భోగములను పొందుటనుండి యెవ్వారునడ్డగింపరు. సమస్తమును వదలిపెట్టి యకర్మణ్యుఁడవుకమ్మనియు,

గృహస్థాశ్రమమును త్యజించి యేవనమునందో కూర్చుండుమని యు నెవ్వఁడునుపలుకఁడు. సంసారబంధనములకును, జంఝూట ములకును, కష్టములకును భయముచెందుచు భీరుఁడవై యుం డుమనియు, నెవ్వఁడునుప దేశింపఁడు. ఇట్లనుటకు తాత్పర్యమీ క్రిందియజుర్వేతమంత్రమును సదా సమ్ముఖమునందుంచుకొను మనియే

"తేనత్యక్తేన భుంజీథామాగృథఃకస్యస్విద్ధనమ్"

"అప్పుడు త్యాగముతో నుపభోగింపుము. గొంతెమకోరిక లను గోరకుము. (కొంచమైన నాలోచింపవలదా) ఈ దన మెవ రిది!" త్యాగభావముతో ననుభవింపుము" నేనీ దినముల లో నిజాముసర్కారువారి గుల్బర్గా జెయిలునందు బంధితుఁడ నై యున్నాను- ఈజెయిలున (8) వ వార్డునందు నివసించుచు న్నాను. ఇప్పుడీవార్డు (Ward)నా పేరనే విఖ్యాతమైపోయిన ది. మహాత్మ నారాయణస్వాములవారే వార్డునందున్నారో యయ్యది వారినామధేయముతోనే ప్రసిద్ధమైనది. రాజగురు ధురేంద్రనాథశాస్త్రిలవారు (Segregation ward) సెగ్రిగే షన్ వార్డునందు నివసించుచున్నారు- కాని యిప్పుడది సెగ్రిగే షన్ వార్డని వాడుకలోలేదు. శాస్త్రిలవారి వార్డనిచెప్పబడు చున్నది- ఈవిధముగానే శ్రీశారదాగారున్న వార్డునయితము శారదాగారివార్డనియే వ్యవహరింపఁబడుచున్నది సత్యాగ్ర హులందఱును, జెయిలుయొక్క కాషాయవర్ణమును బోలిన రంగుగుడ్డలను ధరించుచున్నారు- జెయిలుయొక్క తస్లే[పాత్ర]

యందు పప్పునుతీసికొందురు. చెంపూ (చెంబు)లోనీరును త్రాగుదురు. జెయిలుయొక్క గోనెతట్టులను, గొంగళ్ళను క్రిందపఱతురు. ఈవిధముగ జెయిలునందలి వస్తువులనెల్ల నుపయోగింతురు- కాని వానిని తమవనితలంపరు. మాబంధనదివసములనుగడుపుకొని మేము వెళ్ళిపోగలము. ఈవిశాలమైనగదులను, ఆపాత్రలను, ఆగోనెతట్టులను, గొంగళ్ళను, యిచ్చటనే విడిచిపోగలము. మమ్ములను ముక్తులఁగావించినప్పుడు మేమీవస్తువులనుకౌఁగలించుకొని మేమేమైనదుఃఖంతుము ?అట్లుగాక, నిండారు సంతసముతో వీనిని విడిచిపెట్టిజెయిలునుండి వెళ్ళిపోవగలము. దీనినే "త్యక్తేనభుంజీథా"యందురు. ఇంకొకయుదాహరణమునుజూడుఁడు ఒకయాత్రికుడు యాత్రా దినములందేదేనొకధర్మశాలయందో, సత్త్రమునందో విడిసియుండును. అచ్చట కొన్నిగంటలో లేక కొన్నిదినములో నిలిచియుండును అందలి సమస్తవస్తువుల నుపయోగించును. మంచముమీద పండుకొనును. కుర్చీలపైన కూర్చుండును. వంటపాత్రలతో వండించుకొనును. తోటలోని పూవులను గోసికొనును. పండ్లను తినును, ఇతరయాత్రికులతో వార్తాలాపముఁజేయును. ఆడుచుండును. కాని యతని మనస్సునందెప్పుడును నేనీవస్తువులన్నింటికిని యజమానిననిగాని, నేనీయన్నింటిని వెంటగొనిపోవుదుననిగానితలంపు రాదు. అతఁడీవస్తువులననుభవించుచున్నను వానియందు లిప్తుఁడుకాఁడు. తన్నుదాను వానికి యజమానిగాను లేక దాసుఁడుగాను భావింపడు. స్వామిభావము, దాస

భావములను రెండింటికిని పైననుండి తన్నుచున్న దాను కేవలమొక యాత్రికుడననియే తలంచును. అతడులోభము గలిగియుండెనా చిక్కుకొనిపోవును, పట్టుపడును, బంధితుడగును.

మనస్సులో భియగుటయు నెందులకు? తుదకీధనము మాత్రమెవరిది? ఏమీ యీ ధనము రావణునిదై యుండెనా? ఏమి, కంసుడు దీనికిప్రభువై యుండెనా? ఔరంగజేబు మరియు కారూనుయొద్ద నిదియుండెనా? మొగలుపాదుషాలది యయ్యెనా? లేక మరియెవ్వరిదేనియు నయ్యెనా? ఎవ్వరిదియును కాదు. ఓ తెలివిలేని యాత్రికుడా! యెవ్వరిదియుగాదు. ఇది కేవలము భగవంతునిదే. నీవు దీనినెంతవరకు సమకూర్చగలవు? ఏమి నీవిట్లుజేయుటవలన సుఖివై యుండగలవా? ఒకవేళ నటులనే యైన ప్రస్తుతకాలమున నందరికంటెను ధనికుడగు నమెరికా వాస్తవ్యుడు తన్ను దానందరికంటెను దుఃఖితుడనని తెలుపు కొనును. మి- హెన్రీఫోర్డుయొక్క వార్షికాదాయము ౫౪౦౦౦౦౦౦ డాలర్లు. అనగా (౨౦౦౦౦) పౌండ్లు లేక పదు నారు లక్షల రూపాయీలు ప్రతిదిన మగుచున్నది. ఈ సమయమున నతనియొద్ద ౪౭ కోట్ల పౌండ్లు రొక్కము మరియు సంపత్తియుగలదు. కాని ఇంతధన మతనికెట్టి సౌఖ్యవిశేష మిచ్చుటలేదు. కావున కేవల ధనమే సుఖకారణము కానేరదు.

నేను ధనోపార్జనమునకు విరుద్ధముగా నున్నానని దీని భావముకాదు. ధర్మన్యాయములతో నార్జింపగలిగినంత

వాటకు ధనము నార్జింపుఁడు. పాపముతో ధనమును సంపాదింపకుఁడు. ఇతరులయధికారమును లాగికొని మీరు సుఖులైయుండగలరని యనుకొనవలదు.

అథర్వవేద మిట్లువచించుచున్నది:—

అమా కృత్వా పాప్మానం యస్తేనాన్యం జిఘాంసతి
అశ్మానస్తస్యాం దగ్ధాయాం బహులాః ఫట్కరిక్రతి, (౪-౧౮)

"ఎవఁడు పాపముచేయుచు నితరులకు హానికలిగింపఁ గోరుచున్నాఁడో (అతఁడుపొరపాటుచేయుచున్నాఁడు.) అచిర కాలములోనే యనేకములగురాళ్లు అతని శిరముపైన పటపటమని పడఁగలవు."

పాపముచేయువాఁ డితరులను మోసగించి తాను తప్పించుకొనియే యుండఁగలనని మోసపోరాదు. ఒక సమయమున నతనిపాపములు బ్రాల్లై వాని తలనుబగులఁగొట్టఁగలవు. ఇందువలన ధనముకొరకు పాపమును చేయకుఁడు. దీనినిమాత్రము సంపాదింపుఁడు, కాని తమప్రాణమునితలంచి దానిచేతనే విక్రయింపఁబడకుఁడు.

ఈఁదుకట్టియు మునుఁగుకట్టియు నావలు:

నదియొడ్డున నిలువఁబడి మీరు నదియందు కొన్నినావలీఁదుచున్నట్లును, కొన్ని మునుఁగుచున్నట్లును చూచి యుందురు. నేను నావలకుఁగాని వానియీఁదుటకుఁగాని విరోధిని గాను. కాని నేనువాని మునుఁగుటకు మాత్రము విరో

ధిని. అవియీఁదుటకును మునుఁగుటకును గలకారణమేమి? ఈఁదుచున్న నావలకు ఛిద్రములు లేనందువలన వానిలోనికి నీరు చొరఁజాలదు. చిన్నపాటి రంధ్రమునుండి లోనికి నీరువచ్చినను బయటకుఁ బొలఁజల్లవచ్చును. ఇందుచేత నీ నావలు తామీఁదుటయేగాక యితరయాత్రికులను సయితము దాటింపఁగలుగును. మునిఁగిపోయినవానికి రంధ్రములున్నందు వలన నవి నీటిమీఁద నీఁదజాలకుండునంత నీరునిండిపోయినది. ఇఁక నిప్పుడవి తామీఁదలేక పోవుటతోఁ బాటితరులను గూడ దాటింపఁజాలకున్నవి. ధనమను నదియందుదూఁకుటలో నెట్టిహానియులేదు. బాగుగా ధనమును సంపాదింపుఁడు. కాని ధనమను నీటిని మనస్సులోనికిఁ బోనీయవలదు. ఇదిపోయెనా యిఁకమునుఁగుటయే నిశ్చయము. ధనముమీఁద మనమీఁద వచ్చునుగాని, ధనమును మనమీఁద నీఁదనీయరాదు. ఇంతటితో జీవితముచెడుటకు మారుగ బాగుపడును. అప్పుడుధన మునుజూచిన మోహముకలుగదు. మోహములేనప్పటియానం దమే యానందము! అప్పటి సుఖమే సుఖము!! ఒకతడవనొక శిష్యుఁడు తనగురువును గూర్చి "సుఖమెవరికి లభించు"నని ప్రశ్నించెను.

"హృదయము శాంతమైయున్న వానికి" అని గురువు ప్రత్యుత్తర మొసంగెను.

"ఎవనిహృదయము శాంతమైయుండును?"

"మనస్సు చంచలము గాలేనివానికి"

"ఎవనికి మనస్సు చంచలముగా నుండదు"?

"ఏవస్తువునందును అభిలాష లేనివానికి"

"అభిలాష యెవనికి లేదు?"

"ఏవస్తువునందును ఆసక్తి లేనివానికి"

"ఆసక్తి యెవనికి లేదు?"

గురువుగారు శాంతస్నిగ్ధముద్రతో "మోహము లేని
నికి" అని పలికెను.

"చాహమిటీ చింతాగయీ, మనుఆ బేపరవాహ"
జిన్ కోకుఛ్ న చాహియే, సో శాహనపతిశాహ॥

సంసారము సారమనియు, నీశరీరమునందుండు బడియు
... యదియును క్షణభంగురమేయనియు, నిదియెల్ల
...ష్టముగా దెలిసినపిమ్మట మనీయుద్దేశ్యమును పొందుట
...రకు నీ సంసారముతోను, నీశరీరముతోను, లాభ మెంతపొంద
లెనో యంతపొందుట కర్తవ్యమగుచున్నది. లాభమేమన
...నో వృత్తులను భగవద్భక్తులయట్లు గావించుకొనవలయును.

శ్వాసశ్వాసపర్ "ఓమ్" కహ వృథాజన్మమత్ ఖోయ్
క్యాజానే యిన్ శ్వాస్ కో ఆవన్ హోనహోయ్॥

భగవద్భక్తియందు తన్మయులరై శాంత శీతలమగు
...నస్సుతో కొంచెము ధ్యానమొసంగివినుడు. కవియెంత
...ధుర, ఆకర్షకస్వరముతో మిమ్ము మేల్కొలుపుచున్నాడో.

సుమిరనకర్ మన ఓమ్‌నామ్
దిన్ నీకే బీతేజాతే హైఁ

పాపగఠరియా శిర్ పర్ భారీ పగ్‌నహి ఆగేజా తేహైఁ
మాత,పితా,పతి, కుల,ధన,దారా సంగ్‌నహీఁ కోయి
ఆ తేహైఁ
దునియా,దౌలత్ , మాల్,ఖజానా, కామ్‌నహీఁకోయి
ఆ తేహైఁ
సుమిరనకర్ మన ఓమ్‌నామ్
దిన్‌నీకే బీ తేజా తేహైఁ

---

# భగవద్భక్తి

## పరమగతి యెట్లులభించును?

సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్
ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్మామనుస్మరన్
యఃప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥
(భ గీతా ౮ఆ శ్లో. ౧౨,౧౩)

"సమస్తేంద్రియద్వారములను నియమించియు, (అనగా ఇంద్రియములను విషయములనుండి నిలిపి) మనస్సును హృద్దేశమునందు స్థిరపరచియు, ప్రాణమును మస్తకమునందు స్థాపించి, యోగధారణమునందు స్థితుడై, యేపురుషుఁడు, "ఓమ్"అను నీయేకాక్షరరూప బ్రహ్మమునుచ్చరించుచు, దాని చింతనమేసలుపుచు, శరీరమును త్యజించునో యతఁడు పరమ గతినిపొందును"

కాని జీవితకాలమునందు దీనినభ్యసించినచో నే, యీ స్థితి యంత్యసమయమునందు ప్రాప్తమగును. ఇట్టియెడ నూఱు పనులను వదలియైనను దీనినభ్యసించవలెను.

# దుఃఖములకు నాశ మెట్లు కలుగును?

యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి॥

(శ్వేతా ౬.౨౦)

ఎప్పుడు మనుష్యులు చర్మమునువలె నాకాశమును ధరింపఁగలుగుదురో, అప్పుడు పరమాత్మని తెలిసికొనకముందే దుఃఖములు కడతేరును.

# భగవంతుని మందిరము

"ఎట్లు నువ్వులలో నూనెయు, చెకుముకరాతిలో నిప్పును గలదో
"అట్లే నీప్రభువు నీయందున్నాడు. మేల్కొనఁగలిగిన మేల్కొనుము."

ఇది భగవంతుని మందిరము. దీనికి మనుష్యశరీరమని పేరెందులకు వచ్చినదో తెలియదు. పరమాత్మను దర్శింప ననువగు స్థానమిదియే. నిస్సందేహముగా పరమాత్మ సర్వవ్యాపకుఁడు. ప్రతివస్తువునందగ్ని యెట్లు కలదో యట్లే యతఁడు ప్రపంచములందలి యణువణువునందును రమించుచున్నాడు. అగ్ని నెచ్చోటనైనను నాహ్వానింపుఁడు. దానిని బయల్పఱచు సాధనములను సమకూర్చుఁడు. అది యిఁకఁ గనుపడును. కాని పరమాత్మ ప్రతిచోటను; ప్రతివస్తువునందుండియును, ప్రతిచోట దృష్టిగోచరుఁడు కాఁజాలఁడు. అతనిని కేవల మీ మందిరముననే దర్శింపవచ్చును. దీనికిఁ గారణమేమనఁ బరమాత్మను జూచుకన్నులీమందిరములోపలనే తెఱువఁబడును. పరమాత్మ జీవాత్మలిందే చక్కఁగాఁ గలిసిపోవుదురు. ఈయిద్దఱికి సంగమమిందే యగుచున్నది. ఇదెట్టిమందిరమన, దీని బాహ్యద్వారముల నన్నిఁటిని మూసి లోపల మనస్సు ఏకాగ్రముగను, నిర్విషయము నై యున్నప్పుడు దేనిని జూచుటకు నుత్కంఠాలాలసలు ఆత్మ నీశరీర కారాగృహములోనికిఁ గొనివచ్చునో యట్టిప్రకాశము స్వయముగానే వెల్లడియగును. ఈజ్యోతిని దర్శించినందువలన నెట్టియానందము లభించునో దానిని వర్ణింపఁదరము కాదు. ఈస్వాదువు తానే

యనుభవింపఁదగినది. ఇదియితరులకుఁ జెప్పువిషయముగాదు. మరియు నట్లువచింప వీలునుగాదు.

వాస్కలిఋషి యొకపర్యాయము యోగీశ్వరుఁడగు శ్రీవాధవులవారి యోగాశ్రమమునకుఁబోయి "భగవన్! సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమును మీరుచూచియున్నారు. ఆ స్వరూపమెట్టిదో దానిని వర్ణింపుఁడని" వేఁడెను.

వాధవులవారు తూష్ణీంభావముననుండి యేమియును బలుకలేదు. కొంచెముసేపు తాళి, వాస్కలిఋషీశ్వరుఁడు తిరిగి దానినేప్రశ్నించెను. ఇప్పుడును వారూరకయేయుండిరి. మూఁడు నాలుగు పర్యాయములు నిటులే ప్రశ్నించిన ప్రత్యుత్తర మీమౌనమేలభించినది. మాటిమాటికి నొకేప్రశ్నమునువల్లె వేయుచుండినందువలన, వాస్కలిఋషి విసుగుగొని "నాజిజ్ఞాసకు సదుత్తరమిచ్చి నాసంతప్తహృదయము నేలశాంతమొనరింప"రని పలుకసాగిరి. అప్పుడు వాధవయోగీశ్వరులవారు మందహాసముచేసి యిట్లుపలికిరి. "ఓరీ వాస్కలీ! నీప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము వెంటవెంటనేయిచ్చుచుంటిని. నీకు బోధకురాకుఁ డిన నందు నాదోషమేమి? నాయనా! ఆస్వరూపము నొకఁడ వాక్కులోఁ దెలుపుటకుఁదగినవస్తువుగాదు. అచ్చటఁజేరి సమస్తవాణులు మౌనమునేపొందును. అందుండి మఱలివచ్చి నప్పుడేమియని చెప్పుటయందసమర్థమైయుండును. ఇట్టిమూగభాషతోడ నట్టిమాధుర్యము నెట్లుతెలుపఁగలము? నిశ్చయముగా

సత్ప్రీమాధుర్యమీమందిరమునందే లభించును. కాని ప్రపంచమునందలి యేవస్తువునందును దొరకఁజాలదు.

ఛాందోగ్యోపనిషత్తుయొక్క కడపటి ప్రపాఠకము నారంభమున "బ్రహ్మపురము" వర్ణింపఁబడినది. బ్రహ్మయన్న సర్వాంతర్యామియును సర్వవ్యాపకుఁడును. ఇఁకనతనికొక పుర మెట్లుండగలదు? ఔను, ఈమనుష్యశరీరమే యతనినగరము. దీనియందే బ్రహ్మనుగుర్తించుయోగ్యుఁడునివసించును. ఈఛాందోగ్యశబ్దములపైన ధ్యానమొసఁగుఁడు. ఋషివచనమిది.

యదిదమస్మిన్ బ్రహ్మపురేదహరం పుండరీకంవేశ్మ, దహరోఽస్మిన్నంతరాకాశః।
తస్మిన్ యదంతస్తదన్వేష్టవ్యం, తద్వావవిజిజ్ఞాసితవ్యామితి॥

"ఈబ్రహ్మపురము (శరీరము) నందొక చిన్న (హృదయ) కమలమందిరము గలదు. దీనిమందిరము నందు నొకచిన్న ఆకాశముగలదు. ఈయాకాశమునందేదికలదో దానినన్వేషింపవలయును. దానినిగూర్చిన జిజ్ఞాస సలుపవలెను" ఇదే "కమలమందిరము" భక్తుఁడును, భగవంతుఁడును గలియుచోటు. అయ్యది యీబ్రహ్మపురము లేక శరీరములోనే కలదు. ఈస్థానమునందే దానినివెదుకవలెను. ఇచ్చోటు "గుహ" యనఁబడును. దీనినిగుఱించి యజుర్వేదము 'వేనస్తత్పశ్యన్నిహితంగుహా" యనుచున్నది. తాత్పర్యమేమన జనులు ఆసద్బ్రహ్మమును, హృదయగుహయందు నిహితమైయున్నట్లుగాంతురు- ఈవిష

యమున నే యథర్వ వేదమునందలి ద్వితీయ కాండముయొక్క మొదటిమంత్రములోనే యిట్లు చెప్పబడియున్నది.

"వేనస్తత్పశ్య త్పరమంగుహాయద్యత్రవిశ్వం భవత్యేకరూపమ్"

యోగియతనిని బరమ గుహాయందుఁగాంచును. అచ్చట సమస్తవిశ్వము నొక్కరూపముగలది యగుచున్నది. అనఁగా భక్తునకు పరమాత్మునిమించి వేరువస్తువెద్దియుఁజూడఁ దగినది గానుండదు. ఇదే బ్రహ్మపురము, ముండకోపనిషత్తు నందిశబ్దములలో నుల్లేఖింపఁబడియున్నది.

"యస్సర్వజ్ఞ స్సర్వవిద్యస్య స్యైవమహిమాభువి
దివ్యేబ్రహ్మపురే హ్యేషవ్యోమ్నాత్మా ప్రతిష్ఠితః॥

"ఎయ్యది సవుస్తము నెఱుఁగుచు సమస్తమునుగ్రహించుచున్నదో, దేనిమహిమ (ప్రత్యక్షముగా) యీభూమిమీఁదఁగలదో ఆయాత్మ దివ్యబ్రహ్మపుర (హృదయము) హృదయాకాశమున నివసించును.

'స్వర్గ'మనియు, నిదియేయనబఁడును. స్వర్గము ప్రపంచమందలి ప్రదేశవిశేషముకాదు. కాని యిదేశరీరమందే యాస్వర్గముకలదు.

**దే వ తా మ ర్గ ము:—**

వేదభగవానుఁడు స్వర్గమును మిక్కిలి సుందరముగాను విపులముగాను వర్ణించియున్నాఁడు:—

అష్టాచక్రా నవద్వారా దేవానామ్ పూరయోధ్యా
తస్యాం హిరణ్మయః కోశః స్వర్గో జ్యోతిషాఽఽవృతః॥

"ఈ దేవతాదుర్గము, ఎనిమిది చక్రములు తొమ్మిదిద్వారములుగలది. దీనిని జయించుట దుష్కరము- దీనియందు జ్యోతిస్సుతో నిండియున్న స్వర్గమున్నది. దీనియందే బంగారు కోశముకలదు." ఈయెనిమిది చక్రములు తొమ్మిదిద్వారములు గల యయోధ్యానగరము ఐరోపా, అమెరికా, ఆసియా, ఖండములు, అథవా అంతరిక్షలోకము లేక ద్యులోకమునందు మాత్రము కానరాదు. కాని యీనగరము ప్రతిదేశమునందును ప్రతిపట్టణమునందును ప్రతిపల్లెటూరియందును, ప్రతియింటియందును గనఁబడఁగలుగును. అయ్యది యీమనుష్యశరీరమే. మనుష్యశరీరమునందు తొమ్మిది ద్వారములుగలవు. రెండునేత్రములు, రెండుముక్కులు, రెండుచెవులు, ఒకనోరు, రెండు మలమూత్రముల విసర్జించుస్థానములు అను నీ తొమ్మిదిద్వారము లీ నగరమునకు స్పష్టముగా గానవచ్చుచున్నవి. ఇఁక నెనిమిది చక్రములు—అవియు నీశరీరమునందు గలవు. ఈశరీరమునందు క్రిందవివరింపబడిన యెనిమిది చక్రములుగలవనియు, దీనిద్వారా ప్రాణము పైకినెక్కుచు బ్రహ్మద్వారమునందుఁ బ్రవేశింపఁ గలుగుచున్నదని హఠయోగవిద్వాంసులు వచింతురు.

1. మూలాధారచక్రము
2. స్వాధిష్ఠానచక్రము.
3. మణిపూరకచక్రము
4. అనాహతచక్రము
5. హృదయచక్రము
6. విశుద్ధచక్రము

7. ఆజ్ఞాచక్రము 8- బ్రహ్మచక్రము (సహస్రారము)

మొదటి చక్రము గుదస్థానమందును, రెండవది పొత్తి కడుపునందును, మూడవది నాభియందును, నాలుగవది హృదయ సమీపమునను, అయిదవది హృదయమునందును, ఆరవది కంఠ మునను, ఏడవది భ్రూమధ్యమందును, ఎనిమిదవది శిఖకుఁగ్రింది భాగమునను గలదు.

ఎప్పుడు బ్రహ్మమును దర్శింపవలసియుండునో యప్పుడు నగరబా హ్యద్వారము లన్నింటిని బంధించి యీయెనిమిది చక్రములం దుండి స్వర్గములోనికిఁ జేరుటయగుచుండును. అప్పుడచ్చటనొక జ్యోతిస్సు గానఁబడును అందే మన పరమప్రియుఁడు దర్శనము నొసంగును.

మందిరపరిశుభ్రతః—

వేదములును, నుపనిషత్తులును, మనుష్యశరీరమే భగవం తుని మందిరమని తెలిపియున్నప్పుడు, ఏ ఆస్తికునకును నింద్య నం దేహముండనోపదు. నిశ్చయముగా నేనీ మనవిని కేవల మాస్తికవ్యక్తుల సమ్ముఖమునందే యుంచుచున్నాను. భగవా నుని యీమందిరములోనికి పూజించుటకును, భజించుటకును, వెడలుటకుముందు మందిరమును శుభ్రపరచుట యత్యంతముఖ్య ము. పూజచేయుస్థలము స్వచ్ఛముగానే యుండవలెను. శుభ్రత రెండువిధములుగా నుండును. అవి బాహ్యమనియు, నాంతరమ నియు నొప్పును. బాహ్యశుభ్రత జలాదులచే సిద్ధించును. కాని

ఆంతరశుభ్రతకు విశేషముగాఁ బ్రయత్నము చేయవలసియుండును. దానికి కొన్ని పద్ధతులున్నవి.

ప్రాతఃకాలమున నాలుగు గంటలకు పడకనుండి యవశ్యముగా మేల్కొన నియమించుకొనవలెను. శౌచాదులనుండి నివృత్తుఁడై ముఖప్రక్షాళన మొనరించుకొనవలయును. తరువాత వ్యాయామము, ఆసనాదుల నభ్యసింపవలెను. కాని శరీరము దానివలన మిక్కిలిగా నలసట జెందకుండి ప్రతియవయవస్ఫూర్తిత్వక కలుగవలెను. అప్పుడు స్నానముచేయవలయును. ఆవశ్యకమైనచో స్నానమునకుఁ బిమ్మట వ్యాయామము చేయవచ్చును. కడుపును శుభ్రపరచుకొనుటయందు మిక్కిలి శ్రద్ధవహింపవలెను. సామాన్యమార్గమున కడుపు శుభ్రముకాకున్నచో, ఆహారమునుమార్చి కడుపును శుభ్రపఱచునట్టి యాహారమునుభుజింపవలెను. ప్రతినిత్యమును కడుపు శుభ్రముకాని వారు చేతి తిరుగలితో విసరిన ముదుకపిండిరొట్టెను భుజింపవలయును. పచ్చని తాజాకూరగాయల నెక్కువగా తినవలయును. పాలు విశేషముగా త్రాగవలయును. నేతిలో వేయించిన హారీతకిని (కరక్కాయను) సేవింపవలయును. ఈవిధులచేతను నుదరశుద్ధికానివారు తిరిగి మాసములో నొకటిరెండుపర్యాయములు వస్తికర్మ (ఎనీమా) చేసికొనవలయును.

నాడీశుద్ధి:-

ఉదరశుద్ధికిఁ బిమ్మట నాడీశుద్ధి యవసరమైయుండును. దీనిశుద్ధికొఱకై అనేకవిధములైన ప్రాణాయామములు తెలుపఁ

బడియున్నవి. భస్త్రిక 1. ప్రాణాయామమువలన నాడీమలము దూరమగుచున్నది.

రేచక, కుంభక, పూరకములవలన ధారణాశక్తి వృద్ధిబొందును- చిన్నచిన్న నాడీదోషములు దూరమగును. కాని, ఆరంభముచేయుటకుముందు దాని విధానములునేర్చుకొనవలయును ఇక ప్రాణాయామము నేర్చుకొనుచుండి యెదంభుల మోసములోనో చిక్కరాదనుమాట జ్ఞాపకముంచుకొననగును. నేడు రేపు యోగవిద్యపేరుపెట్టి యనేకవిధుల దోచుకొనుట జరుగుచున్నది. సభ్యసమాజములోను ఇట్టివారు కొందరుచేరియున్నారు. భగవద్భక్తులనెందరినో వారెల్లకాలమువరకును రోగులుగాఁజేసియున్నారు. ఈవీరు హఠయోగసంబంధమైన కొన్నిప్రయోగముల జేయింతురు. దానివలన నీభగవన్మందిరము సంపూర్ణముగాఁజెడిపోవును. కావున వారినుండి కాపాడుకొనఁదగును. భగవన్మందిర పారిశుద్ధ్యమనఁగా మందిరమును పడగొ

---

1 ఏవిధముగా కొలిమితిత్తియందు వాయువునింపి వదలిపెట్టబడుచున్నదో యట్టులే భస్త్రిక ప్రాణాయామ మాచరింపబడును, నాశికాద్వారములు మొదట మెల్లమెల్లగాను, తీవ్రముగాను, పిదప త్వరత్వరగాను శ్వాసము గైకొనఁబడుచున్నది ఒకేసారి పదినిమిషములను మించి భస్త్రిక ప్రాణాయామము చేయరాదు. వాయువు శుభ్రమైయున్నట్టియు, యెక్కువగా వేడిమిలేనట్టియు స్థానమునందుగూర్చుండి భస్త్రిక ప్రాణాయామము నభ్యసింపనగును.

ట్టుటకాదని, బాగుగా నెఱుంగవలయును. యోగదర్శన సాధన పాదమునందిట్లు వ్రాయఁబడియున్నది. "ఎప్పుడు మనుజుఁడు ప్రాణాయామము చేయుచున్నాఁడో యప్పుడు ప్రతిక్షణమును ముందు, ఉత్తరోత్తరకాలమున నశుభ్రతయొక్క నాశనమును జ్ఞానముయొక్క ప్రకాశమును గలుగుచుండును. ఇవ్విధము గానే భగవంతుఁడగు మనువిట్లు వచించియున్నాఁడు: ఏవిధముగానగ్నియందు తపింపజేసినందువలన సువర్ణాదిధాతువుల మాలిన్యమునశించి యవి పరిశుద్ధములగుచున్నవో యటులే ప్రాణాయామమువలన నింద్రియముల దోషములన్నియుక్షీణించి నిర్మలములగుచుండును.

## మనశ్శుద్ధి:—

నాడీశుద్ధియేకాక మనశ్శుద్ధియు నవసరమైయున్నది. ఉపనిషత్తులో మనస్సన్నముతో కలుగుచున్నదని తెలుపఁబడియున్నది. అట్లని శరీరమంతయు నన్నముతోనే గలుగుచున్నది. కాని శరీరమన్నముయొక్క స్థూలభాగముచేతను, మనస్సు సూక్ష్మభాగముచేతనుగలుగుచున్నది. ఎట్టిభావముతోడను, ఏక యెట్టిసాధనముతోడను, అన్నమార్జింపఁ బడుచున్నదో దాని సూక్ష్మమైనప్రభావ మవశ్యముగా మనస్సుపైన పడుచున్నది) అన్నము నార్జించుటయందసత్యము, దంభము, మోసము, పరపీడనము లుపయోగింపఁబడినచో నట్టియన్నమును భుజించినందువలన మనస్సుపైననట్టిప్రభావమే పడుచున్నది. ఇట్టి ప్రభావము శీఘ్రముగా బోధకువచ్చినను రాకపోయినను, నేదో

యొకసమయమునందీ ప్రభావము జాగృతమై మనుష్యుని నట్టిపనులనే జేయ బాధించుననుట నిశ్చితవిషయము. ఈతుచ్ఛమైన అన్నముయొక్క ప్రభావమే భీష్మపితామహునివంటి సుప్రతిని, బాలబ్రహ్మచారిని సయితము సత్యన్యాయములపక్షమును త్యజించి యత్యాచారియగు దుర్యోధనుని వెంబడించుటకు వివశునిగాఁ జేసివైచినది. భీష్మపితామహుఁడు న్యాయముగానే మహాభారతము నందన్నముయొక్క యీప్రభావము నంగీకరించియున్నాఁడు. అందువలన మనశ్శుద్ధికొఱకు, మనయన్నము శుద్ధమైనట్టియు, ధర్మముతోను, బాహుబలముచేతను సంపాదింపఁబడినట్టిదియు నైయుండు టన్నిఁటికంటెను మొదటియావశ్యకవిషయము. దీనితోఁబాటు, అన్నమును, వికారములనుబొందింపనట్టియు, తామసికము గానట్టియు, రీతిని భుజింపవలెను. ఏమనుష్యులు మిరెపకాయలను, తేయాకు, కాఫీసారమమున్నగువానిని మిక్కిలిగా నుపయోగింతురో వారిస్వభావములందు కాఠిన్యము వృద్ధియగును. సహనశీలత తక్కువగును. వారిమనస్సధిక చంచలమైయుండును. వారుచాలాకాలము పద్మాసనముపైన గూర్చుండజాలరు. ఇటలీదేశీయ భక్తుఁడగు పాయిథోగోరసు (Pythagoras) సిద్ధాంతమును "మనుష్యుని మనస్సు వానికడుపులోనికి భోజనముద్వారా చేరువస్తువులపై నాధారపడియుండు"ననికలదు.

మనశ్శుద్ధికి రెండవయుపాయమేమన దీనిని దుస్సంకల్పములనుండియు, దుర్విచారములనుండియు, వేఱుగా నుంచవలె

ను. మనస్సెప్పుడును నూరక నొకచోటనుండునట్టిశక్తిగాదు. ఇందువలననే భగవద్గీతయందు చంచలమైనట్టిదనియు, ప్రమథనభావము గలిగినట్టిదనియు చెప్పఁబడియున్నది. ఇదినిశ్చలమైన కానేకా నేరదు. దీనిని విచారములనుండి శూన్యమొనరించుటకొఱకును, చాల దీర్ఘకాలముపట్టును. కావున మొదట మనస్సును శుభసంకల్పములందుఁ జేర్పవలెను. యజుర్వేదమున ౩౪ వ యధ్యాయమునందిందులకే ఆరుమంత్రములందు ప్రతిదానిలో ననేకసారులు 'తన్మేమనశ్శివసంకల్పమస్తు' అనగా నామనస్సు సదాశివసంకల్పములుగలదై యుండుగాతమని ప్రార్థనముగలదు.

సత్సంకల్పములను సువిచారములను మనస్సులోనికి గొనివచ్చితిమేని, యిఁక పనికిమాలినవిచారములు మనస్సునందు స్థానమునుగాంచక తమంతటఁదామే మఱలిపోవును.

శీశమ్ఛలిసైనఁ బసీ, పర్ ఛబీకహాఁ సమాయ్।
భరీసరాయరహీమ్ లఖిఅవ్ పథిక్ ఫిర్ జాయ్॥

బ్రహ్మచర్యము:—

ఇవ్విధముగ మందిరముయొక్క లోపలను వెలుపలను శుభ్రతవైనపిదప నప్పుడీమందిరమునఁ గూర్చుండి భగవంతుని నారాధించుట కర్హత భక్తునకులభించుచున్నది. అప్పుడు భగవానునిసమీపమున గూర్చున్నవాడును, మిక్కిలి సమీపస్థుడును నగుచున్నాడు. కాని యీయన్నివిషయములతోఁబాటు భగవన్మందిరరక్షకము బ్రహ్మచర్యమను నావశ్యకవిషయమును

సదా జ్ఞాపకమునందుంచుకొనవలెను. ఏమనుష్యులు తమశరీరము యొక్క వాస్తవిక తత్త్వము లేక సారమును బయటపాఱవైచుచు రక్షింపకున్నారో వారుతమ తెలివితక్కువతనమునుగూర్చి దుఃఖింపఁగలరు. అట్టిక్షణికమైనట్టియు, నసత్యమైనట్టియు, కల్పితమైనట్టియు, ఆనందముకొఱకుతమఅమూల్యమైన రత్నము ను దుర్వ్యయముచేయుచున్నారు. వారుతమచేతులతోనే తమ కాళ్లపైన గొడ్డటి వేటువైచుకొనినట్లు సర్వనాశనమును గావించుకొనుచున్నారు.

వీర్యము శరీరమునందు మనస్సునకును ప్రాణమునకును మాత్రమేకాక ఆత్మకునయితము శక్తినొసఁగునట్టిది. ఈశరీరమునందాత్మకే మేని. మేలులభించినను నదివీర్యమువలననేలభింపఁగల దు. ఆత్మ సూక్ష్మమైనది. ఇదెట్టిస్థూలవస్తువునైనను గ్రహింపఁ బోదు. కానిసూక్ష్మమును గ్రహింపఁగలది యొకవీర్యమే. దీని సమూహము శరీరమునందు ప్రోగుచేయఁబడినప్పుడు తిరిగి దీని సారముగ్రహింపఁబడి దానినుండి, ఓజస్సుగలుగును. ఓజస్సొక సూక్ష్మతత్త్వము. దీనిని ఆత్మగ్రహించి మిక్కిలిబలవంతమై, ఓజస్వియగుచున్నది. ఓజస్వియగునాత్మ ఓజస్వియగుపరమాత్మతోడ మైత్రికిన ర్హతను బొంది పరమాత్మను మాటిమాటికి తోడఁగూర్చుండ నాశ్వాసించును.

"ఓజోసి ఓజోమయిదేహి"

అట్టిచో భగవన్మందిరముయొక్క యిట్టిమూలతత్త్వము పైపున విశేషించి ధ్యానమొసఁగవలెను. స్థూలభోజనము లేక

అన్న మేప్రకారముగా సూక్ష్మతత్త్వమగుచున్నదో దానివిధి యిట్లు:

తినఁబడుచున్న యన్నమునుండి మొట్టమొదట దాని రసముపుట్టుచున్నది. రసము రక్తమునందుఁబరివర్తనమగుచున్నది. రక్తమును సారముగానొడియఁగట్ట మాంసముకలుగుచున్నది. మాంసమునుండి మేదస్సును, మేదస్సునుండి అస్థియు, అస్థినుండిమజ్జయు, మజ్జనుండివీర్యము. ఈవీర్యము పరిమాణమునఁ గొంచముగానుండును. దీనిని శరీరమునందుఁ గాపాడియుంచియు దుర్విచారములనుండియు, అపవిత్ర గాథలనుండియు, అశ్లీలములైన సినిమా(చలనచిత్ర) విహారములనుండియు, రక్షించి, దీని ముఖము క్రిందివైపునకుఁగాకుండ నూర్ధ్వముగాఁ జేసితి నేని యీ పూడావీర్యము చాలకాలమునకుఁ బరిపక్వమై ఓజస్సుపుట్టఁదొడఁగును. ఓజస్సు రెండువిధములుగానుండును. ఒకటి పరఓజస్సు రెండవది అపరఓజస్సు. ఈఓజస్సంతమునందు సూక్ష్మమై ఆత్మకుపయోగపడుచుండును. వేదభగవానుఁడు బ్రహ్మచర్యమును నియతము భగవత్ప్రాప్తికి గొప్పసాధనముగాఁ దెలుపుచున్నాఁడు. స్వామిదయానందులవారు నిట్లువచించియున్నారు:

"ఏగృహస్థుఁడునియమానుసారముగాఁ జరించుచు, మర్యాదలలోనుండునో యతనిని నియతము బ్రహ్మచారులలోనే గణింపనగును."

అందుచేత వీర్యముయొక్క అమూల్యతనునంకితముచేసికొని దీనిని తమఆత్మకొరకు సురక్షిత మొనరించుకొనవలెను.

ఇదియే భగవన్మందిరమూలతత్త్వము. ఇదికూలఁదొడఁగిన మందిరము కూలిపోసాగును. మందిరము పడిపోసాగినప్పుడు పూజారియొక్క సర్వనాశనము ప్రళయస్వరూపమునఁదాండవించును. కావునఁ బూర్ణయత్నముతోడ దీనిని రక్షింపవలెను.

# భగవద్భక్తి విధి

"ఏమనుష్యుడు సత్యమైన ప్రేమచేతను, భక్తిచేతను, పరమేశ్వరునుపాసించునో, యట్టియుపాసకులను పరమకృపాళుండును, నంతర్యామియునగు పరమేశ్వరుండు మోక్ష సుఖమునిచ్చి యెల్లప్పటికిని నానందయుక్తులంగావించును"

దయానందుడు.

సత్యార్థప్రకాశముయొక్క యేడవసముల్లాసమునందు స్వాములవారిట్లు వ్రాయుచున్నారు.

"ఎవండేనియు నుపాసననారంభింపంగోరిన నతనికినుపాసన, ఎవరితోను వైరముగలిగియుండకుండుట, ఎల్లప్పుడందరితోడను ప్రీతిపూర్వకముగా వర్తించుట, సత్యముచెప్పుట, దొంగిలింపకుండుట, సత్యవ్యవహారముచేయుట, జితేంద్రియుండై యుండుట, లంపటుడుగాకుండుట, నిరభిమానియైయుండుట అను వానితోనే యారంభమగుచున్నది"

ఇదియుపాసనకు సంసిద్ధతయైనది. కాని యెట్లుపాసింపవలసినదను విషయమును మహర్షి యిట్లువర్ణించియున్నాండు:

"ఉపాసింపవలసినప్పు డేకాంతపరిశుద్ధప్రదేశమునకుంబోయి ఆసనము వేసికొని, ప్రాణాయామముచేసి, బాహ్యవిషయములనుండి యింద్రియములనునిల్పి, మనస్సును నాభిప్రదేశమునందైనను, లేక హృదయ, కంఠ, నేత్ర, శిఖలయందైనను లేక వెన్నెముక

పడు. * యోగవిధియననేమి యనువిషయము యోగదర్శనము
నందు తెలుపఁబడియున్నది. ఏ భక్తుఁడైనను యమ నియమ
ములను పాలింపకయే ఆసనప్రాణాయామ ప్రత్యాహారధారణ
ధ్యానములను ప్రయోగింపకయే తాను భగవంతుని గాంచఁగ
నని తలంచుటతని పొరపాటు. కొద్దిగనో గొప్పగనో యె
ట్లైనను నీ సాధనములను యంత్రములనుండి భక్తుఁడు చనవల

---

* యోగముయొక్క యెనిమిదంగము లిట్లు వివరింపబడియున్నవి: —
౧. యమము ౨. నియమము, 3. ఆసనము, ౪. ప్రాణాయామము,
౫. ప్రత్యాహారము, ౬. ధారణ, ౭. ధ్యానము, ౮. సమాధి.

యమము — 1. అహింస, 2. సత్యము: 3. అస్తేయము, [దొంగిలింపకుండుట) 4 బ్రహ్మచర్యము, 5 అపరిగ్రహము (భోగసాధనము సమకూర్చు లోభము కలిగియుండకుండుట)

నియమము — 1 శౌచము, 2 సంతోషము, 3 తపము, 4 స్వాధ్యాయము, 5 ఈశ్వరప్రణిధానము [ఈశ్వరార్పణముగ కర్మనుచేయుట].

ఆసనము — సిద్ధ, పద్మ, సుఖాసనాదులు

ప్రాణాయామము — రేచక, కుంభక, భస్త్రాదులు

ప్రత్యాహారము — ఇంద్రియములను నిర్విషయములనుగాఁజేయుట

ధారణము — నాసికాగ్రమునఁగాని, హృదయమునందుఁగాని, భ్రూమధ్యమందుఁగాని చిత్తమును కేంద్రీకరించియుంచుట

ధ్యానము — ధారణమును వరుసగా జరుపుకొనుచుండుట

సమాధి — ధ్యానముచేయువాఁడును, ధ్యానమును, భగవంతుఁడును ఒకటియైపోవుట. భక్తుఁడు, భక్తి, భగవంతుఁడు అను వానిలో నెట్టిభేదమును లేకుండుట.

తోయుండును. దయానంద మహర్షులవారు తమ ఋగ్వేదాది భాష్యభూమికయందు నిట్లులిఖించియున్నారు.

"ఈ యుపాసనా యోగము దుర్జనులకుఁ బ్రాప్తింపదు. ఏలన మనుష్యుఁడెంతవఱకు దుష్కార్యములనుండి వేఱై తన మనస్సును శాంతియుక్తముగను ఆత్మను బురుషార్థిగాఁ గావింపఁడో యటులే లోపలి వ్యవహారములను శుద్ధమొనరింపఁడో, యంతదనుక నెంతచదివియున్నను, విన్నను, నతఁడీశ్వర ప్రాప్తి యెన్నటికిని గానేరదు."

మనస్సునకు యమనియమాది స్థానములఁ గడువనిది భక్తి యోగ్యతయే చేకూరదు. మనోవృత్తి హింసాభావము లేనట్టిదిగను, చౌర్యచింతనము చేయనట్టిదిగను సత్య బ్రహ్మచర్యములనధిరోహించి, లోభములం దెక్కువగఁ జిక్కకయు సంతోష తపములచేతఁ దనవృత్తిని భక్తులయట్లొనర్చుకొనునట్లుగను నుండవలెను. ఈవిధమైన ప్రవృత్తి చేయుట యందీశ్వరునిపైన సంపూర్ణవిశ్వాసమును నతని యభీష్టముమీఁదనే చరించునట్టి స్వభావమును మార్చుకొనుటయు, వేదోపనిషద్గీతాదుల స్వాధ్యాయము, చాల సహాయకములు.

దీనికిఁ బిమ్మట నాసనములగతి వచ్చును. ఎన్నియో యాసనములు కేవలశరీర రక్షణముకొఱకును, కొన్ని మనస్సు నేకాగ్రము గావించునిమిత్తమును గలవు. పద్మాసనము, సిద్ధాసనము విశేషించి యుపయోగపడును. కాని యేయాసనముపై నఁగూర్చుండినను సుఖముతోఁ గూర్చుండవలెను. ఆయాసనము

నసెంతమాత్రమును శ్రమలేక గం 3-3౦ కాలము కనీసపక్ష మునఁ గూర్చుండఁగలిగి యుండవలెను. ఏదేనియొక యాసనమును గ్రహించి దానియందే శరీరమును కదలింపక అథమపక్షము మూఁడున్నర గంటలకాలము కూర్చుండ ప్రతిదినము నభ్యసింపుఁడు. మనస్సును స్థిరపరచుటకుఁ బూర్వము శరీరమును తనవశములోనికిఁ దెచ్చుకొనవలెను. శరీరమే వశమున లేనివానికి మనస్సెప్పటికిని వశములోనుండ నేరదు. ఒకే యాసనమునందు నిరంతరముగ (3-3౦) గంటలకాలము గూర్చుండు నభ్యాసముతోఁబాటు ప్రాణాయామాభ్యాసమును చేయవలెను. మహర్షులవారు ఋగ్వేదాది భాష్యభూమికయందు ౧ ఉపాసనా విషయమునిట్లు వ్రాసియున్నారు. "భోజనము చేసిన తరువాతనే విధముగా వమన మగుచున్నదో యటులే లోపలివాయువును బయటకుఁదీసి వైచి సుఖముగా నెంతకాలము వీలయినఁ నంతవరకు నారీతిగానే బయటనిలిపివేయుము. తిరిగి మెల్లమెల్లగా లోనికిఁ గొనియటులే చేయునది. ఇవ్విధముగ నభ్యాసమును మాటిమాటికిఁ జేయుచున్నందువలనఁ బ్రాణముపాసకుని వశములోనికి రాఁగలదు. ప్రాణము స్థిరమైనందునఁ నాత్మయును స్థిరమైయుండును. ఈమూఁడును స్థిరమగుచున్న సమయమున మనయాత్మయందున్న యానందస్వరూపుఁడును, అంతర్యామియును, వ్యాపకుఁడునునగు పరమేశ్వరుని స్వరూపమున మగ్నమై పోవలయును-ఏరీతిని మనుష్యుఁడు నీటియందు మునక వేసి పైకిఁ దేలుచుఁ

---

౧ శ్రీమహాత్మ నారాయణస్వాములవారి యోగరహస్యమును జూడుఁడు,

తిరిగి మున్కవేయుచున్నాఁడో యటులే మనయాత్మయును బరమేశ్వరునియందు మగ్నమగుచుండవలయును."

శరీరమాసనము వలనను, ప్రాణము ప్రాణాయామము చేతను స్థిరమైపోయినందున మనస్సుస్థిరమైయుండుట స్వాభావిక మగుచున్నది. ఏలనఁ బ్రాణముతోఁడ మనస్సునకు దృఢమైన సంబంధము గలదు.

ప్రాణాయామము:--

ప్రాణాయామము నారంభించుటకుఁ బూర్వము రెండు ముక్కులను స్నానముచేయింపవలెను. నాసికాస్నానవిధియెట్లన, చేతిలోగాని పాత్ర(గ్లాసు)లోగాని జలమునుదీసికొని ముక్కులోనికి శ్వాసము ద్వారాపీల్చి ఆనీటిని క్రిందికి వదలవలయును. ఇవ్విధముగ నైదాఱుమారులు చేసికొను చున్నందువలన ముక్కులు స్వచ్ఛమై కఫముతక్కువైపోవుచున్నది. ప్రాణాయామము సయితమప్పుడే చక్కఁగాఁ జేయననువగుచున్నది-

ఆసనమునఁ గూర్చుండి నడుమును మెడను నిలారుగా నుంచవలయును. చాలయధికముగా బిగించియును గూర్చుండరాదు. మొదటఁజంద్ర (ఎడమ) స్వరముచేత శ్వాసమును పైకిఁ బీల్చి సూర్య (కుడి) స్వరముచేత విడువవలయును. తిరిగిసూర్య స్వరముచేత శ్వాసమునుబీల్చి చంద్రస్వరముచేత విడువవలెను. ఈవిధముగ నేఁడెనిమిది మారులుచేసినతరువాత రెండుస్వరములచేతను బ్రాణవాయువును లోనికిఁగొని నాభి వరకుఁ జక్కఁగాఁ బూరించి సులభముగా నెంతదనుక నిలుపఁ

గలిగిన నంతదనుక నిలుపుఁడు. అప్పుడు వెంటనే వమనముచేసి నట్లు నాసికాద్వారముననే వాయువును బయటకువిడిచి, కడుపు లోవాయువు సంపూర్ణముగా లేకుండునట్లు చేయవలెను. కడుపునుండి గాలినిబయటకువదలు సమయమున జననేంద్రియములను పైకిలాగవలయును. శ్వాసమును బయటకువిడిచియు జననేంద్రియములనట్లే పైకిలాగియుంచవలెను. మనస్సు బాధితమైనప్పుడు తిన్నతిన్నగా ప్రాణవాయువును లోనికిఁబీల్చుకొనుఁడు. ప్రాణాయామముచేయుటకు సులభమైనవిధానమియ్యదియే. దీనియందే రేచక, పూరక, కుంభక, ప్రాణాయామములు జరుగుచుండును. ఈప్రాణాయామ మొకరినుండి నేర్వకయే చేయవచ్చును. అటుపైన నెవరేని వీతరాగులగు గురువరేణ్యులు లభించినచో వారి శరణమును పొందఁదగును.

ప్రాణాయామమువలన ప్రాణము స్థిరమై ప్రాణముతోఁబాటు మనస్సు చంచలతను విడనాడుచున్న సమయమున నింద్రియములు తమంతటఁదామే వశమగుచున్నవి. దీనినే ప్రత్యాహారమనెదరు.

ఇఁక ధారణాధ్యానములు మిగిలినవి. ధారణము కొరకు హృదయమునందు లేక భ్రూమధ్యమునందు మనస్సును స్థిరముగానిలుపుడు. ఇందులకు సుగమమైన విధానమేమన, హృదయమునందుఁగాని, భ్రూమధ్యమునందుఁగాని మనస్సుచేత "ఓం" అను నక్షరము వ్రాసియున్నట్లు చూచుచు దానినే మనస్సున జపింపుడు. ఈజపమునందు జిహ్వాగాని, తాలువుగాని కదల

కుండ కేవలముగ మనస్సుచేతనే జపింపవలెను. 'ఓమ్' అను నక్షరము మనస్సుచేత, హృదయమునను లేక భ్రూమధ్యమునను వ్రాసినట్లు భావించినయెడల నారంభమున నది శీఘ్రముగానే చెదరిపోయినట్లు కనఁబడును. కాని మీరుమాటిమాటికిని వ్రాసియుండుటను చెదరిపోవుచుండుటను జూచుచుండఁ బ్రయత్నింపవలెను. ఈప్రకారముగ నభ్యసించినందువలన నొక సమయమున నా ఓంకారము స్థాయిగా సువర్ణాక్షరములం దంకితమై దృష్టిగోచరమగుచుండును. అప్పుడది చెడిపోవదు.

ఈస్థితినిఁబొందినప్పుడు ధ్యానము లభించినదని తలంపవలెను. ఈ దశయందొక విధమైన యానందము ప్రాప్తించును దానిని వర్ణింపశక్యముగాదు. మీమనస్సెప్పుడును గంటలకొలఁది యీయవస్థలోనే కూర్చుండఁగోరును. మీరితర సాంసారిక కార్యములను చేయఁబోయినప్పుడును, ఆత్మలోనుండి వెళ్లి ప్రియుని దర్శనము చేయుమనియే ప్రేరణము కలుగుచుండును. అప్పుడు మీ నేత్రములు సజలములైపోయి మీ నోటినుండి యకస్మాత్తుగా నిట్లు వెలువడును.

> " తిరిగి యేతీరుబాటునుగూర్చి నీవు రేయుంబవలు
> కాంక్షింతువో అట్టి నీ ప్రియతముని ధ్యానమును
> గూర్చుండి యుండుము"

దీనికిఁదరువాతిస్థితి వర్ణించుటకుఁ గొంతయసంభవమైనది. అది సమాధియనఁబడును. భక్తశిరోమణియు, యోగివర్యుఁడునగు దయానందస్వాములవారి యవస్థనీశబ్దములలో

వర్ణించియున్నారు. "ఏవిధముగ నగ్నిమధ్యమున లోహము నయిత మగ్నిరూపము కలదగుచున్నదో, యటులనే పరమేశ్వరుని జ్ఞానమునందుఁ బ్రకాశమయుఁడై తనశరీరమును గూడ మఱచిన సమానముగఁ దెలిసికొని, ఆత్మను బరమేశ్వరుని ప్రకాశ రూపమగునానందముచేతను జ్ఞానముచేతనుపరిపూర్ణముగా జేయుట సమాధియనఁబడుచున్నది. ధ్యానమునకును, సమాధికి నిభేద మేమన, ధ్యానమునందుధ్యానించువాఁడును, మనస్సుచేతధ్యానింపబడునట్టిదియునుఁ ననునవిమూఁడును నిలిచియుండును. కానిసమాధియందుఁ గేవలము పరమేశ్వరుని యానందస్వరూప జ్ఞానమునందు నాత్మ మగ్నమైయుండును. అచ్చటనామూఁడింటికి భేదముండదు. ఎట్లుమనుష్యుఁడు నీటియందుమునిఁగి కొంత సేపు లోపల నిలిచియుండునో యటులే జీవాత్మ పరమేశ్వరునియందు మగ్నమై తిరిగి బయటకువచ్చుచునుండును.

ఈయవస్థను బొందువారినిగుఱించి ఈశావాస్యోపనిషత్తునందిట్లు చెప్పఁబడియున్నది:—

"యస్మిౝ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః
తత్రకో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః"

దేనియందు (చేరి) సమస్తభూతములు నాత్మయైపోవుచున్నవో, యచ్చటనేకత్వమును గాంచుచున్నందువలన విజ్ఞానికి శోకమెక్కడిది?, అచ్చట శోకమోహములెట్లుండఁ గలవు? సర్వత్ర ఆనందమే. ఆనందము ప్రవాహముగాఁ బ్రవహించుచోట సమస్తజంఝాటములును, సమాప్తమై పోవు

చున్నవి. ప్రతివైపునుండియు ఆనందమే. ఆనందముగానవచ్చు చుండును. ద్వైవిధ్యము మాసిపోవుచుండును. సమస్తమునొక యానందమేయై యుండును. అథర్వవేదము యొక్క రెండవ కాండమునందలి ప్రథమసూక్త మంత్రమిట్లుగలదు.

"వేనస్తత్పశ్యత్పరమగుహా యద్యత్ర విశ్వం భవత్యేకరూపమ్
ఇదంపృశ్నిరదుహ జ్జాయమానాః స్వర్విదో అభ్యనూషత వ్రాః"

"విద్వాంసుఁడా పరమాత్మను విశ్వమేకరూపమైయుండు పరమ గుహయందుఁ (హృదయకుహరమున) గాంచును. ఈ కనఁబడు పృథివియును వ్యవహరించుట కయోగ్యమై పోవును. తత్త్వజ్ఞాని తక్కినజగత్తునుగూడ వ్యవహారమునందువచ్చుటకుఁ దగనిదానినిగాఁ దలంచును." అర్థాత్, భక్తుఁడు పరమేశ్వర చింతనమున హృదయస్థుడై, మగ్నుఁడైపోయినప్పు డతనికి సమస్తజగ మొక్క రూపమునగోచరించుచు నీసర్వము వ్యర్థముగనున్నట్లుండును. వీనివైపునకతని ధ్యానమోసంగక భగవచ్చింతనమునందు లీనమైయుండును. కేవలమానందఘనమే యతని యెదుటనుండును.

శ్వేతాశ్వతరోపనిషత్తుకూడ నిదియేవిషయము నెలుఁగెత్తి చెప్పినది:—

యదాఽత్మతత్త్వేనతు బ్రహ్మతత్త్వం దీపోపమేనేహ యుక్తః ప్రపశ్యేత్,
అజంధ్రువం సర్వతత్త్వైర్విశుద్ధం జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః॥

"ఎప్పుడతఁడు యుక్తుఁడై, ఆత్మతత్త్వమను దీపముచేత జన్మలేనట్టియు, స్థిరమైనట్టియు, సర్వతత్త్వములకంటెను శుద్ధమైనట్టియు, నాబ్రహ్మతత్త్వమును జూచుచున్నాడో, అప్పు

డతఁడు ఆదేవుని తెలిసికొని సకలబంధనములనుండియు ముక్తుఁ డగుచున్నాఁడు. కాని యెంత శీఘ్రముగా నీవిషయములను నాచరించుచున్నామో యంత శీఘ్రముగాసిద్ధించునట్టి విష యములుగావని స్మరణము నందుంచవలెను. వీనియందుచాలా కాలము పట్టును. కావున సంపూర్ణమైన శ్రద్ధావిశ్వాస ప్రేమ ములచేత వీనినాచరింప వలసియుండును. ఆలస్యమునువదలిక్రింది సూచనలపైన నాచరింపవలయును.

1. రాత్రియందు మూఁడుగంటలవేళకు మేల్కొనఁగలి గినచో మంచిది. లేనియెడల నవశ్యముగా నాలుగుగంటలకు మేల్కొని, యొకగంటసేపు ఓంకారమునుగాని, గాయత్రీమం త్రమునుగాని జపింపుము. దయానందస్వాములవారి జీవితచరిత్ర ములో నిట్లువ్రాయఁబడియున్నది.—కలకత్తా నగరమునందొక సారి, హేమచంద్ర చక్రవర్తి, స్వాములవారి నీశ్వరునిపొందుట కేమి యుపాయమని ప్రశ్నించెను. స్వాములవారు చాలా దినములు యోగమునభ్యసించి నందువలన నీశ్వరోపలబ్ధికలుగు నన్నదని పలికిరి. అప్పుడువారు ఆయోగమెట్టిదని తిరిగియడి గిరి. దీనికిఁబ్రత్యుత్తరముగాస్వాములవారష్టాంగ యోగమును వ్యాఖ్యానముచేసిచెప్పి మూఁడుఘడియలు రాత్రియుండగాలేచి గాయత్రీమంత్రము నర్థసహితముగాధ్యానముచేయుఁడని యుప దేశించిరి. స్వాములవారు తమవెంటనుండు నందఱిని సదా ప్రాతఃకాలమున నిద్రనుండి మేల్కొనుఁడని యాదేశించు చుం డెడివారు.

2. అయిదుగంటలకు స్నానమునుండి నివృత్తినిబొంది ప్రాణాయామమును జేయుఁడు. మొదటనొక్కొక్క నాసికముతోను, పిదప రెండునాసికములతోను రేచక, పూరక, కుంభకములను జేయవలయును. దీనితరువాత భస్త్రికాప్రాణాయామముచేయఁదగును. పిదప శాంతమునుబొంది భ్రూమధ్యమున లేక హృదయమునందు ధ్యానము నిలుపవలెను. దీనివిధి మొదటనే వ్రాయఁబడియున్నది.

3. ధ్యానసమయమున ఓంకారమునుగూడజపింపవలెను.

4. తదనంతరము సంధ్యావందనాదుల సలుపవలెను.

5. మధ్యాహ్నమునఁగాని, పగలెప్పుడైనను తీరికలభించిన గాయత్రీమంత్రమును, ఓంకారమును జపించుచుండవలెను,

6. సాయంకాలమునఁగూడ,తిరిగి ప్రాంతఃకాలమునందువలెనే చేయనగును.



# మనస్సు స్థితి

భగవానుని మందిరమునఁ బ్రతి యింద్రియమును, ప్రతీ నాడియును పనికివచ్చునదియే. * నాడులద్వారముననే యుపాసనచేయ వలసియుండును. కాని యన్నిఁటిపైన మనస్సుకలదు. నిజస్థితికిమాత్రము మనమీశరీరమునందుండుట మనస్సుయొక్క కృపవలన నేసుమా! ప్రశ్నోపనిషత్తునందలి మూఁడవ ప్రశ్నమునం దిది యీశరీరములోనికెట్లు వచ్చినదని కలదు. దీనికి సమాధానము నుపనిషత్తు ఇట్లొసంగుచున్నది.

"మనోకృతే నాయాత్యస్మిఞ్ఛరీరే"

మనస్సు కార్యమువలననే యిది శరీరములోనికి వచ్చుచున్నది.

"ఏశుభాశుభ సంకల్పములను మనస్సులోఁ జేయుచున్నారో వానికారణముననే యీశరీరములోని కిది వచ్చుచున్నది"

మహాభారతములో నిట్లే చెప్పఁబడియున్నది:—

"మన ఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః"

---

* ఉపాసననాడులద్వారానే ధారణము చేయవలసియుండును, సితా ఇడా మరియు అసిత పింగళ యను ఏ రెండు నెందుగలిసియున్నవో దానిని సుషుమ్న యందురు. దానియందు యోగాభ్యాసముద్వారా స్నానముచేసి జీవుఁడు శుద్ధుఁడగుచున్నాఁడు.

( ఋగ్వేదాది భాష్య భూమిక)

"మనస్సే మనుష్యుని బంధనమునకును, మనస్సే మనుష్యుని మోక్షమునకును గారణమగుచున్నది" వేదభగవానుఁడును మనస్సులేకుండ నెట్టికార్యమును జేయఁబడజాలదనియు నాదేశించుచున్నాఁడు:—

"యస్మాన్న ఋతేకించన కర్మక్రియతే తన్మే మనశ్శివసంకల్పమస్తు" (యజు-34-3)

ఇదియే సమస్తకర్మములకు కీలువంటిది. ఇదిచేతిలోనికి వచ్చినచో సమస్తమును కరతలామలక మగుచున్నది. నిస్సందేహముగా పరమాత్మవరకు మనస్సుకూడ చేరఁజాలదు. కాని ప్రభునివాస ద్వారమువరకిదియే చేర్పజాలుననుటయు నొక నిర్ధారితసత్యము. దీనిశక్తి గొప్పది. శ్రీమచ్ఛంకరభగవత్పాదుల వారు దీనిమహిమ నింకను వృద్ధిపరచియున్నారు.

ఒకరిట్లు ప్రశ్నించిరి:

"జితం జగత్-కేన?"

భగవానులు "మనోహి యేన" యని ప్రత్యుత్తరమిచ్చిరి. "అనఁగా జగత్తు నెవరుజయించిరి? ఎవరు మనస్సును జయించిరోవారు-" మరియును ఛాందోగ్యోపనిషత్తున 2 వ ప్రపాఠకమున 3 వ ఖండమునందు మొదటనే, "మనోహ్యాత్మామనోహి,బ్రహ్మ మనఉపాస్వేతి" అనఁగా "మనస్సు నిస్సందేహముగ ఆత్మ, మనస్సేలోకము, మనస్సే బ్రహ్మము, మనస్సునుపాసింపుము" అని కలదు. అర్థాత్తు - మనస్సేలోకము అథవా బ్రహ్మప్రాప్తికిని సాధనమైయున్నది.

ఈభగవానుని మందిరము నందున్న మనస్సెటువంటిది? దీనినెంతదనుక మనతోడుగాను మిత్రముగాను జేసికొనకుందుమో యంతదనుక నిది బాధకమై మనలను బాధించుచుండును. భగవంతుని సన్నికటమునకుఁ జేరియు వానిధర్మము లభింప నీయదు. గంగలో నిలువఁబడియు నీరుద్రావలేకుండి దాహాము తోనటులే బాధపడుచుండగలము. కావున నన్నింటికిముందు మనస్సుపైన ధ్యానమిచ్చుట యత్యవసరము. ఇటులే యొక ఉర్దూభాషాకవియును వచించియున్నాఁడు.

"చాలాఅలభ్యమైనదగు నీచంచలహృదయము వక్షస్థలమునగలదు"

"సహస్రసంఖ్యగా విలువగల వజ్రములు ముత్యములీని ధానమ్ముగలవు."

మఱియొక కవికి "హృదయమే" భగవంతుని నివాసస్థానముగాఁ గనపడినది. అతఁడిట్లు పలుకును:-

"హృదయకుహారమునందు లభింపఁగలఁడా తేజః ప్రదర్శకుఁడు."

"ప్రతివాకిలిని దారితప్పి యతనికొరకు తిరుగుచు జేరితిమి"

ఇఁకదీనివైపు కన్నులుమూసికొని యుండక మొదట దీనిశరణమును పొందవలెను. మనస్సుచేతిలోనికి వచ్చెనేని భగవంతుని మహాసభలోనికి నెట్టియాటంకములేక చేరవచ్చును. ఈకార్యము చెప్పుటకు సరళముగానేయున్నది. కాని యా

రించుటఅత్యంత కఠినము. గీతలో నర్జునుఁడు సయితమిదియే మొఱపెట్టుకొని యున్నాఁడు. — "స్వామీ! ఈమనస్సు మిక్కిలి చంచలమైనట్టియు, మథించునట్టియు, బలవంతమైనట్టిదియు, దృఢమైనట్టిదియు నైయున్నది, కావునదీనిని వశపఱచుకొనుట వాయువువలె దుష్కరమని తలంచుచున్నాను." శ్రీకృష్ణభగవానుఁడును, నిస్సందేహముగా మనస్సుచాలా చంచలమును కఠినముగా వశమగునట్టిదని తెలిపి ధైర్యమొసఁగుచు నభ్యాస వైరాగ్యములచేత దీనిని వశములోనికిఁ దెచ్చుకొనవచ్చునని యుఁబలికెను.

ప్రథమసాధనము జ్ఞానము:—

మనస్సును వశములోనికిఁ దెచ్చుకొనుటకన్నిఁటి కంటెను మొదటిసాధనము 'జ్ఞానము'. ఈసంసారమెట్టిదనియు. సంసారమందలి వస్తువులవాస్తవికతయు, వానిమూల్యమెటువంటిదనియు జ్ఞానముగలిగిననివియన్నియు వానినంటుకొనితిరుగుచుండవు. మనుష్యుని సౌందర్యమువట్టి మలమూత్రాదుల పరిణామమాత్రమేయని తెలిసిననట్టిసౌందర్యమునందు భ్రమించుటెందులకు? వైజ్ఞానికుఁడు వజ్రమును, బొగ్గును నొకే తత్త్వములతో సిద్ధమైనవని నిర్ధారణముచేసినయెడల వజ్రమును బొందుటకై వక్రగతుల నవలంబింపనేకోరిక పుట్టదు. ఈకనబడుచున్న దంతయు నశ్వరమేయని తెలిసికొనిన నీ కీలుబొమ్మల కొరకు దుఃఖింపఁడు. అప్పుడు విషయవాసన బంధింపదు. అప్పుడే లోభ మోహాహంకారాదులు బాధింపఁజాలవు. సత్యమునే కవి వచించియున్నాఁడు:—

"జ్ఞానమను డేగయొక్క ఆకర్షణములోనికి రానప్పుడే
మనస్సను పక్షి విషయవాసనల మోహమున నెగిరిపోవుచుండును"

దీని పరుగులు, దూకులు సాంసారిక వస్తువుల వాస్తవిక జ్ఞానము కలుగనంతవరకే యుండగలవు. కావున నన్నిటి కంటె మొదట మనస్సున కిట్లుపదేశింపవలెను. "నాయనా! చూడుము, నీవే సౌందర్యమును మెచ్చుకొనుచున్నావో యది తెఱచేత గప్పఁబడిన ముఱికి. ఆ తెఱను దీసివైచి ఆ రోతను బయటకు రానిచ్చి చూడుము, నీవు ముఖమును త్రిప్పుకొనెదవా లేదా! నీవే ధనము వెంటఁబడి త్రిమ్మరుచున్నావో మరియు నద్దానికొరకు నిత్య నూతనములగు మాయలను బన్నుచున్నావో యది భగవానుని నదులనుండియు, పర్వతములనుండియు వెడలిన ధాతువులే. అవియును మన్నును రాళ్లేను. తిరిగి యవియొకచోట నుండునవియునుగావు. నేఁడు నీవు వాని నత్యధిక ప్రయత్నముతో సమకూర్చితివి. ప్రభువు ప్రజలను బాధించియు ననాథబాలకుల యధికారములను నీటగలిపియు నిస్సహాయులగు విధవలగుడ్డలనొలిచియు నిర్బలజనులను, జాతులను నాక్రమించి లక్షలాది మనుష్యుల కుత్తుకల నుత్తరించియు నిర్ధనదుఃఖితులగు హరిజనులకష్టము, కూలిని, సంపాదనమును శుల్కము మొదలగు నితరనామములతో నపహరించి యమాయకులును, సరళవర్తనులువగు భగవద్భక్తుల ననేక పద్ధతులతో నాక్రమించియు సంపాదించును. నీవీ చిల్లపెంకులను సంపాదించి నను రేపటివరకు నాయొద్దనేయుండగలవని యేమినమ్మకము? నీకంటె నధికబలవంతుఁడును, మోసకాఁడును, నధికకపటి

యునగువాఁడు చూడదీసికొనఁగలఁడో లేక నీవే మృత్యుగ్రాస మైపోవుదువో. ఈవిధమగు జ్ఞానము మనస్సునకు లభించినయెడల నీఁకనది నశ్వరసాంసారిక పదార్థముల వెంటఁబడి దారిదప్పుటయు, తన ధర్మమునుండియు విముఖతబొందుటయు, కాక ధర్మాచరణారూఢమై, మంచిసంపాదనమువైపు ధ్యానమునిల్పి, తన్ను దాను విషయవాసనలనుండి సురక్షితముగ నుంచుకొనగలదు. దీనితోఁబాటు పరమాత్మ యెట్టివాఁడో తెలిసికొనవలయును. ఈశరీరమునందుండి యతని నెఱుఁగకున్నచో, గొప్పహానికలుగును.

కేనోపనిషత్తున నిట్లు చెప్పఁబడియున్నది:—

ఇహాచేదవేదీదథ సత్యమస్తి నచేది హావేదీన్మహతీవినష్టిః
భూతేషుభూతేషు విచింత్యధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా
భవంతి॥ ౨-౫

ఇచ్చట (ఈజన్మములోనే) తెలిసికొనినచో మంచిది. అట్లుకాక వేళనిచ్చట తెలిసికొనఁడాయెనా యది చాలాగొప్ప నాశనకారి. కావున ధీరపురుషులు సమస్తభూతములందు తనిని సేవించి, యీలోకమునుండి వేరైయమర్త్యులగు చున్నారు.

ఇటులనే బృహదారణ్యకోపనిషత్తు సయితము శాసించుచున్నది.

ఇహైవసంతోఽథవిద్యస్తద్వయం నచేద వేదిర్మహతీవినష్టిః
ఏతద్విదురమృతాస్తే భవంత్యథే తే రేదుఃఖమే వాపియంతి॥
[౪-౪-౧౪]

"ఇచ్చట నివసించుచు మనమతనిని తెలిసికొనఁగలము. నేనిచ్చట జ్ఞానహీనుఁడనై యుంటినేని, యదియొక గొప్ప వినాశన కారణమగుచున్నది. అతని నెవరు తెలిసికొనుచున్నారో వారమృతులగు చున్నారు. కాని యితరులు మాత్రము దుఃఖమునే యనుభవింతురు.

రెండవసాధనము, దుస్సంకల్పముల నివృత్తి:—

జ్ఞానములభించినందువలన మనస్సుయొక్క నేత్రములు తెఱువఁబడిన తరువాతను, నేదోయొక సమయమున వినోదార్థమిది జారిపడుటయును సంభవమే. ఇక్కారణమున మనస్సును వశములోనికిఁదెచ్చుకొనుటకు రెండవసాధనము దుష్టసంకల్పములను మనస్సునుండి మాటిమాటికి నిలుపవలెను. ఈయభ్యాసమునకుఁ గొంతకాలము పట్టును. ఇంటిలోపల సన్నిటికి వెనుకనున్నగదిలోఁ గూర్చుండి కన్నులనుమూసికొని మంత్రముల మానసికజపముచేయుచున్న సమయమున కొంతసేపటికి తరువాత నీమహాత్ముఁడు సమస్తద్వారములను దాటియెక్కడెక్కడనో వెళ్ళి తనయిచ్ఛవచ్చినట్లు నటించుచుండుటను మీరనుభవము జూచియుందురు. "అరరే! యిదేమి? నిన్ను మంత్రమును జపించుటయందు నియోగించితే ఈలాగున నేమిచేయుచున్నావు?" ఇట్లే యీప్రకారముగ దీనిని స్వతంత్రముగాకుండ నిలుపుఁడు. ఈయాజ్ఞ మెట్టిసంకల్పములను లోనికిరానీయక నాసంగవలెను. దీనికొరకు మనస్సుపైన కఠినమగుదృష్టిని యుంచవలెను. ఎప్పుడైనను నేదేని దుష్టసంకల్పములను గొనివచ్చిన

తత్క్షణమే దుశ్చింతలను మనస్సునకు వెలుపలఁ బోద్రోలవలె ను. వేదమునందు దీనినిగుఱించి యొకయందమైన మంత్రము కలదు.

"పరోఽపేహి మనస్ పాపకిమశస్తాని శంససిప్రరేహి
సర్వాకామయే వృక్షాంవనాని సంచరగృహేషు గోషుమేమనః॥
(అథర్వ 3-88-౧)

ఓమనస్సునందలి పాపమా! దూరముగాబొమ్ము. పారి పొమ్ముక్కడనుండి. నీవి యెట్టిదుర్బోధ నాకుఁ జేయుటకువచ్చి తివి? పొమ్ము నేనునిన్ను కోరలేదు. వనమునందలి వృక్షములకు బోయియుంటుము. నేను నామనోగృహశుద్ధియందు సంలగ్నుఁ డనై యున్నాను" అప్పటికిని యేదేని సంకల్పము రాఁదొడఁగి నప్పుడే దానిని సంపూర్ణబలముతోడను నీమంత్రముచేతను బ యటకు నెట్టివేయుఁడు.

ఒకపిల్లవాఁడు మిక్కిలితుంటరిగా నుండెను. వీధిలోను న్న కుఱ్ఱవాండ్రందరితోను గలహించుచుండును. స్త్రీపురుష, బాలవృద్ధజనులనెల్లరను బాధించువాఁడు. ఒకరిరాటమును విరు గగొట్టును. వేఱొకరి యంగవస్త్రమును జింపును. మఱియొకని చెంపపై గొట్టును, అతఁడేడ్చును. క్రిందబడును, ఇటువరుగెత్తును అటువరుగెత్తును. పరుగెత్తి తనయింటికివచ్చును. అతనితల్లికడ కు ప్రతినిత్యము జగడములు వచ్చుచుండును. ఇంటిపొరుగు వారు వానితల్లియొద్దకువచ్చి "చూడుముతల్లీ! ఈ నీకుమా రుఁడీవీధిలోనికి రాయోగ్యుఁడుగాడు. వీనిని సూర్యోదయనే యుంచుకొనుఁడు. తల్లి పిల్లవానినిజూచి "ఇప్పుడు నీవునాయొ

ద్దనేయుండుము. నీవెక్కడకును బోఁజాలవు" అనియాజ్ఞాపించె ను. పిల్లవాఁడు నిశ్శబ్దముగా, మిక్కిలి యాజ్ఞాకారియు, శ్రేష్ఠుని వలెను గూర్చుండియుండెను. తల్లియప్పుడు వీఁడు చక్కఁబడినాఁడనితలంచెను. కాని యామెతనపనులలోనఁ జేరుటయోతడవుగా నీకుఱ్ఱవాఁడు తల్లికన్నులావంకకు జేరియున్నట్లుజూచి తత్క్షణమే జరిగి మాయమైపోసాగెను. రెండడుగులేపోయియుండగా తల్లివానినిజూచి, "కూర్చుండుము ఎక్కడకుపోవుదువు? కూర్చుండుమక్కడనే. నీవు బయటకుబోజాలవు" అనిపలికెను. బాలకుఁడు తిరిగి మిక్కిలిగ బాగుపడిన పిలవానివలెఁ గూర్చుండెను. తల్లితనపనిలో ప్రవేశించెను. పిల్లవాఁడు సమయమెప్పుడు చిక్కిన వెళ్ళునాయని కాచుకొనియున్నాఁడు. మరల తల్లిచూచినది. "ఎక్కడకుపోవుదువు? ఇక్కడనే గూర్చుండుము. నీవుబయటకువెళ్ళి యెవరినికూడ బాధింపనని ప్రతిజ్ఞ చేయనియంతవరకు నిన్నీబంధనమునందే యుంచగలనని" పలికినది. కుఱ్ఱవాఁడుతిరిగి, యేమియు నెఱుఁగనివానివలె గూర్చుండెను. తల్లి తనపనులను జేసికొనుచునేయుండెను. కాని తనదృష్టి పిల్లవానిపైననే యుంచుచుండెను. కట్టకడపట బాలుని చాంచల్యము దూరమైపోయినది. వాఁడితరులను బాధింపనని ప్రతిజ్ఞసయితము చేయలేదు. అప్పుడు తల్లి వానిని బయటకు వెళ్ళుటకు నాజ్ఞయిచ్చినది.

ఈతెఱంగుననే మనస్సుపైన కఠినమగుచూపు గలిగియుండవలెను. ఎంతవరకిది చెడ్డతలంపులను వర్జింప ప్రతిజ్ఞచేయదో

యంతదనుక దీనిని కడుజాగరూకతతోఁ జూచుచుండుట యా వశ్యకము. సారెసారెకు నభ్యాసము చేయుచున్నందువలన నీ మనస్సు తనచాంచల్యమును విడచుటయందును, దుస్సంకల్ప ములనుండి దూరముగా నుండుటయందును బాధితమై పోవును.

**సంకల్ప సంస్కారవినాశనము:**

ఏసంకల్పమైనను మంచిదిగాని చెడ్డదిగాని, దానినను సరించి మాటపలుకని పలుకకపోని, యేకర్మము నైనజేయుని చేయకపోని మనస్సుపైనది తనప్రభావము నవశ్యముగా హెచ్చుగానో కొంచెముగానో పడవైచుచుండును. ఇట్టిప్రభావ మునే సంస్కారమందురు. ఇట్టిసంస్కారము లనుజట్టియే వృత్తి గలుగుచు మనుష్యునిమంచియో చెడ్డయో కార్యములందు ప్రవిష్టునిగావించును. వృత్తి రెండువిధములుగా నుండును.— స్థూలమనియు, సూక్ష్మమనియు. స్థూలవృత్తియందు కామ క్రోధములు విలీనమైయుండును. సూక్ష్మవృత్తియందు సంస్కారములు. ఈసంస్కారములే మానవుని కర్త్యాధికశక్తు వులు. ఇవి జన్మజన్మాంతరముల తరువ నంటియుండును. అనేక వ్యాయములు మనుష్యుఁడీ జన్మలో మాఱచినైనను చేయ నట్టియుఁ, జూడనట్టియు, విననట్టియు, కర్మలను మనస్సు చేయఁ దొడఁగుచుండును. ఈ జన్మమునందలి సంస్కారములనుండి నివృత్తిగాంచినను, ఇటువంటిసంకల్పముల చిహ్నములు స్వప్న మునందైనను జూడనట్టివి గనవచ్చుచున్నవి. వాస్తవములోనివి

యేపూర్వజన్మములోనో, యేసంకల్పముకారణముచేతనో మనస్సుపైన నిలిచినట్టి సూక్ష్మసంస్కారములు. కాబట్టియే పవిత్రమైనదిగాని, చెడ్డదియుగాని, యగుసంకల్పమును మనస్సులోనికి రానివ్వనేరాదు. ఇంక బలపూర్వకముగా వచ్చినను నేమి చేయ గలము? ప్రప్రథమమునతీక్ష్ణమే దానినిదూరము చేయప్రయత్నింపవలెను. సంస్కారమేదైనను మనస్సుపైన సంకితమైయున్నను; దానినికడిగి తుడిచివేయువలయును. ఇందులకు మార్గమేమన, ఓంకారమునుగాని, గాయత్రీమంత్రమును గాని జపింపవలెను! మనస్సును శుద్ధిచేయుటయందు గాయత్రీ మంత్రము మిక్కిలి బలయుక్తమైనదని సిద్ధిచేయఁబడినది. కాని మంత్రార్థమును చాలాచక్కఁగా స్మరించవలెను. ఓంకారమును గాయత్రీమంత్రమును జపించుటచేతనొక క్రొత్త చెడ్డసంకల్పములనేగాక, జన్మజన్మాంతరమునందలి సంస్కారములను నయితము దూర మొనరించుటయందు సమర్థతగలుగును. ఇది యనుభవసిద్ధమైన విషయము కావున ప్రమాణములతోఁ బనిలేదు. సంశయస్వభావులీ గాయత్రీమంత్రమునకును, మనశ్శుద్ధియు, భగవద్దర్శనమునకును సంబంధమేమిగలదని శంకింతురు. దీనియందు సత్-చిత్ ఆనందుఁడును, జగదుత్పాదకుఁడును నగు పరమేశ్వరుని దివ్యగుణములను ధ్యానించియతని పవిత్రస్వరూపమునెదుట నుంచుకొని, యతనిచేత, తనబుద్ధిలపరికాశితము గావించుకొనుటకు ప్రేరేపింపుమని ప్రార్థింపవలసి యుండును. దీనిచేత బుద్ధిప్రకాశించఁగలిగిన ప్రకాశించును, కాని మఱియే

మియును గాఁజాలదు. వారుఆత్మకు నన్నిఁటికంటెను మొదట నావశ్యకమైనట్టి వస్తువును, భగవత్ప్రాప్తికన్నిటికిని మొదటి సాధనమును జ్ఞానమేయనియు, జ్ఞానము బుద్ధి నిర్మలమైన తరువాత నేలభించునను విషయమును మఱచుచున్నారు. ఆత్మ రెండు కార్యములు చేయుచుండును— ఒకటిజ్ఞానప్రాప్తి, రెండవది ప్రయత్నము. యోగదర్శనమునందు బ్రహ్మప్రాప్తికిసర్వోపరి ప్రధానసాధనము "ప్రజ్ఞా" అనఁగా బుద్ధియనియే తెలుపఁబడియున్నది. యోగదర్శనము (౧-౨౧) నందు సమాధిసాధనముల వివరించుచు సమాధివలన "ప్రజ్ఞ" ప్రాప్తించుననివచింపఁబడియున్నది. — ప్రథమమున సంపూర్ణమైన శ్రద్ధ కావలెను పిదపవీర్యవంతుఁడుగావలెను. అప్పుడుస్మృతియనెడు పెన్నిధి గన్పించగలదు. ఈమూఁడుకర్మలు సిద్ధించినతరువాత భక్తుని యశాంతి పటాపంచలైపోయి శాంతచిత్తుఁడును, సమాధిస్థుఁడునై యొప్పును. ఆపైన ప్రజ్ఞాబుద్ధి జాగృతమైపోవును. ఈ ప్రజ్ఞయేపరమాత్మని దర్శించుటయందు పూర్ణసహాయకమై యుండును? ఇందులకే గాయత్రీమంత్రమునందు బుద్ధికొఱకు ప్రార్థనముచేయఁబడి యున్నది. యోగీశ్వరులు యోగవిద్యానుసారముగ సమాధ్యవస్థా నంతరము పొందినజ్ఞానమును, గాయత్రీమంత్రమును విధిపూర్వకముగా, పర్యాప్తమగు సంఖ్యను, పర్యాప్తకాలమునందు జపించినవారు గాంచగలిగిరి. అట్టిచో గాయత్రీమంత్ర జపమును, దానితోఁబాటు ఓంకారజపమును, భక్తునిమనస్సు నచిరకాలములోనే పరమేశ్వరుని దర్శించుటకు యోగ్యముగావించును.

మూఁడవసాధనము - సత్సంగతి--

మనస్సునుద్ధరించుటకు మూఁడవసాధనము సత్సంగతి. సత్పురుషుల సంగాతమున, నగ్నిసమీపమున గూర్చుండిన చలిదూరమైపోయినట్లును, లేక రామవనము (కాశ్మీరము) న చంద్రభాగా నదీతటమున గూర్చుండిన వేఁడిమియంతయును తొలఁగిపోయినట్లు మనస్సుయొక్క సంకల్ప వికల్పములును దూరమగును. పూర్ణమగు శ్రద్ధతోనే మహాత్మునియొద్దకేనియు జని వారిసన్నికటమున గూర్చుండిన మాత్రమునసే మనస్సై కాగ్రమైనట్లు మీరు అనుభవమును చూచియుందురు. అట్టి సమయమున నెట్టిసంకల్పములును మన మనస్సునందుగలుగ కుండును. కావున నిట్లుచెప్పబడియున్నది.

"పెద్దలయొక్క స్వర్గసుఖము మఱియు నపవర్గసుఖ
మును తులలోతూఁచిన

"ఇతరసమస్తమెద్దియును తూఁగదుగాని, ఒకసత్సం
గతివలనగలిగిన సుఖలవముగల పళ్లికే యెతూఁగును"

సత్పురుషులయొద్దకు నిత్యమునుపోండు. ఈకార్యము నందాలసింపకుఁడు. పిల్లలు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు నం రునుసత్సంగతివలన లాభమునుపొందఁగలరు. దీనివలన ప్రాత కాలమునందలి యుపాపతేనందఱకును నప్రయత్నముగనే యద్భుత సంతోషముకలుగును. నల్లనిబొగ్గును మీరుచూచి కున్నారా? దానినొకధగద్ధగాయమానముగ ప్రజ్వలించు చున్న కుంపటియందు పడవైచినవది కొంతసేపు ప్రకాశించు

చున్న బొగ్గులసంగతిలోనుండి యున్నందువలన, దానినల్లఁదన మునశించి, యదియును, నట్టిదే వేఁడిమి, తీవ్రత, యెఱ్ఱదనమునుగూడి ప్రకాశింపఁదొడఁగును. కాని యదికుంపటినుండి క్రిందికిఁబడిపోయిన మండుచున్న బొగ్గులకు దూరమైపోయిన కొంతతడవు తరువాతనే తిరిగినల్లబడగలదు. సంగతివలన మనమైన నొకగొప్ప ప్రభావము పడును. నిత్యముచేయుచున్న సత్సంగతివలన మనస్స్థితి మారిపోవును. కొన్నిదినములలో కొన్నిమాసములలో లేకకొన్ని సంవత్సరములలో సజ్జనస్నేహము నందుగడిపిన మీకు నెట్టిలాభము కలుగకున్నను చింతింపకుఁడు. లాభమును ప్రభావమును నిరంతరము గలుగుచునే యుండును. లేనిచో మనస్సెంతో మలీమసమై యున్నందు వలననే శీఘ్రముముగా ఫలము చేకూరలేదనియు, నయ్యదియొక కేవలాన్యాయము కడిగిన శుద్ధిగాంచదనియు, కనీసపక్షము కొన్నిసంవత్సరములవరకైనను సత్సంగ నదీప్రవాహమున దానినికడుగవలసియుండుననియు భావింపవలెను. ఏమహాత్ముయొక్క దేమాట మనస్సునబడి యుగపరివర్తనము చేయఁగల ప్రభావముగలదో యెవ్వరును నెఱుఁగజాలరు. ఇయ్యది మనస్సుయొక్క యోగ్యతనుబట్టియుండును. శ్రీమద్దయానంద ఋషి జెహాల్లంలో నున్నప్పుడచ్చట మెహతా అమీచందనువాఁడు మిక్కిలి మనోహరములైన భజనములను పాడుచుండెనువాఁడు. అతఁడు మద్యాతము త్రాగుబోతు. అతనియాచారములును కొంతవరకు చెడిపోయియుండెను. నిత్యము స్వాములవారియొద్దకు వచ్చు

చుండెను. ఒకదినము మెహతా అమీచందు పరమేశ్వరభక్తిని గూర్చిన యొక మనోరంజకమగు పాటను బాడెను. స్వాములవారు వినినతరువాత, "అమీచందూ, నీవుమాత్ర మొక రత్నమవు. కాని యడుసులోనున్నావు" అనిపలికిరి. ఇంతలో నొక్కమ్మగుటికిమూటిగాతగిలినట్లయ్యెను. ఆసమయమునుండియే మెహతా అమీచందుని జీవితముమారిపోయినది. మదిరాపానమును మానుకొనెను. వ్యభిచారమొక ఘోరపాపమని తెలిసికొనెను. మెహతా అమీచందు పరమేశ్వరుని సత్యమగుభక్తుఁడుగా మారిపోయెను. మహర్షి దగు నొకవాక్య మొకసారాయిత్రాగుబోతును, వ్యభిచారిని, భక్తునిగాను శుద్ధచరిత్రునిగాను గావించినది. కావుననే నేనుసత్సంగతినుండి వినుగుగొనరాదని పలుకుచున్నాను. నిరంతరము ప్రయత్నము చేయువారలరై యుండుఁడు. ఎప్పుడు మీకు భాగ్యోదయము చేకూరునో ప్రతీక్షించుచుండుఁడు.

నాల్గవసాధనము — స్వాధ్యాయము—

మనస్సును శుద్ధిచేయుటలో స్వాధ్యాయము సయితమొక గొప్ప మహత్త్వముగలదిగా నున్నది. శతపథ బ్రాహ్మణము నందిట్లుగలదు:—

ప్రియే స్వాధ్యాయప్రవచనే భవతో యుక్తమనా
భవత్పరాధీనోఽహరహ ర్థాన సాధయతే
సుఖం స్వపితి పరమ-చికిత్సక ఆత్మనో
భవతీంద్రియ సంయమ శ్చైకారామతా
ప్రజ్ఞావృద్ధిర్యశోలోక రక్తిః॥ (౧౧-౫-౭-౧)

"స్వాధ్యాయము (వేదమునుజదువుట) మఱియు, ప్రవచనము (వేదప్రచారము) ఈ రెండును ఋషీశ్వరుల ప్రియమగు కర్మములు. స్వాధ్యాయముచేయు పురుషునిచిత్త మేకాగ్రమైయుండును. కావునతఁడు పరాధీనుఁడైయుండఁడు- దినదినము నతని ప్రయోజనము పూర్తియగుచుండును- సుఖముగానిద్రించును. తనకుదాను పరమచికిత్సకుఁడగు చున్నాఁడు. ఇంద్రియ సంయమమును, సదాయేకరసముగానుండుట, జ్ఞానవృద్ధియు, యశమును, లోకులనుద్ధరించుటయు నిపుణులనుగాజేయు కార్యము అనునవియన్నియు స్వాధ్యాయమువలన లభించును.

శతపథనమునందొకచో నిట్లుపదేశముకలదు:

"మనుష్యుఁడీ సమస్తపృథివిని ధనముచేతనింపి యిచ్చుచుండి, యేమహాఫలము ననుభవించుచున్నాఁడో దీనికి మూఁడు రెట్లుగాను, అథవా అక్షయఫలమును చక్కఁగాఁ దెలిసికొనుచు ప్రతిదినము స్వాధ్యాయము చేయుఁవాడుపొందు చున్నాఁడు. కావున స్వాధ్యాయము నియమముతోఁ జేయవలెను"

తైత్తిరీయోపనిషత్తు (శిక్షావల్లీ అనువాకము ౯) నందు మనుష్యుని పదునైదు కర్తవ్యములను జెప్పుచునందు ప్రతికర్తవ్యమునకుఁ తోడుగాస్వాధ్యాయ ప్రవచనములకు ప్రాముఖ్య మీయఁబడియున్నది,— "నాకమౌద్గల్యుఁడు

స్వాధ్యాయప్రవచనములే తపములైనందువలన నావశ్యకము
లనియంగీకరించుచున్నాఁడు."

ఋషీశ్వరులే స్వాధ్యాయమహిమను వేనోళ్లఁగొనియా
డుచున్న నిఁక మనకెట్టి సందేహమును గలుగఁబోదు. స్వాధ్యా
యముచేయు సమయమునందు సాక్షాత్తుభగవంతునియొక్కయు
ఋషీశ్వరులయొక్కయు సహవాసమున నున్నట్లనుభవము
నేరుగా వారినుండియే ప్రసాదముఁ బొందుచున్నట్లు
నుండును. స్వాధ్యాయముచేసి యున్నవారియనుభవమున నెన్ని
యో వారి సంశయములు తమంతటఁదామే నివృత్తిఁ జెందుట
నెన్నియో రోగములకు ననుభూతౌషధములు లభ్యమైనట్లును
గలదు. ప్రభువర్యుని కోశాగారమున జేరినవాఁడు పట్టిచే
నెన్నటికిని రాఁడు. వానికి చిత్తైకాగ్రతకుఁదగిన సాధనములెన్ని
యోగన్పట్టగలవు. కావున ప్రతిదినమును వేదములు ఉపని
త్తులుగాఁగల యితరపఠనీయములైన శ్రేష్ఠగ్రంథములను చది
వుట మిక్కిలి ముఖ్యమైనకార్యము. దీనివలన మీ రేమీ మనస్సు
నిర్మలమగుచున్నట్లు ననుభవము గాంచగలరు.

**ఐదవసాధనము_ భగవదర్పణముగా కర్మము చేయుట.**

మనోనైర్మల్యముకొరకైదవసాధనము భగవన్ని
ము కార్యములుచేయుట. ఒకపర్యాయము హంసరాజగా
తమజీవితాంతమును వేతనములేకుండ దయానంద కాలేజీయం
దుపనిచేయుటగూర్చి లాహోరు ఆర్యసమాజ ప్రధానులవా
లేఖవ్రాసినప్పుడు వారిమనస్సునందొక యద్భుతమైన జ్యోతి

కాశించినదనియు, వారిజ్యోతినెంతో కాలమువరకు చూచుచుండిరనియు దానివలన వారిమనశ్శక్తి యెంతయో వృద్ధిబొందినట్లును వారిలో నెంతయో యవర్ణనీయానందము కలిగినట్లును తమయనుభవమునజూచితిననియు నాకొకతడవ వచించిరి.

ఇద్దానివలన నిస్సందేహముగ మనోనైర్మల్యత యెక్కువగును. మనస్సంకోచముసశించును. క్షుద్రత రూపుమాయును. మనోవైశాల్యతవర్ధిల్లును. ఏమానవుఁడైనను పరోపకారము నిమిత్తము నేను చేయుచున్నదంతయును భగవంతునికొరకే కాని స్వార్థసిద్ధికొరకుగాదనియు భావించితన్ను నర్పణముచేసిన యెడల నతనిమనస్సు మోదప్రమోద, ఆనందవీచికలనోలలాడగలదు. దీనులకు, దుఃఖితులకు, రోగులకునెట్టిసాంసారిక బంధనమునులేక సుఖమునుగలిగించునట్టియు ఆకలిగొన్న వారికి నన్నమిడినట్టియు, దాహమును గొన్నవానికి నీరిచ్చినట్టియు సమయములందు, నట్టికార్యములు చేయుచున్నవాఁడు తన్నుదానుపైకి నెత్తఁబడినట్లు ననుభవముగాంచును. ఒకవేళదీనితోబాఁటు "నేనెవఁడను? ఈసమస్తమును చేయువాఁడు పరమాత్మ, ఇదియతనికృపయే ఈకార్యమతనికే సమర్పితము." అనుభావమును గలిగియున్న మనస్సుననింకను నైర్మల్యతయభివృద్ధిగాంచును. ఇట్టిభావముతో చేయఁబడు కర్మమునే నిష్కామకర్మమందురు. ఇట్లుచేయఁబడుకర్మలు, చేయువానిని లుప్తునిచేయవు. వాఁడుకమలపత్రమువలె ప్రాపంచికకర్మయను జలము

లందు వసించి కర్మములను జేయుచును కర్మరూపజలము చేతలిప్తుఁడుకాఁడు. ఎవఁడైనను, తాఁజేయుపనులన్నియు భగవంతునకర్పించుచు నుండిన నతని యేపనియు చెడ్డదిగానుండరాదని కొందఱు పలుకుదురు. ఒకసాధారణాతిసాధారణవ్యక్తికిని నేదేనివస్తువు నుపహారముగా నొసఁగగోరిన శ్రేష్ఠమగు వస్తువు సంపాదింపఁబడును. మాతృ,పితృ,గురు ఇష్టదేవాదులకర్పించునది సర్వోత్తమమైనదిగా నుండవలెనని శ్రమపడి వెదకుచుందురు. కాననిఁక భగవంతునకర్పించు వస్తువేదైన నది యత్యుత్తమమును నతిప్రియమును నత్యుపయోగకరమును నై యుండఁదగును. ఇందువలన నతఁడే పనినైనను జేయుటకు ముందది పరమాత్మున కర్పించుటకు దగియున్నదాయని విమర్శించును. అది యోగ్యముగా నుండనిచో దానిని చేయుటవెంటనే మానుకొనును. అప్పుడతఁడసత్యమును చెప్పఁగలఁడా? చౌర్యాది నిందితకర్మములను జేయఁజాలునా? ఎప్పటికిని కాదు. అట్లతఁడు నిరర్థకమైన కార్యములనుండి తనంతటతానే విడువఁబడును. భగవదర్పితముగా కర్మములనుజేయుచు, దాని ప్రభావమువలన మనుష్యుడు దేవత్వము వరఁకును జేరగలఁడు ఈభావమునే పురస్కరించుకొని శ్రీకృష్ణభగవానుఁడు వీరశ్రేష్ఠుఁడగు నర్జుననితో నిట్లుచెప్పుచున్నాడు:-

యత్కరోషి యదశ్నాసియజ్జుహోషిదదాసియత్।
యత్తపస్యసికౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్॥ భ, గీ, ౯-౨౭

"అర్జునా! నీవేకార్యములను జేయుచున్నావో, యేయది భుజించుచున్నావో, యెద్దానిని హోమముచేయుచున్నావో

యెయ్యది దానమిచ్చుచున్నావో, యేది ధర్మాచరణరూప తపస్సును జేయుచున్నావో, యదియంతయును నాకే యర్పింపుము"

హోమముచేయువారును ఘృతాది హోమద్రవ్యములయొక్క ప్రతియాహుతిని వేల్చినతరువాత "ఇదన్నమమ" అనుశబ్దముల నుచ్చరింతురు. దీనివలని ప్రయోజనమునయితేము "యిదినాదికాదు కాని అగ్ని, వరుణ, ప్రాణరూపుడగు పరమేశ్వరునిదనియే" యని త్యాగముచేయుటయే యగుచున్నది. ఆహుతులతోఁబాటు నమర్పించు కార్యముసయితేము వెనువెంటనే జరుగుచుండును. ఇవ్విధముగ నొకభక్తియుక్తజీవితమును, జీవితమునన్కొక్కక్షణ పరమేశ్వరార్పితముగుచు నొప్పారుచుండును. అట్టిభక్తుడు తనకొరకు జీవింపఁడు. భగవంతునికొరకేజీవించును. అతఁడుతినునది తనకొరకుగాదు. పరమాత్మునినిమిత్తమేతినును. అతనితిండి, త్రాగుడు, నిద్ర, వ్యాయామము, హావనము, ధనోపార్జనము, సంతానపాలనము, సభానమాజములసేవ, మున్నగునవన్నియును భగవదర్పితములైయుంగుచుండిన, నతనికి గంజిలభించిననేమి? పంచభక్ష్యపరమాన్నములతో భోజనముదొరికిననేమి! సుఖములభింపనిమ్ము, దుఃఖములభింపనిమ్ము, జీవితమునందాశ యుండనిమ్ము. లేక మృత్యువు యెట్టయెదుట తాండవింపనిమ్ము. ఎట్టిపరిస్థితిలో సుభక్తునిమనస్సు వ్యసనములోజిక్కదు. ప్రతివిషయమునకును స్వాగతమొసఁగుచుండును. ఇట్టిభక్తుఁడెంతయుచ్ఛదశను బొం

దునోకదా! చూచువారచ్చెరువు నొందెదరు. కాని భక్తుఁడు మాత్రము వారియాశ్చర్యమునుజూచి నవ్వును. మనను మనము పరమేశ్వరునకు సమర్పించిననతని యిచ్చవచ్చినట్లుపయోగింపనిండు. మనకెట్టి యభ్యంతరమును నుండనేయుండదు.

ఆఱవసాధనము — ఉపాసన

మనస్సును నిర్మలపరచుట కింకొక యుపాయమును గలదు. దీనిమహిమయు నెద్దానికిఁదీసిపోదు. అది "ఉపాసన" అర్థాత్తుసమీపమున గూర్చుండుట. ఏపరమాత్మని జూడఁగోరితిమో యతనియొద్దగూర్చుండుట నభ్యసింపనంతవరకు నతని నెట్లు చూడఁగల్గుదుము?

దయానంద భగవానులు తమఋగ్వేదాదిభాష్య భూమికయందిట్లు వ్రాసియున్నారు. "ఉపాసన రెండువిధములుగా గలదు. ఒకటిసగుణము రెండవది నిర్గుణము. జగత్తునుసృష్టించువాఁడు, వీర్యవంతుఁడు, శుద్ధుఁడు, కవి, మనీషి, పరిభూతుఁడు స్వయంభువు, మొదలగుగుణములను గలిగియుండుటచేత నతఁడు సగుణుఁడు. అటులే అకాయ, అవ్రణ, అస్నావిరేత్యాది గుణములు నిషేధముగానుండుటచేత నతఁడు నిర్గుణుఁడనఁబడుచున్నాడు" పరమాత్మ సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుడు, శుద్ధుఁడు సనాతనుఁడు, అన్నిటినతఁడే సృష్టిచేసియున్నాఁడు. ఈపర్వతములు, ఈనదులు, ఈస్రోతస్సులు, ఈ సముద్రములు, ఈమైళ్ళకొలఁది విశాలమైన యెడారులు, ఈచక్కని వనములు, ఈసొంపైనపూవులు, ఈకార్మొగులు, ఈ

కన్నులను మూతబరచు తళుక్కున మెఱయుమెఱుపు, ఈ బ్రహ్మాండమును ప్రకటులుజేయగల పిడుగులు, మొదలగునవన్నియు నతనిమహిమయే. ఈప్రపంచమునంతను కాంతివంతమును, వేడిగాను జేయుగలసూర్యుడును, చల్లని తనకిరణముల ద్వారా అమృతమును వెదజల్లు చంద్రుడును, నక్షత్రములు నతనియానతిచేతనే తమతమవిధులను నెఱవేర్చుచు తిరుగుచున్నవి. ఈసమస్తవస్తు విస్తారసంసారమతని వంకకే ప్రేలెత్తిచూపుచున్నది. భగవంతుడీసకలమునందు బాహ్యాభ్యంతర వ్యాపకుడైయున్నాడు. ఏస్థానమును నతడులేనిదిలేదు* అనియిట్లుప్రార్థించిన మనము సగుణభావముతో నతనినుపాసించుచున్నామని తెలియవలెను. అతనిమహిమనుజూచియు, నతని పరాక్రమమును గాంచియు, నతనియసీమిత వైశాల్యమును గన్గొనియు, నతనిగుణములను వర్ణించుచు మనమతనిని సగుణముగా నుపాసింతుము. అతడున్వయముగా అజరుడు, అమరుడు, నిరాకారుడు, నిర్వికారుడు, అతడు బంధనములందు జిక్కడు, అతడుగణింపబడజాలడు, అతనిని తూచజాలము, కొలువజాలము, అరూపుడు, అనాది, అనంతుడు, గంధములేనివాడు, స్పర్శలేనివాడు, శబ్దములేనివాడు, ననియిట్లు ప్రార్థించుచు విచారించుచు మనమతనిని నిర్గుణముగా నుపాసింతుము.

ఈరెండువిధములైన యుపాసనములను ప్రతిదినమును నాచరింపవలెను. వేదమునందు రెండుతెఱగులగు మంత్రము

లునుగలవు. వీనిని పఠించినతరువాత భగవంతుని సన్నిధాన మునకూర్చుండుట మిగిలియుండును. పూర్వోక్తసాధనము నను సరించి యాసనమునకూర్చుండి ప్రాణాయామముచేసి పరమేశ్వరుఁడుకనఁబడగల గుహాయందు ప్రవేశింపుఁడు. దీని విధానమును శ్రీమద్దయానంద భగవానులవారిట్లు వ్రాయు చున్నారు:- "కంఠమునకుదిగువను రెండుస్తనములకు మధ్యనను ఉదరమునకు పైనను బ్రహ్మపురి అర్థాత్తుపరమేశ్వరుని నగర మనఁబడు హృద్దేశముమధ్యనగల గర్తమునందు కమలాకార వేశ్మము అనఁగా నవకాశరూపమగు నొకస్థానముగలదు, దానియందు సర్వశక్తిమంతుఁడగు పరమాత్మలోపల వెలుపల నేకరసుఁడై నిండియుండు ఆనందస్వరూపుఁడగు పరమేశ్వరుఁడు ఆప్రకాశితమగు ప్రదేశముమధ్యననే వెదకినచో దొరకఁగలడు. అతఁడు లభించు రెండవ యుత్తమమగు స్థానమును, మార్గ మును నెద్దియులేదు-

యోగీశ్వరుడుపనిషత్తుల ననుసరించి యెంతసరళముగను యెంతచక్కగాను పరమాత్మని సరియైనతావును తెలిపి యు న్నాడు! దీనినిపొందియు మనము పరమేశ్వరుని సమీపము నకుజేరకున్ననయ్యది మన దౌర్భాగ్యమే. ఒకసారి హృదయ గుహాయందు నిహితమైజ్యోతితో నిండియున్నవానినిగానట్టి స్థానమునందు జగదీశ్వరుని దర్శనముచేసికొనిన నిఁక మిగులున దేమి?

హృదయ మెక్కడ?

కొందఱి యభిప్రాయమున హృదయగుహ శిరస్సున నున్నదనికలదు. మస్తిష్కమునకు పైనను తలపుర్రెకుగ్రిందను నొకచోటుకలదు. దీనిని క్షీరసాగరమనుచున్నారు. అదియే బ్రహ్మరంధ్రమును. కాబట్టివారా బ్రహ్మచక్రమునందు ధ్యానమునిలుపవలయునని చెప్పుదురు. కాని యుపనిషత్తులు హృదయగుహ కంఠమునకు గ్రింది ప్రదేశముననున్నదని తెలుపుచున్నవి. నాకీరెండిటిలోను నెట్టియాపత్తియు గనబడుటలేదు. విషయముస్పష్టమే:— భగవంతునిగాంచుటకు రెండుసాధనములుగలవు:— ఒకటి విజ్ఞానము రెండవది చిత్తైకాగ్రత. విజ్ఞానముయొక్క స్థానము మస్తిష్కమునందును మనస్సుయొక్కస్థానము రెండు స్తనముల మధ్యభాగమున హృదయాకాశమునందును నుండును. ఈరెండింటిని గలుపుట ముఖ్యావసరము. ఎంతవరకు విజ్ఞానములభింపదో యంతవరకు పరమేశ్వరదర్శనమసంభవము. కావుననన్నిటికి మొదట భక్తుడాత్మజ్ఞానమును గ్రహించుటకొరకు ఆజ్ఞాచక్రము (భ్రూమధ్యము) నకు వెళ్లవలసి యుండును. ఏలన దాని కేంద్రస్థాన (Head office) మందే గలదు. ఇచ్చటభక్తుడు ప్రయత్నముచేసి విజ్ఞానమును సిద్ధించుకొని యోగ్యతను బొందినతరువాత నతనికి హృదయగుహాలోనికిఁబోవ (Pass port) నాజ్ఞాపత్రము లభించుచున్నది. అచ్చటినుండి ప్యాసుపోర్టును దీసికొని తిరిగి హృదయగుహాయందుజొచ్చి యందే దర్శనమును పొందును. అథర్వవేద కేన సూ

క్తము (౧౦. ౨) నందునీవిషయమును గూర్చిన యొకహృదయంగమమగు మంత్రముగలదు.

మూర్ధానమస్య సంసీవ్యాథర్వా హృదయంచయత్।
మస్తిష్కాదూర్ధ్వం ప్రైరయత్ పవమానోఽధిశీర్షతః॥

"ఏకరసముగా నుండు నాపవిత్ర పరమేశ్వరుఁడు, యీ మందిరముయొక్క మూర్ధమును కుట్టువేసి (జగత్తులోనికిఁ బంపించెను) యతఁడు మస్తిష్కమునకుఁ బైకిపోయి, శిరమ్మునకుఁ గ్రిందిభాగమున హృదయమునందు నివసించును"

తాత్పర్యమేమన, పరమాత్ముని బొందఁగోరెడు భక్తులు మస్తిష్కహృదయముల నొకటిజేయుట యావశ్యకము. బుద్ధి యొకవంకకుఁ బోవనాజ్ఞాపించిన, మనస్సింకొకదిశకుఁ ద్రోసుకొనిపోవక యుండవలెను. రెండింటినికుట్టి యొక చోటనుంచవలెను. వీనిని గుట్టకున్నచోఁ పనిజరుగదు. దీనినిగురించి యొక రోచకమగు భావమును శ్రీమన్మహాత్మ నారాయణస్వాముల వారిట్లు తెలిపియున్నారు. "పరమాత్మ తర్కమునకతీతుఁడు. అర్థాత్తు మస్తిష్కమునకు వెలుపలనున్నాఁడు. శ్రద్ధాప్రేమభక్తుల కిక్కయగు హృదయమునందే యతని దర్శనములభించును" జీవితకాలమునందు పరమాత్మదర్శనము హృదయాకాశమునందు కాఁగలదనియు, మృత్యుకాలమున నాత్మకు బ్రహ్మచక్రమునందు దర్శనము లభ్యమగుననియు భావించిన నన్ని చిక్కులును జక్కపడును. ఇట్టియవస్థలోనే బ్రహ్మరంధ్రమునుండిపోవుచు శరీరమునువదలుట విధింపఁబడియున్నది. భక్తుల

యొక్కయు, యోగులయొక్కయు నాత్మ, మృత్యు సమయ
ముననింద్రయోని (గొంతులో వేలాడఁబడియుండు నొకమాంస
పుముద్ద) లోనికివచ్చి యచ్చటినుండి, చక్కగాఁబైకి బ్రహ్మ
రంధ్రముగుండా వెళ్లిన శరీరబంధనమునుండి ముక్తి దొరకును.
ఇట్టిభక్తులు మోక్షార్హులు. ఈవిషయము నెదుట నుంచుకొని
యున్న యెడ హృదయ మస్తిష్కములఁ గూర్చిన జగడమే
మాత్రమును మిగిలియుండనేరదు. భక్తుఁడు తనగతిని బ్రహ్మ
చక్రము వరకు జేరునట్లుగా జేసికొనియుండుట యావశ్యకము.
అంతవరకుఁ జేరగలిగినతరువాత హృదయగుహలోనికిఁ దిగి
వచ్చుటకొరకాజ్ఞలభించును. ఇక్కడనేదర్శనమునుబొంది, యం
త్యకాలమున నీబ్రహ్మచక్రమార్గమున భక్తునియాత్మ శరీర
మును త్యజించును.

---

# మనోదౌర్బల్యము

మనస్సును వశములోనికిఁ దెచ్చుకొను సాధనములతో బాటు మనస్సుగుణమెట్టిదోయని తెలిసికొనుట యవసరము. దీనిపరుగు లెంతవరకో తెలిసికొనిన దానిని వశపఱచుకొనుట సరళమగుచున్నది. మనుష్యశరీరముయొక్క ప్రతినాళమును పరిశీలనముచేసిన ఋషీశ్వరు లీశరీరము రచియింపఁబడిన నవ తత్త్వములను, ద్రవ్యములను వెదకికనుగొనినారు. ఈరీతిగానే ప్రపంచము సృష్టించుటయందే యే వస్తువులుపయోగింపఁబడినవో వానినిగూర్చియు ఋషీశ్వరులు సంపూర్ణవిజ్ఞానమును దయచేసియున్నారు. దర్శనగ్రంథములలో నీవిషయములు మిక్కిలి రమణీయముగా వివరింపఁబడియున్నవి. వైశేషికధర్మమునందు క్రింద వివరింపఁబడిన తొమ్మిది ద్రవ్యములు ప్రపంచ సృష్టియందు గలవనియున్నది.

పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిశ, ఆత్మ, మనస్సు శరీరనిర్మాణమునందును నివే ద్రవ్యము లుపయోగింపఁబడినవి. ఋషివర్యు లీద్రవ్యముల స్వరూపము, లక్షణము, గుణము, లింగములనుగూడ కనుగొని పృథివికి గ్రంథమును, జలమునకు రసమును, తేజస్సునకు రూపమును, వాయువునకు స్పర్శమును, ఆకాశమునకు శబ్దమును, ఆత్మకు ఇచ్ఛాద్వేషణ ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానములనియు

లింగములను వ్యాఖ్యానముచేసి "మనస్సు"నుగూర్చియు తెలిపి యున్నారు.

దర్శనములను గురించిన ఈ ప్రస్తావనయంతయును నేను మనస్సుసంగతిని తెలుపుటకుగాను నుదహరించితిని కానితర్క వితర్కములుగల యీచిక్కుల వివరించుటయందెట్టి యితరాభి ప్రాయమునులేదు. న్యాయదర్శనకర్త మనస్సునుగూర్చి మహ త్వపూర్ణవాక్యము నొకదానిని వ్రాసియున్నాఁడు. అయ్యాది మనోజయమును బొందగోరు జిజ్ఞాసువులకు మిక్కిలి ప్రయో జనకారి. ఏశత్రువునైనను జయింపవలసియున్న వాని బలహీన మగుతావులను తెలిసికొనుట ముఖ్యావసరము. మనస్సును జయింప నిచ్ఛగించువారు నిదివిని న్యాయదర్శనము మనస్సు యొక్క దౌర్బల్యమును చక్కగాఁ బ్రదర్శించినదని ప్రసన్ను లుకాఁగలరు.

యుగపజ్ఞానాను త్పత్తిర్మనసో లింగమ్

న్యాయ ౧-౧-౧౬

"దేనికినొకే కాలమున రెండుపదార్థములను గ్రహిం చుట మఱియు జ్ఞానము కలిగియుండుటలేదో అదియే మనస్సని పలుపకఁబడుచున్నది.

మనస్సొక సమయమున కేవలమొకేపనిని చేయఁగల దనియు, నొకసమయమున నొకేవిషయమును గ్రహించు సామర్థ్యము గలదనియు, ఒకక్షణమున నొకేవస్తువునుగూర్చిన జ్ఞానము కలిగియుండి రెండువస్తువుల వైపునకు పోజాలదనియు

నెఱిఁగిన దీనినొక పరమాత్మునివైపునకుఁ బ్రవేశపెట్టుట యెట్టి కఠినమైన పనియుగాదు. కేవల మొకేతడవ బలపూర్వకముగ బ్రయత్నించుటయు హఠముచేయుటయు నవసరమై యున్నది. ఒకవర్యాయము దీనిని "ఓం జపము"న జేర్చిన నిఁక దానియందే నిలిచియుండును. ఇది రెండవ పదార్థమువైపునకుఁ బోవనేజాలదు. దీనికి నొకేసమయమున రెండు పదార్థముల ధ్యానించగల శక్తిలేదు. మనస్సుయొక్క యీ దుర్బలతను గనిపెట్టి భక్తులగువారు లాభమునుబొంది దీనిని భగవంతునివైపుసకు జేర్పయత్నించి తప్పక సఫలతను బొంద గలుగుదురుగాత!

# భక్తికి అపాత్రులు.

ఈశ్వర్ నామ్ అమూల్యహై రామ్ బినాబికాయ్
తులసీఅచరజ్ దేఖియే కో ఈగాహాక్ నఅయ్॥

ఈశ్వరుని అమూల్యమైన నామము వెలలేకుండ నోనఁగ బడుచున్నది.

"ఓతులసీదాసుఁడా! అచిరకాలములోనే కొనునట్టి యితరుఁడును రాకుండునట్లు జూడుము."

నిస్సందేహముగా భగవద్భక్తియందే మాత్రము గాని వ్యయముకాదు. భగవంతునినామము వెలలేక యేలభించుచున్నది. కాని యెవ్వఁడును కొనువాఁడు రాఁడు. ఇది మిక్కిలి చోద్యముగా నున్నది. ఈయుచ్చెరువునుజూచి తులసీదాసుల వారు స్వయముగానే దీనికి ప్రత్యుత్తరమిచ్చుచున్నారు.

తులసీ పిఛిలే పాప్‌సే హరిచర్చాన సోహాయ్
జైసే జ్వర్ కేవేగ మే భూఖ్ బిదాహో జాయ్॥

"ఓతులసీదాసుఁడా! పూర్వపాపమువలన భగవద్భజనము బాగనిపించదు."

"జ్వరము తీవ్రముగానున్నప్పుడే ఆఁకలిలేకుండా పోవుచున్నది."

మనుష్యుఁడుజ్వరగ్రస్తుడై యున్నప్పుడు, అమృతాత్యమృతతుల్య వస్తువునయితము మంచిగానుండదు. పాలుత్రాగుటకు

గాని, మరియేతినుబండమును తినుటకుగాని రుచిగానుండదు. కాని యొక్కొక్కసారి చురుకైనవస్తువులకొఱకు మనోలాలస కలుగును. అప్పుడైనను నాఁకలియుండదు. ఇవ్విధముననే యెవరికి పూర్వజన్మమునందలి పాపములను జ్వరమువచ్చియున్నదో వారికిభగవద్గుణగానము మంచిగాగన్పట్టదు. వారుపరమాత్ముని నామమునకు దూరదూరముగాఁ బోవుదురు. కొందఱు భగవంతునియునికినే నమ్మరు. ఇట్టివారు నిజస్థితిలో రోగులు. వారి మనస్సు,ఆత్మ పాపగ్రస్తములైయున్నవి. కావున వారిమనస్సు భగవద్భజనమునందు ప్రవేశింపదు. నృత్యములు,వినోదములు, శృంగార ప్రదర్శనములులోనగునిట్టి వేరు చురుకైన వస్తువుల రుచులుగోరుచు వానివైపునకే పరుగెత్తుకొని పోవుచుందురు. కానివారు జ్వరగ్రస్తులైయుండి వీనివలనరోగమునింకనునెక్కువ చేసికొను చున్నామని యెఱుఁగజాలకున్నారు. ఇట్టిలోకులు భగవంతుని నెప్పుడైనను జూడఁగలరా! యను సందేహము కలుగును.

యజుర్వేదము ౧౭ వ యధ్యాయము ౩౧ వ మంత్రి మీావిషయమును మిక్కిలిగా స్పష్టపఱచును. ఎట్టివారు భగవంతునిగాంచజాలరను ప్రశ్నమునకు నిమ్నోక్త మంత్రమునందు రమ్యముగా నుత్తరమియ్యబడినది.

నతంవిదాథయ ఇమాజజానాన్యద్యుష్మాకమంతరంబభూవ
నీహారేణ ప్రావృతాజల్ప్యా చాసు తృప ఉక్థశాసంశ్చరంతి॥

"ఓమనుష్యులారా! ఏవిధముగ బ్రహ్మనెఱుఁగని మనుష్యులు ధూమాకారమగు మంచునకు సమానమగు నంధకార

జల్పులు(జల్పాకులు):—

పరమాత్మ దర్శనమునుండి వంచితులగు రెండవ తెగవారు జల్పముచేయువారు. అర్థాత్తు కొంతసత్యముకొంతఅసత్యముగూడిన వాదానువాదములందు స్థిరులై యుండువారు. కొంతసామాన్యజ్ఞానమును సంపాదించుకొని శబ్దజాలమునఁబడి కొట్టుకొనుచుండు బ్రహ్మరాక్షసియనునట్లు వాదవివాదములు చేయువారు. సంపూర్ణజ్ఞానము లేనట్టివారు లేక వాదవివాదములలో చిక్కియుండువారును, కేవలమితరుల భాషయందును వాక్యములందును దోషాన్వేషణమునందే కాలయాపనముజేయు స్వభావమునుగలిగి తత్త్వమును జేరఁజాలనివారును, కేవలము గ్రద్దలవలె మృతకళేబరములపైన దిరుగువారును హంసవృత్తిగలిగియుండక కాకవృత్తిగలవారును, నగు వారిఫాలమునజ్యోతిఃప్రపూర్ణమైన స్వర్గమునందుజేరి ప్రియతముఁడగు భగవానునిపొందుట లిఖింపఁబడలేదు.

అనుతృపులు:—

మూఁడవపద్ధతివారు వేదమునందు, "అనుతృపః" యని చెప్పబడియున్న వారు. వీరిని ప్రాణపోషకులనియు లేక తిండిబోతులనియు ననవచ్చును. అర్థాత్తు * విరోచనబుద్ధిగలవారు

* శరీరమునే ఆత్మయనితలఁచి, దీనిపూజయందే మగ్నులైయుండు వారు. దీనివిషయమున ఛాందోగ్యోపనిషత్తునందొక రోచకమగు కథగలదు:—

ప్రజాపతి యిట్లుపలికెను:— "పాపమునుండి వేఱుగానున్నట్టియు, జరామరణ రహితమైనట్టియు, శోకమునుండి దూరముగానున్నట్టియు, ఆకలి

ఈశరీరమే సమస్తమనితలంచి యున్నవారు. నారునోరులేని ప్రాణుల గొంతుకోయవలసివచ్చినను, ఈ శరీర జిహ్వాను తృప్తి పఱుపవలయును.

---

పాపము లేనట్టిదియు సత్యకామమును, సత్యసంకల్పమును గల ఆత్మను వెదుకవలెను. దానినే వెదుకవలెను. ఎవడీయాత్మను వెదకి తెలిసికొనుచున్నాడో, యతడు సమస్తలోకములను, సమస్తకామములను బొందుచున్నాడు" ప్రజాపతియొక్క యీ వచనములను దేవదానవులిరువురును విని వారిట్లు పలికిరి:--

"ఏయాత్మను వెదకి పురుషుఁడు సమస్తలోకములను, సమస్తకామములను పొందుచున్నాఁడో యట్టియాత్మను, మనము వెదకిచూడవలెను"

ఇట్లునిశ్చయించి దేవతలలో నింద్రుఁడును, నసురులలో విరోచనుఁడును ప్రజాపతికడకుఁబోయిరి. ప్రజాపతి వారిరువురువచ్చిన కారణమునడిగెను. ఇద్దఱును 'ఆత్మను వెదుకవలెనను మీవచనము ప్రపంచమునందంతటను చాటింపఁబడుచున్నది. కావున మేమిరువురము దానిని వెదకుటకొరకే మీయొద్దకి వచ్చితిమని' నుడివిరి; ప్రజాపతివారియువురినిజూచి 'యీకంటిపాపలో నేపురుషుఁడు కనబడుచున్నాఁడో, అతఁడేయాత్మ. ఇదియే నేను చెప్పినదియు. ఇదిమృతిలేనిది. ఇదియభయమైనది. ఇది బ్రహ్మము" అనెను.

ఇద్దఱునుఅప్పుడు "ఓభగవానుఁడా జలములందు గానబడునదియు, వద్దములో గోచరించునదియు నేమిటి" యనిపలికిరి.

అందులకు ప్రజాపతి:--"ఇదియే వానిలోఁగనఁబడును, నీటిపాత్రయందు మీరు రెండాత్మలను (మిమ్ములమీరు)జూడుఁడు. అట్లైననేమేనియు మీరు ఆత్మయందు (తమ్ముదాము) గ్రహింపఁజాలనిచో దానిని నాకుదెలుపుఁడని పలికెను. వారు నీటిపాత్రలో నటులేచూచిరి. ప్రజాపతివారిని "మీరేమి జూచితిరని యడిగెను. దానికివారు "ఓప్రజాపతీ! మేమిందు సంపూర్ణముగు నాత్మను జూచుచున్నాము. రోమరోమము. నఖనఖమువరకును పూర్ణమైన మానీడలను జూచితి" మనినుడివిరి

దొంగతనము చేయవలసియుండనిమ్ము, మోసముచేయ వలసిరానిమ్ము, యీశరీరముయొక్క కడుపనెడు గోతిని నింప వలసియే యుండును. ఇతరులు చచ్చినను, బ్రదికినను, నాకన్ని

---

ప్రజాపతి వారితో "మంచివైన భూషణములను, వస్త్రములను ధరించి శుభ్రులై (వెంట్రుకలను, గోళ్లను కత్తిరించి) మఱలను నీళ్లలోఁ జూడుఁడు" అనిపలికెను. దానికి వారటులనే చేసిరి. ప్రజాపతియప్పుడు మీరేమి చూచితిరనియడిగెను. ఏప్రకారముగ మేము సొమ్ములను వస్త్రములనుధరించి పరిశుభ్రులమైయున్నామో యటులనే జూచుచున్నాము. ఓస్వామీ యీయిరువురి ఆత్మలు (అర్ధాత్మప్రతిబింబములు) నిటులనే గలవు. అని యుత్తరమిచ్చిరి. అందులకు ప్రజాపతి "ఇదిఆత్మ, ఇదిఅవినాశి, ఇదిఅభయము, ఇదిబ్రహ్మము" అనివచించెను. అంతట వారిరువురును ప్రసన్నచిత్తులై చనుచుండిరి.

వారిద్దఱును పోవుచుండుట జూచి, "ఈరెండాత్మలను తెలిసికొనకయు, వెదకికొనకయు, వెళ్ళుచున్నారు. ఈయిద్దఱిలో తెలిసికొనిన దేవుఁడుగాని, అసురగాని యీయుపనిషత్తు (దేహముఆత్మయనుసిద్ధాంతము) ననుసరించుచున్నాఁడో యతఁడు నశింపఁగలఁడు" అని ప్రజాపతివచించెను.

విరోచనుఁడు దానినిగమనింపక సంతసించినవాఁడై రాక్షసులవద్దకేగి "ఈశరీరమేయాత్మ, ఇదియే సేవించుటకు యోగ్యమైనది. ఎవఁడిచ్చట ఆత్మ (దేహము)ను పూజించుచు సేవించుచున్నాఁడో యతఁడు రెండులోకములందును సుఖించు" నని చెప్పెను. కానియింద్రుఁడు దేవతలయొద్దకుఁ బోవుటకు బూర్వమొకసంశయమును బొందెను. ఎప్పుడిది (నీటిలోఁజూచిననీడ)అర్ధాత్మ శరీరము మంచిభూషణములను ధరించుచున్నదో అప్పుడు మంచిభూషణములు గలదగుచున్నది. మంచివస్త్రములను ధరించినప్పుడు మంచివస్త్రములుగలదగుచున్నది. ఈవిధముగానే శరీరము గ్రుడ్డిదైనప్పుడిదియును గ్రుడ్డిదగుచున్నది. చెవిలేకుండిన చెవిలేనిదగుచున్నది. కుంటిగానుండిన కుంటిదగుచున్నది. నాకీసిద్ధాంతము నందించుకంతయు మేలుకనబడుట లేదని యింద్రుఁడు తిరిగి ప్రజాపతియొద్దకు వెళ్లెను. ప్రజాపతి యింద్రుని

విధములైన సుఖములు లభింపవలెను. ధర్మము, జాతి, దేశము మట్టిలోగలువని స్వశరీర సౌఖ్యముకొరకు మోటార్లు, బంగళాలు, తోటలును, నానావిధములగు భోజనములు కావలసియుండును. ఇటితిండిపోతులకు ధర్మము, విజ్ఞానము, కేవల

---

జాచి, "ఇంద్రా నీవుశాంతుడవై విరోచనునితోడ బనితివిగదా. నీవేమి కోరి మరలవచ్చితివి? అనియడిగెను-

ఇంద్రుడు తనకుగల సంశయమును వారికిని వేదించి "ఈశరీరము నశించిన ఛాయసయితము నశించుచున్నది. కావున యీసిద్ధాంతమునందేమి ప్రయోజనమును గానరాదు అనివిన్నవించెను- "నీవుబాగుగా తెలిసికొంటివి- ఏలన ఛాయఆత్మకాదు- ఇప్పుడు నీకాత్మనుగురించి విపులముగా తెలుపుదునుఅనిప్రజాపతి వాక్రుచ్చి స్వప్నమునందు మహిమానుభవము చేయువారి ఆత్మను వివరించెను- ఇంద్రుడజ్ఞానియందును నాపత్తిగాంచెను- అప్పుడుప్రజాపతి సుషుప్త్యవస్థయందున్నవారి యాత్మనువర్ణించెను. ఇంద్రుడందునుగల లోపములను ప్రజాపతికిజూపించెను- దానివలన ప్రజాపతి యితడు సత్యమైన ఆత్మనుగాంచగ జనువాడుకాడని తెలిసికొని యిట్లుపదేశించెను:-

"ఈశరీరము మరణించునది. ఇదిమృత్యువును గూడికొనియున్నది. ఇది యీఅమరమును, అశరీరియునగు ఆత్మకు అధిష్ఠానము(ఉండుస్థలము). ఇది శరీరముతో నేకమైయున్నంతవరకు, శరీరమునందాత్మాభిమానమును నిలుపుచున్నది- ఇదిప్రియాప్రియ(హర్షశోక)ములచేత పట్టుబడియున్నది, ఇది అశరీరమైనప్పుడు తన్నుదాను శరీరమునుండి వేఱుగాభావించుచున్నది. అప్పుడు దీనికి ప్రియాప్రియములుండవు"

ఈకథను సంపూర్ణముగా స్వాధ్యాయముచేయుటకొరకు ఛాందోగ్యోపనిషత్తుయొక్క- యెనిమిదవ ప్రపాఠకమునందలి యేడవ, యెనిమిదవ, తొమ్మిదవ, పదవ, పదునొకండవ, పన్నెండవఖండములను పఠింపనగును.

మొకకడుపే యైయున్నది. తినుట, త్రాగుట, తినుచునే మరణించుట. ఒకానొక కాలమున రోమక దేశస్థులు నిర్విర్థమైన జీవితమునే గడుపుచుండెడివారు. వారు తినుచు కడుపునిండిన తరువాత వమనము చేసుకొనుచుండిరి? మరల భుజించి తిరిగి వమనము చేసికొనుచుండిరి. వారు దీనితోనే సుఖమని తలంచియుండిరి. ఇట్టివారు జీవితముయొక్క ధ్యేయము కేవలము తినుటయేయని తలంతురు. వారు జీవించుటే తినుటకొరకు (They live to eat ) ఒక పారసీక కవి వాక్యము మిక్కిలి మనోహరముగా నున్నది.

ఖుర్దన్ బరాయె జీస్తన్ జికర్ కర్దన్ అస్త్
తో మొతకిద్ కె జీస్తన్ అజ్ బహారె ఖుర్దన్ అస్త్

అర్థాత్తు "తినుట జీవించుటకును, భగవద్ధ్యానము కొరకునుగలదు. కాని జీవించుటే తినుటకొరకని మీరు నమ్ముచున్నారు." ఇట్టిలక్షణముగల మనుష్యులే అసుతృపులు. వీరెప్పటికిని తమ మనస్సును పరమేశ్వర భజనమునందుఁ జేర్పజాలరు. వారుశరీరముయొక్క వేర్వేఱింద్రియముల సంతుష్టియందు దత్పరులైయుందురు. ఒక యింద్రియముకొరకు మంచి దృశ్యములను గొనితెచ్చియు మరియొకదానికొరకు నృత్యగీతాదుల యేర్పాటును జేసియు నింకొకదాని నిమిత్తము రుచిగలతిండియును, వేఱొకదానికొరకు వేఱుగా నితర మగునిచ్ఛనుగలిగి "అసుతృపు" లగువారు వీనికిదాసులై వారిజీవితమునంతయును, ఎద్దు, కుక్క, గాడిద, గుడ్లగూబలవలె వ్యర్థ

పుచ్చుచున్నారు. దీనికి శరీరమువైపు ధ్యానమీయనే వలదని తాత్పర్యముగాదు. అట్లుకాదు, ధ్యానమును తప్పక ఇయ్య వలెను. ఆత్మనివసించు స్థానమువైపుననే ధ్యానమీయకున్న మఱెద్దానియందు ధ్యానమియ్యవలెను? దీనిని నివాసస్థానమ నియే తలంపవలెను. కానియాత్మయనికాదు- భగవద్గీతయందు కృష్ణభగవానుఁడీ విషయమును బాగుగా తెలిపియున్నాఁడు.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతిదుఃఖహా॥

"యుక్తమైన ఆహారమును, యుక్తమైనవిహారమును, యుక్తమైనచేష్టయును, కర్మమునుచేయుటయును, యుక్తమైన నిద్రయు మేల్కొనియుండుటయును గలవారు యోగసిద్ధిని బొందఁగలరు."

యుక్తమనగా నుచితమైనట్టియు, తగినట్టియు వనియర్థ ము. నియమముగలిగి భుజించువారు శరీరము బలహీనమగు నంతతక్కువగాని, తినుసమయమున నేమియును యోచింపక మితిమీరి గొంతులోనికి వచ్చునంత యెక్కువగాగాని భుజిం పరు. శరీరరక్షణమున కవసరముగలిగియున్నంత మాత్రమే భుజింపవలెను. ఎక్కువయును తక్కువయును పనికిరాదు. ఈ విధముగా నేపనియును నియమితముగాఁ జేయువలయును. నిద్రించుటయందును మేల్కొనియుండుట యందును "యుక్త" మను సిద్ధాంతమును సమ్ముఖమునందుంచుకొన వలయును. కార్యమును నిజశక్తిసామర్థ్యముల ననుసరించియే చేయవలెను.

అప్పుడుచేయఁబడు కార్యములు సంపూర్ణముకాఁగలవు. ఈ విధముగ జీవితమునుగడుపువారు నిశ్చయముగా యోగమునే చేయుచున్న వారగుచున్నారు. ఇట్టివారే భగవంతునితోడ యోగమును గలిగియుండుట కర్హతను పొందుచున్నారు. ఎవరు తమజీవితముయొక్క ముఖ్యోద్దేశము కేవలముదర పూజయేయని నమ్ముచున్నారో వారినిగూర్చి తులసీ దాసుల వారిట్లు నుడువుచున్నారు:—

భజన్ కరన్ కో అలసీ భోజన్ కో తయ్యార్
తులసీ! ఐసే జనన్ పర బార్ బార్ ధిక్కార్॥

"భజనసేయుటయందాలసించునట్టియు, భోజనము సేయుటకు సంసిద్ధులుగానుండునట్టియు వారెవరుగలరో, ఓతులసీదాసుఁడా! మాటిమాటికిని నట్టివారికిధిక్కారము!" కావున నట్టివారు భగవంతుని ప్రేమకు పాత్రులు కాఁజాలరు.

ఉక్థశాసులు:—

వేదాజ్ఞననుసరించి భగవంతుని తెలిసికొనఁజాలనట్టి వారిని, వేదభాషలో "ఉక్థశాసు" లందురు. యోగీశ్వరుడగు దయానందభగవానులు దీనిభావము నిట్లువ్రాసియున్నారు:–

"యోగాభ్యాసమును విడిచిపెట్టి శబ్దార్థ సంబంధముల ఖండనమండనములందు రమణులైయుండువారు." గొప్పగాఁ జదివి, సమస్తజ్ఞానమును పొంది శాస్త్రార్థము చేయుటయందు సమానములేనివారై యుండియు పరమాత్మ చరణములందు లగ్నులై యుండనివారును, కేవలశబ్దజాలమునందును వ్యాకరణ

సూత్రవాగురములందుఁ జిక్కి అర్థములబంధనములనుండి తీరిక లేకుండునట్టివారును భగవంతుని తెలిసికొనుటయందసమర్థులై యుందురు. ఇట్టివారిని "వివాదకు" లనినను అనుపయుక్తముగాదు. స్వభావము వివాదాస్పదమైనట్టియు భాషచేదుగానుండి మాధుర్యమింతయును లేక నితరులను గోసికొనితినబోయినట్లు మాటలాడునట్టియు వారిమనస్సు భగవద్భక్తివైపునకు బ్రవృత్తముకాదు. ఈవేదమంత్రము ననుసరించి; అజ్ఞానులును అల్పజ్ఞానముతో నభిమానముగలిగినవారును అనుత్పన్నులు లేక తిండిబోతులు అర్థాత్తువిరోచన బుద్ధిగలవారును జ్ఞానులయ్యు వాదవివాదములలోఁ జిక్కియుండువారును, పరమాత్మదర్శనమునుండి వంచితులైయుండగలరు.

# భక్తికి పాత్రులు

భగవంతుని దర్శించు నిచ్ఛగలవారి యందన్నిటి కంటెను మొదట సంపూర్ణముగా నీశ్వరవిశ్వాస గుణముండవలెను. భగవంతునియందభేద్యమైన శ్రద్ధయు నిరంతరవిశ్వాసముచేతను మనస్సునిండి నిబిడీకృతమైయుండఁదగును. అతఁడున్నాఁడు. సమస్తమునందు వ్యాపకుఁడైయున్నాఁడు. మనయొక్క ప్రతి హావభావమును జూచుచున్నాఁడు. అతనినుండి యేవిషయమును దాగియుండఁజాలదు. మనకు కన్నుమూసి తెఱచుట యెంత సుగమముగానున్నదో యంతసులభముగా నీసమస్త సృష్టిని లిప్తకాలములో సమాప్తపఱచి దీనిని నూతనముగా సృష్టింప గలిగినంత శక్తిశాలి. కోట్లకొలఁది సూర్యులునతని సంకేతము చేత భ్రమణముచేయుచున్నారు. సమస్తకుల, ధన సంపత్తులు వానివే. అట్టిశక్తిమంతుఁడగు భగవంతుని శరణమును బొంది యున్నాను. ఈశ్వరుని విశ్వాసమును గూర్చిన జ్వలంతమగు నుదాహరణమును జూఁడదలంచిన దయానంద స్వాములవారి జీవితచరిత్రమును జదువుఁడు. సకలప్రపంచమును విరోధమైనది. కానిసర్వేశ్వరుని యందలి విశ్వాసము నాధారముగాఁజేసికొని సహస్ర సంఖ్యాకులగు విరోధివర్గమును జయించుచున్నాఁడు. ఏసమయమునందును శైథిల్యమునుగాంచఁడు. కాశీనగరము నందొక దయానందస్వాములవారే యుండిరి. వారణాసీపుర

వాస్తవ్యులు తప్పకదయానందులవారికి హానిగలిగింపవలెనని నిశ్చయించుకొనియుండిరి. దీనికిచాలాభయముజెంది బలదేవ ప్రసాదుగారు స్వాములవారిదరిజేరి "మహారాజా! నేఁడ నేకముగా జనులుగుమికూడగలరు. ఇది "గుండాల" నగరము ఇది ఫరుఖాబాదేమై యుండిన మీపక్షమునను పదుగురుజను లుండెడివారు." అనివచించెను. స్వాములవారి మాటను విని నవ్వి— "సత్యమను సూర్యుఁడు అజ్ఞానాంధకార సేనవొక్కఁడే జయింపఁగలఁడని యోగీశ్వరుల నిశ్చయము. ప్రాణముపోయి నను పోనిమ్ము. ఈశ్వరాజ్ఞయగు సత్యమునశింపకుండునుగాత! దిగులేటికి? ఒక్కఁడను నేను, ఒక్కఁడీశ్వరుఁడు, ఒక్క డేధర్మము." అని ప్రత్యుత్తరమిచ్చెను. ఇదియే యీశ్వరవిశ్వాసము- ఈ ప్రకారముగానే ప్రహ్లాదునిజీవితమును జదువుఁడు- ప్రపంచము నందలి యేకష్టమునతఁడు సహింపవలసియుండలేదా? అతఁడు దెబ్బలివలె నన్నింటిని యెదుర్కొను చుండెను. అతఁడు ప్రతి విపత్సమయమునందును నిట్లుపలుకు వాఁడు.

డూబన్ జర్యవవాఠ కఘుశేఁ జేఁ లాశీలాగ్

జహాఁ ప్రీతికాచీనహీఁ శావహాపాతీకా వాలగ్।

భక్తుఁడు తనహృదయములో నిట్లుప్రతిజ్ఞచేయవలెను. నామస్తిష్కము కేవలమొక పరమాత్ముని ముందఱనే వం గును గాని యెవఱిముందరను వంగునదికాదు. నామనోమంది రమునందా దేవునిసింహాసనమే యుండగలదుగాని యెవరికిని స్థలముండఁబోదు. భయంకరాతి భయంకరవిపత్తును అధికా

థికసుఖమును నన్ను భగవంతునినుండి విముఖుని గావింపకుం డునుగాత! ప్రపంచముయొక్క సమస్తకష్టములను గూర్చి యట్టహాసముచేసి యిట్లుపలుకుదునుగాక!

ఓమ్ ఉత త్రువంతునో నిదో నిరన్యతశ్చి దారత, దధానాఇంద్ర ఇద్దుకః
ఉతనః సుభగాంఅరిర్వోచేయుర్ద స్మకృష్టయః స్యామేదింద్రస్యశర్మణి
ఋ. ౧. ౪. (౫ ౬)

"మమ్ములనిందించువారు, నీవేయింద్రుడగు పరమాత్ముని పూజించునట్టి నీవిచ్చోటినుండియు నింక నితరస్థానము నుండియు పొమ్మనిస ననిమ్ము (౫) "మఱియు ధర్మాత్ములు మిమ్ముసౌభాగ్యవంతులని యనిననిమ్ము. కాని యోయుద్భుతకర్మములుగల యింద్రా! మేమునీశరణమునందే యుందుముగాత! (౬) ప్రపంచమునందలి యెట్టిశక్తియును భగవంతుని యందలి నమ్మకమును శిథిలపఱచజాలకుండును. ఈవిధమైన యీశ్వరవిశ్వాసము భక్తునిహృదయములో నుండవలయును.

ప్రతిస్థితిలో సంతుష్టత:—

రెండవవిషయము భక్తునిహృదయములో పరమాత్ముడే మాతల్లియని యుండవలెను. నిశ్చయముగా తల్లియేమిచేసినను పిల్లవాండ్ర మంచికొరకే చేయును. ఏయవస్థలమనలనతఁడుంచిన, నాయవస్థయందే మనము ప్రసన్నులమై యుండఁదగును. దీనికిభక్తుఁడు ఆలసియు దరిద్రుడుగానుండవలెనని తలంపరాదు. అట్లుకాక భక్తుఁడు సంపూర్ణరూపముగా ప్రయత్నశీలుఁడుకావలెను. ప్రతికార్యమును నిండైన ధ్యానముతో నెఱవేర్పవలెను. బాగుగకష్టపడవలెను. రోగముగాని ఆపద గాని వచ్చినచో దానిని నివారించుకొనుటకు తన యొక్క

నితరులయొక్కయు బుద్ధివలన, లాభమును బడయవలెను. తానిసుమంతయును లోపముచేయఁజనదు- కాని దానిపరిణామము మంచిగాగాని చెడ్డగాగాని (మనదృష్టిలో) యుండిన, "భగవానుడా! నీవు మాకొరకెయ్యది బాగనితలంచితివో దానినిజేసితివి. నాకుదీనివలననే కల్యాణముకలుగును." అని పరమేశ్వరునకు ధన్యవాదముల నమర్పింపవలెను. దీనినే సంతోషమనియునందురు. తమవైపునుండి ప్రయత్నమునంతయు కార్యసిద్ధికొరకుఁజేసిన పిమ్మట దాని ఫలితమెట్లు లభించినను, దానితోనే తృప్తిజెందవలయును- భగవంతుని తలంపిటులనే యున్నదనియు, దీనియందే శ్రేయస్సుగలదనియు భక్తుఁడుతన మనస్సున భావింపవలెను.

తల్లి తనసంతానము నెప్పుడును దుఃఖితముగాఁ జూడ గోరదు. ఆమెపాలనిచ్చును- మంచియాహారములను తినిపించును. చక్కనివస్త్రములను ధరింపఁజేయును. ముద్దాడును- ప్రేమించును. కాని బాలుఁడు వ్యాధిగ్రస్తుఁడాయెనా మిఠాయినివానిచేతినుండి లాగికొనును- చేదైనమందులను త్రాగించును. ఎప్పుడైనను తుంటరితనముచేసినను లేక చేదైనమందును త్రాగకపోయెనేని చెంపదెబ్బకూడవైచును. భక్తుఁడుపరమాత్ముని తనతల్లియనిభావించిన నేదైనను మనదృష్టిలోమనపైని నాపదయు, నిర్ధనత, పుత్రవియోగము, పతివియోగము, పత్నీవియోగము, పితృవియోగము మున్నగునిట్టివే యితర కష్టములును వచ్చినయెడల భక్తుఁడు తన శ్రేయముదానియందే కల

దని నమ్మియుండవలెను. అతఁడేడ్చుట యెందులకు? హా హా కారము లెందులకు జేయవలెను? అతనిలోపలినుండి యిట్లుధ్వని వచ్చును:—

జీతారభేతూహామ్‌కో యాధడ్ సేసిర్ ఉతారే
అబ్ తోయహాయుల్ప్రేమీాకహాతా హైయూంపుకారే
రాజీహైఁహామ్ ఉసీమే జిస్‌మే తేరా రాజీహై
యాఁయూఁభీవాహ్వాహై ఔర్ వూంబీవాహ్వాహై॥

గీ॥ ప్రాణముంచిన శిరమును బరగఁగొనిన
భక్తుఁడెలుఁగెత్తి యఱచునీవ గిదినపుడు
నీకుహితమైన దేయగు మాకుహితము
అటులయైనను భళియందు మిటులయైన.*

కొంతమంది భగవంతుఁడు తన దయను కేవలము సాంసారిక ధనసంపత్తి వైభవసుఖాదులయందే జూపునని భావింతురు. ప్రాపంచిక దృష్టితో సుఖముగానున్నవారియందు భగవంతుని దయ మెండుగా గలదని జనులుతలంతురు. కానిభక్తుడిట్లుతలంపరాదు. భగవంతుని కృపారసము రేయుంబవలును సమస్త ప్రాణులపైన వర్షించుచుండును. ఇది నిలిచినదికాదు. నిలువబోదు. కానియొక్కొక్కప్పుడది సౌమ్యముగాను నొక్కొక్కప్పుడు భీభత్సముగాను ప్రకటింపబడుచుండుట మాత్రముణిక్కువము. ఎప్పుడైననొక సర్జను (Surgeon) ఆపరేషను చేయుచు శరీరావయవముల నెంతయో కోయుచుఁ జీల్చుచు నుండిన బాహ్యదృష్టితోఁ జూచు తెలివిలేనివాఁడు, "ఈడాక్ట

రెంతనిర్దయుఁడు? ఎంతనిర్దయతో మనుష్యుని కోయుచున్నాఁడు, రోగి యెంతయఱచినను మొత్తుకొనినను నితనికిదయరాదని'' పలుకును. కాని యామూర్ఖునిమాటలను విని సర్జన్ ఆపరేషన్ చేయుటను మానఁడు. ఏలన రోగికి కోఁతవలననే మేలుకలుగు నని బాగుగానెఱుఁగును.

ఒక నామిత్రుని పతివ్రతయగు పత్నియొక్క దేహాంత మైనది. అతఁడు తనపత్నియొక్క స్వభావమును సౌశీల్యమును కార్యకౌశలమును ప్రేమనుజూచి ముగ్ధుఁడై యుండువాఁడు. ఆమెరోగగ్రస్తురాలైనప్పు డతఁడు చికిత్సచేయించుట యం దెంతమాత్రమును లోపముచేయలేదు. కాని రోగముతక్కు వగుటకుమారుగా వృద్ధికాఁదొడఁగినది. కట్టకడపట నామెతన భర్తను విడిచిపెట్టి స్వర్గమునలంకరించినది. నామిత్రునిస్థితి మారి పోయినది- అతనికి ప్రపంచమంతయును నంధకార బంధురమై పోయినట్లు కనుపింపఁదొడఁగెను. విజ్ఞానముమాటల వలనను నతనికి శాంతిచేకూరలేదు. కాని భగవద్భక్తిమార్గము నవలం బించినప్పటినుండియు ఆత్మవీక్షణమునందు శ్రద్ధజనించినది. ఇప్పుడతఁడిట్లు వచించుచున్నాఁడు — "భగవంతుఁడు నాకు మేలునే కలిగించి యున్నాఁడు. నాఆయువుముగిసినను పత్నీ ప్రేమమునన్ను భగవంతునివైపునకుఁ బోనివ్వకుండెడిది- అద్దా నినుండి విముక్తిలభించుటయే మేలైనది- ఇట్లుగాకున్న నిప్పు డేయమృతమును నిత్యమును సేవించుచున్నానో యిదియెట్లు లభించెడిది!"

ఈవిధముగానే మనకెందున శ్రేయముకలదో మన మెఱుఁగము- మనదృష్టియు, మనబుద్ధియు దూరముగాఁ జన నేరవు- కాని "అతని" నేత్రములు బహుదూరముగాఁ జూడఁ గలవు- మనమేలు దేనియందుగలదో యతఁడే యెఱుంగును- కనుక భక్తుఁడీశ్వర విశ్వాసియైనప్పుడతని హృదయములో భగవంతుఁడెప్పుడును తనకు మేలునేచేయునని దృఢముగా నమ్మకము గలిగియుండవలెను. (God does every thing for our good.) అతఁడద్భుతుఁడు: తనయద్భుతములగు నుపాయముల చేతనే యతఁడు ప్రతికార్యమును జేయును. కొన్నివిషయములను మనము తెలిసికొనఁ గలముకాని, కొన్నిఁటిని తెలిసికొన జాలము. ఇట్టియెడ నతఁడెట్టిస్థితిలో నుంచిననట్టిస్థితిలోనే సంతోషముగానుండునట్లు భక్తుఁడు తనస్వభావమును సంసిద్ధముగా నుంచుకొన వలెను.

ఆత్మవిశ్వాసము:—

ఈ రెండువిషయముల తరువాత, మూఁడవది "ఆత్మ విశ్వాసము" స్వయముగానే భక్తునిహృదయములో నుదయించును. తనపైదాను విశ్వాసముగలిగి యుండుటకు లోపలినుండి ప్రేరేపణగలుగుచుండును. అతఁడు తన్నుదాను తుచ్ఛునిగా భావింపఁడు- తాను సకలప్రపంచ పరిపాలకుఁడగు తండ్రికి పుత్రుఁడుగానుండినచో నిఁక తుచ్ఛుఁడుగా నెట్లుండును: మహా మహునితోఁగలిసి యతఁడును మహామహుఁడయ్యెను. ఇప్పుడత డేమాత్రమును నెప్పటికిని తన్ను నసహాయుఁడనిగాని,

యనాథుడనిగాని, అసమర్థుఁడనిగాని పలుకఁడు. అతఁడు సదా ఆశావాదియై యుండును. నిరాశావాదము ( Pessimism) అతనినియంటనేజాలదు. ప్రతిమంచికార్యము నందును శూర వీరులవలె పాల్గొని విజయుఁడగును. కార్పణ్యము, భయము, ఆలస్యము, ప్రమాదము, నతనినిసమీపింపఁజాలవు. అతని హృదయము సంతోషముతో నిండియుండఁగలదు. ఉత్సాహాగ్ని యెప్పుడును నతనిని జల్లబడనీయదు. ఇతరుల స్కంధములపై నుంచుటకుమాఱుగ తనకార్యమును తానే నెరవేర్పఁగలవాఁడగును. ఆత్మవిశ్వాసియగువాఁడు భయంకరాతి భయంకరక్షేత్రమునందును దూకనుద్యుక్తుఁడైయుండును. ఏలన భుజములపైనను, తలపైనను, తనపైనను నతనికినమ్మకముకలదు. ఇంకనతఁడితరులసంపాదనము నువ్విళ్లూర్చుచు జూచుచుండక బోవుటేగాక యితరుల సంపాదనముపైన నాధారపడియుండుట పాపమనియెంచి తనచేతనే సంపాదించుకొనుచు నిట్టిసిద్ధాంతమును సరియని భావించును.

తులసీ కర్ పర్ కర్ కరో, కర్ తర్ కర్నా కరో
జాదిన్ కరతర్ కర్ కరో, తాహిదిన్ మరణ్ కరో॥

క॥ కరమునయాచననేయకు
నిరతము నిద్వ్రతమటంచు నెరవేర్పుము యే
మరినట్టియాదినంబున
మరణమునేబొందవలయు మహినోతులసీ!

ప్రభు మందిర సేవ:—

అతనినిజూచు భక్తులలో నొక ముఖ్యమగు గుణము గలదు. వారు సమస్త భూతములను తమ ఆత్మయందును, సమస్త భూతములందు తమయాత్మను జూచెదరు. సమస్త మనుష్యులును నతనికి పరమాత్ముని మందిరములట్లు గనపడెదరు. ఏభక్తుడు తనప్రియతముని మందిరము నేదానినైననుజూచి సంతోషింపకుండునా? పరమాత్ముని ప్రజలందఱును నతనికి బాంధవుల వలెనే గన్పట్టుదురు. భక్తుడెవ్వనితోను ద్వేషింపడు. ఈర్ష్య గాని, స్పర్ధగాని, శతృత్వముగాని యేదియును, మిగిలియుండదు. ఇటువాడీ క్రిందివిధముగా పాడుచు దిరుగుచునుండును.

కర్ హాఁమైందుష్మనీకిస్ సే, అగర్ దుష్మన్ భీహో అపనా
మహబ్బతు నేనహీఁ దిల్ మేఁ జగహా ఛోడీ అదావత్ కీ॥

ఆ- గీ॥ పగతురెల్ల నాకు బంధువులేయైన
ద్వేషమెవరితోడ బెట్టుకొందు
నూడుకొరకు ప్రేమ చోటునుహృదయాన
నుంపదయ్యె కరము పెంపుమీర.

ఇదియునుగాక అతడు తనభగవానుని యేమందిరము నైనను, మలినయుక్తముగాను, శిథిలమైనదిగాను, జూచినతత్క్షణమే దానిని బాగుచేయదొడగును. ఇట్టిభక్తులు మనుష్యమాత్రులను ప్రేమించుచుందురు. వారికెవ్వరును పరులుగానుండరు. విశేషించిదుఃఖితులకొరకు వారిప్రేమవాహిని ప్రవహింపసాగును. భక్తులనగా మనుష్య సమూహమునకు దూరముగా

వెళ్లియరణ్యములోనో, పర్వతకందరములలోనో, నివసించు వారని నాయభిప్రాయముగాదు. కానియెవఁడు తనచింతను విడిచిపెట్టి భగవన్మందిరముల గూర్చిన చింతగలిగియుండునో యతఁడేభక్తుఁడు. తానుకష్టములను సహించుచు, నితరులకు లాభము కలిగించుట నిజమైనభక్తుల లక్షణము. ఏప్రభుమందిరమున జ్ఞానదీపిక వెలిగిలేదో, దానియందు జ్ఞానదీపికను వెలిగించుట భక్తునికర్తవ్యము. ఏమందిరమన్నమునెడి సున్నము, సిమెంటులేనందున జీర్ణశీర్ణమగుచున్నదో దానియెడ శ్రద్ధవహించుట భక్తునకుఁదగినపని.

నిస్సందేహముగా భక్తియొక్క ముఖ్యోద్దేశ్యము స్వర్గము, మోక్షము పొందుటయై యున్నదని తలంపఁబడుచున్నది. సకాములైనభక్తులు సాంసారిక సుఖముల వ్యాపారము చేయుచుందురు. కాని నిజమైనభక్తుఁడీ మూఁడింటికిని పైకిఁజనుచున్నాఁడు. అతఁడీ ప్రపంచరాజ్యమును కోరకుండుటేకాక స్వర్గేచ్ఛయును బాధింపదు. అతఁడు ముక్తికొరకును వ్యసనపడఁడు. వాఁడానంద కందళిత హృదయారవిందుఁడై యిట్లు చైస్స్వరముతో నఱచుచునుండును.

> నత్వాఽహంకామయే రాజ్యంనసుఖం నఽపునర్భవం
> ప్రాణినాం దుఃఖతప్తానాం కామయే దుఃఖనాశనమ్॥

"నేనురాజ్యమునుకోరను, నాకుస్వర్గమైననుగాని, మోక్షమైననుగాని యక్కఱలేదు. కానిపరమేశ్వరా! నాకు సంసార

దుఃఖ సంతప్తులగు జనులకష్ట క్లేశములను తొలగించు శక్తిని నీవొసంగుదువుగాత మని కోరుచున్నాను."

ఈ యిచ్ఛయే యతనిని వ్యాకులపఱచును. ఈ విచారములోనే యతఁడు రాత్రియును బవలును నుండును-

అపనీపికర్‌ న కుఛ్ కరే౯ ప్రభు సేవ కేదాస్
మోయీ సంగీ ఖుద్‌రహేఔర్ సబ్ కా నిపయేలిబాస్॥

"క॥ పరమేశుని ప్రియభక్తులు,
పరహిత తత్పరతనుం(ద్రు స్వసుఖముగనక౯
పరవస్త్రములనుగుట్టుచు
బరువడినగ్నతను మూదిబరగినకరణి౯."

భక్తునిహృదయములోఁ దనదనియు పరులదనియు భావముండదు. తనయొక్కయు నితరులయొక్కయు శరీరములను భగవన్మందిరములేయని భావించినప్పుడు నతఁడితరుల దుఃఖములను, క్లేశములను, కష్టములను తనవనియే భావించుచు తనశక్తికొలఁది వానినిదూరముసేయ యత్నించును. ఈ విషయములన్నింటిని మించియతఁడెప్పుడును నభిమానము గలిగియుండుటేగాక దినదినము నమ్రుఁడగుచు నుండును.

భగవంతుఁడిట్టి భక్తులను తనదర్శనమునుండి వంచితులనుగానుంచఁడు. అతఁడిట్టివారియందు విశేషించి కృపగలిగి యుండును. ఈ కొలఁదిగుణములను ధరించియే మనుష్యుడు పరమాత్మని జూడఁగలుగును.

---

# నాశత్రువు - నామిత్రము.

ఓమనసా! నీవునామిత్రమవు, శత్రువ్వునై యున్నావు నీవేయేయాటల నాడించితివి? ఎటువంటి యెటువంటి నాటకములు నటింపజేసితివి? ఎక్కడెక్కడకు తీసికొనితిరుగుచువచ్చినావు? ఎప్పటినుండి నాముక్కునకు త్రాడువేసిత్రిప్పుచున్నావు. — ఎన్నిజన్మములు గడిచినవి? ఎన్నియుగములు మారినవి ఎన్ని పర్యాయములు సృష్టిచేయఁబడి లయింపఁబడినది? ఎప్పటినుండి నన్ను తీసుకొని భ్రమణముచేయుచున్నావు? సరె, ఇదియెంతవరకో చెప్పుమా! ఇంకను ముందెన్నియుగములు, యెన్నిసృష్టులు, యెన్నిప్రళయములును మహాప్రళయములును నీవునామీఁదపై నెక్కికూర్చుండి యుందువు? ఇప్పటికే యెక్కువైనది. ఇఁక చాలింపుము. అలసిపోయినాను. నీయీయాత్రతోడను నీయాటలతోను, వినోదములతోను, కొంచెముదయతో జూడుము. నాశిథిలమైన శరీరమును జూడుము. నావంగిపోయిన వీపును వీక్షింపుము. నాయలసి సొలసి పోయిన కన్నులను నిదానించి చూడుము

* నా తెల్లబడిన వెంట్రుకలనుగాంచుము. ఎన్నియోతడవలు నెన్నియోజన్మములందును నిట్టియాచనములను జేసియున్నాను. కానినీవు ఱాయితోఁ జేయబడితివో లేక లోహ

---

* దిల్ సియాహా హై బాల్ సబ్ ఆప్నే హైఁ సఫేద్
ఘర్ కే అందర్ హై అంధేరా బాహర్ చాంద్నీ

క॥ మనమున నీలిమ వెంట్రుక
లనువృద్ధత తెల్లబడియె లోకముకనగా

ముతోనో? నీవు నా విన్నపము నెద్దానిని వినలేదు. నీవు మాటి మాటికి నన్నొక్కడినుండి యొక్కడికో యీడ్చుకొని పోవుచున్నావు. నా యంగము లొక్కొక్కటిగా శీర్ణమై పోవుచున్నవి. నాశరీర మనేక తడవలు క్షుణ్ణము చేయబడినది — ఒకసారి విషయవాసనల వాడియైన ముండ్ల పొదలలోఁ జిక్కించుచు అప్పుడొక్కొక్క నాళమునుండి రక్తము ప్రవహింపఁదొడఁగును. నేను గొట్టుకొనుచుండును. నీవు నా కొట్టుకొనుట జూచి పకపక నవ్వుదువు. ఓ నీ నిర్దయీ! మఱొకసారి క్రోధమనెడు ప్రజ్వలితమైన నిప్పులకుప్పయందు నన్ను పడవైతువు. నాశరీరము యొక్క ప్రతిరోమమును కంపాయమానమై పోవుచుండును. సమస్తమును దహించుకొని పోవుచుండును. నేత్రములెఱ్ఱనై నిప్పుకణములట్లు ప్రకాశించును. శరీరమంతయును మండిపోఁదొడఁగును. నీవీ వేడుకనుజూచి మిన్నకుందువు. నీవు నా సర్వస్వమును నపహరించితివి. నా దేహ రాజ్యమున విప్లవము గలిగించినావు. కన్నులు, చేతులు, కాళ్లు, మఱి యేయితర అవయవములును వశములో లేవు. నేను రాజుగానున్న దేహరాజ్యము సంపూర్ణముగా విద్రోహిసంకులమై పోయినది. నా ఆజ్ఞలేకయే యిది యొకప్పుడు జ్వరమును నా రాజధానిలోనికిఁ గొని తెచ్చుచున్నది. ఇంకొకతడవ వేఱొకదిశనుండి వేరొండు రోగము తోడ్కొని వచ్చుచున్నది. నేను కోరునదొక్కటి. ఇది యొన

తనయింటిలోన జీఁకటి
యును బయటను జంద్రికట్లు నొప్పుచునుండఁగా,

రించునదొకటి- ఈ విధముగానే మనసా! నీవు నాయానంద కేంద్రమునందును కల్లోలమును గల్పించినావు. ఓమద్యంత్ర రచనాధురంధరీ! నాసకలమును నీవుపంచిపెట్టితివి. ఇప్పుడు నేను రాజునుగాను, ధనవంతుఁడను గాను, ఏసంపదయును నాయొద్ద లేదు. సర్వమును నీవు దొంగిలించితివి. ఇఁక నీవీచెడిపోయిన నన్ను విడిచిపెట్టుము. నాయీదయనీయమగు నవస్థయందును నొకకాలును ముందిడఁగల బలము లేని సమయమందును, కొరడాదెబ్బపైన కొరడాదెబ్బ వేయుచున్నావు. నావేదనమును నాబాధను, నాయఱపును, హాహాకారమును జూచి నీకేమాత్రమును విచారము కలుగదుగదా! చాలును ఇప్పటికే యెక్కువైనది. ఇప్పుడు సహనశక్తి లోపించినది. నేనిప్పుడు నీచెఱనుండి విముక్తి బొందుచున్నాను — కాని ఓహో! ఇది యేమి? నీవుతిరిగి నన్ను తీసుకొని వెళ్లుచున్నావు. ఎక్కడ పడవైచెదవు నన్నిప్పుడు?

**ఆకాశవాణి:**

ఇది యేమాత్రమును వినదు. ఇది నిన్ను సర్వనాశనము గావించును. తప్పుకొనదలచిన నొక్కటే యుపాయముగలదు. అదియేమన నీవుదానిమీఁద నెక్కుము. దీనికి ముక్కుత్రాడు వేసి దృఢముగా బట్టుకొనియుండుము. ఇఁక నీకు శత్రువైన యీమనస్సే నీకుమిత్రమగునో కాదో చూడుము. దీని మాట నేమాత్రమును సరకుగొనకుము. ఇదిపులుపుతినఁగోరిన తీపినితినబెట్టుము. ఇదెతీపిని దినగోరిన చప్పచనెమును బెట్టుము. ఇది విహరింపగోరిన దీనిని గదిలో మూసియుంచుము.

ఇది గదిలోఁ గూర్చుండదలఁచిన దీనిని దీర్ఘమగు సంచారము నకుఁ గొనిపొమ్ము.

మన్ లోభీ మన్ లాలచ్ మన్ చంచల్ మన్ చోర్.
మన్ కే మతి చలియే నహీఁ పలక్ పలక్ మన్ ఔర్.

"ఆ.వె. "మనసులోభి, దొంగతనముగలట్టిది
చంచలమును లాలసంబుగలది
తెప్పపాటులోనఁ దప్పుమార్గముచేర్చు
గానగూడ రాదు దీనినరుఁడు"

పరివర్తనము:

ఓ నాప్రియమైనమనస్సా! నీవునా మిత్రమవైనావు కావు! నీవెంత మంచితనముగలదానవు. ఎంత ఆజ్ఞాపరిపాలనము చేయునట్టిదానవు! ఎంతమేలుచేయుదానవు! నా చెడిపోవుచున్న పనులనెన్నింటినో నీవు బాగుచేసితివి. నాయొక్క ప్రతికార్యమును నీవెంతో శీఘ్రముగాఁ జేయుచున్నావు. తిరిగియిప్పుడు పనులనుముగించి యెంతఆసక్తితోడ మరల ఓంకారజపమునందు నిలిచియున్నావు. ఆనాటిమాట నీకు జ్ఞాపకమున్నదా? నేను నీతో "నేఁడు భగవంతునియొద్దకు నన్నుతీసుకొని పొమ్మంటిని. నీవప్పుడు "నేనక్కడకుబోవఁజాలను. కాని భగవంతునిహార్మ్యద్వారమునొద్దకు మాత్రము తీసుకొనిపోఁగలను. ద్వారమునుశబ్దముచేసిలోనికివెళ్ళునాజ్ఞయు నిప్పించగలను, నేనులోనికి వెళ్లుటకు మాత్రము వీలుపడదు" అనిపలికితివి. అంతట నేనునీతో "సరే, అటులనే కానిమ్మంటిని. ఓమంచిమనస్సా

నీవు వెంటనే నన్ను మోసికొనిపోయి యచ్చటం జేర్చితివి. ఆయాత్రి యెంతమనోహరమైనది! ఎంతమంచిదృశ్యములు దారిలోవచ్చియుండెను! ఎంతయాకర్షణీయమైన వాద్యము వినవచ్చుచుండెను! ఆవాద్యమొకనిపుణుండు వేణువు నూదినట్లుండెను గదా! అకస్మాత్తుగా నీవొక రాజమార్గమునకు వెళ్లితివి. అచ్చటనిశ్శబ్దముగానుండెను. సర్వమును నిశ్చేష్టమైయుండినది. నిశ్శబ్దము! పూర్తిగానిశ్శబ్దము!! వాయువాడకుండెను. ప్రాణమపానమునందుగలిసి తిన్నతిన్నగాగాక యతితీవ్రముగాకాని పరిపూర్ణశాంతముగానడచుచుండెను. ఆసమయమున నొక్కసారి వేలాదిగా సూర్యులును, చంద్రులును నేకకాలమున ప్రకాశించిరి. ఆప్రకాశమింతంతయని యుపమింపరాదు. తత్క్షణమే యొకయత్యంత సుందర, మనోహర వివిధవర్ణ విచిత్రమైయొప్పు బహిర్ద్వారము తీయఁబడియుండెను. అది తెరువగనే నీవెందులకుఁ బోయితివో తెలియదు. ఇఁక నీవిషయమేమి? అప్పుడు నాకునాస్థితియే తెలియకుండెను. సూర్యులులేరు. చంద్రులులేరు. మరేమియునులేవు. ద్వారము తెఱచినపిదపఁ జూచినదానిని వర్ణించుటకు వాక్కు తనబలమునంతయు నుపయోగించియు నొకశబ్దము కాదుగదా ఒకయక్షరమైనను తెలుపఁజాలదు. కన్నులేచూచినవి. కాని యవియాకన్నులుగావు. అవివేఱుగానుండెను. నా మిత్రమా! మఱల నొకపర్యాయము తీసికొనిపొమ్ము. నేను నీచేత మరియేపనియును జేయించుకొనను. ఈ ముఖ్యమగుపని కొరకే నిన్ను నియమించియున్నాను. నీవునాయితరపనులను జేసినను, చేయకున్నను సరియే కాని యీపనిని చేయ నిన్ను బాధిం

నీవు వెంటనే నన్ను మోసికొనిపోయి యచ్చటఁ జేర్చితివి. ఆయాత్ర యెంతమనోహరమైనది! ఎంతమంచిదృశ్యములు దారిలో వచ్చియుండెను? ఎంతయాకర్ణనీయమైన వాద్యము వినవచ్చుచుండెను? ఆవాద్యమొక నిపుణుఁడు వేణువు నూదినట్లుండెను గదా! ఆకస్మికముగా నీవొక రాజమార్గమునకు వెళ్లితివి. అచ్చట నిశ్శబ్దముగానుండెను. సర్వమును నిశ్చేష్టమైయుండినది. నిశ్శబ్దము! హఠాత్తుగా నిశ్శబ్దము!! వాయువాడకుండెను. ప్రాణమపానమునందు గలిసి తినతిన్నగాగాక యతితీవ్రముగా కాని పరిపూర్ణశాంతముగా నడచుచుండెను. ఆసమయముననొకేసారి వేలాదిగా సూర్యులును, చంద్రులును నేక కాలమున ప్రకాశించిరి. ఆప్రకాశమింతంతయని యుపమింపరాదు. తత్క్షణమే యొక యత్యంత సుందర, మనోహర వివిధవర్ణ విచిత్రమైయొప్పు బహిర్ద్వారము తీయఁబడియుండెను. అది తెరువగనే నీవెందులకుఁ బోయితివో తెలియదు. ఇఁక నీవిషయమేమి? అప్పుడు నాకు నాస్థితియే తెలియకుండెను. సూర్యులులేరు. చంద్రులులేరు. మరేమియునులేవు. ద్వారము తెఱచినపిదపఁ జూచినదానిని వర్ణించుటకు వాక్కు తనబలమునంతయు నుపయోగించియు నొకశబ్దము కాదుగదా ఒకయక్షరమైనను తెలుపఁజాలదు. కన్నులేచూచినవి. కాని యవియొకన్నులుగావు. అవి వేఱుగానుండెను. నా మిత్రమా! మఱల నొకపర్యాయము తీసికొనిపొమ్ము. నేను నీచేత మరియేపనియును జేయించుకొనను. ఈ ముఖ్యమగుపని కొరకే నిన్ను నియమించియున్నాను. నీవు నాయితరపనులను జేసినను, జేయకున్ననుసరియె కాని యీపనిని జేయ నిన్ను బాధిం

చుచున్నాను- నీవు నన్ను వైకుంఠమునకుఁ దీసికొని పోఁబనిలే దు. నీవు నన్ను భక్తుల దేశమునకును గొనివెళ్ళవలదు- నీవు న న్నే స్వర్గమున్ఁ(త్రిప్పిజూప నవసరములేదు- నన్ను (ప్రియతముఁడగు భగవంతుని సేవించి సంతోషముతో నుండిన స్థానమునకు మోసికొనిపొమ్ము.

కహాఁ రూఁ బైకుంఠ్ లైకలన్ ఇృచ్ఛకీ ఘాఁహా
రహీమణ ఢాంక్ సుహావనె జహాఁ ప్రీతం గలబాఁహా॥

ఓ నామనసా! నీవిపుడెంతమంచివాన వైతివి! నాప్రతి శుభ కామమును పూర్తి చేయుటకు నీవుసంపూర్ణముగా యత్నిం చుచున్నావు. నీకు పూర్వపు అపరిశుభ్రత యిప్పుడిష్టముగా నుండదు. ఆపూర్వపు పోకిరితనమున నీవు పోఁజాలకున్నావు ఎందుకునాయనా! ఆపూర్వపు గాథలను జ్ఞాపకము తెచ్చుకొనిన నీకవశ్యముగా సిగ్గుగలుగును. అప్పుడానందముగా నుండెనా? ఇప్పుడా? చెప్పుము. ఇతరుల గొంతుకోయుటయందు సంతో షము లభించుచుండెనా లేక యిప్పుడొకరి ప్రాణమును రక్షిం చుటయందధిక ప్రసన్నత చేకూరుచున్నదా? నీయప్పటిజీవితము ను, యిప్పటిజీవితమును జూచుకొనుము. నీయందిట్టి పరివర్త నము గలిగెకదాయని నీవు భగవంతునకు ధన్యవాదము లర్పింపుము.

వహా లేయహామణ కాగ్ ఘా, కర్తాజీవన్ ఘాత్
అబ్ తో మణ హంసాభయా మోతీ మణ చుణ ఖాత్॥

ఆ॥గీ॥ కాకియట్లుమనసు కాలుష్యయుక్తమై
ప్రాణిహింసనేయ వలచియుండె
హంసరీతిమాక్తి కావళిఁగోరుచు
శాంతమయ్యెనిపుడు సాధ్యఫక్కి.

# భక్తుని మొఱ.

సా పరానురక్తిరీశ్వరే *

ఈశ్వరునియందుగల పరమానురాగమే భక్తి యన బడుచున్నది.

ఓ ప్రియతమా! బలమును శక్తియు లేదు. రోగయుక్తమైన శరీరము నీపూజకుగావలసిన సామగ్రిని సమకూర్చుటయందు సమర్థత లేనిదైయున్నది. నీయీమందిరమును బాగుచేయుటకును నాకిప్పుడు సాహసము లేదు. జపబలముకాని, తపోబలముకాని, ధనబలముకాని లేక దేనియాధారమున నీసమీపమునకు రాఁగలను? ఋషీశ్వరులు, "నాయమాత్మా బలహీనేన లభ్యః" అనగా బలహీనులగువారు ఆత్మనుపొందఁజాలరు. అని తెలిపియున్నారు. అయితే యికనేను యక్కడనే పడియుండవలెనా? ఈసుడిగుండములోనే మునుగుచు తేలుచునుండవలెనా? మంత్రములు రావు, యంత్రములంతకును తెలియవు. నిన్నెట్లు స్తుతింపవలెనో యదినాకు తోఁచుటయే లేదు. నిన్నేశబ్దములతోఁ బిలువవలెను? ఎట్టిశబ్దములును నాకు రావు. అట్టియెడ నీగుణములనెట్లువర్ణింపఁగలను? నిన్నెట్లాహ్వానింతును? ఇవి యేమి

* శాండిల్య ఋషిశ్రీభక్తిదర్శనము. ౧. ౧. ౨.

యును నాకు తెలియవు. ప్రాణాపాన సంయోగము వేయుట వలన నీవు లభింపగలవని యందురు. నాకీవిధానమెట్టిదో యెఱుక లేదు. ఎట్లు ధ్యానింపవలెనో యదియును నాకు తెలియదు. ఎట్టిముద్రతోను నాకు పరిచయము లేదు. హఠయోగముగాని, ధ్యానయోగముగాని, కర్మయోగముగాని, జ్ఞానయోగముగాని, నాకెఱుక లేదు. దేనియందును నాకుఁ గుశలత్వము కలుగదయ్యెను- ఏవిధానమున ప్రియతముఁడవగు నిన్ను గాంచగలను? ఏడువను సయితము రాదు- ఒకవేళ నేడ్చినను యేమి కేవలమొకటి— నిశ్చయరూపముగా నొకమాటయే నేనెఱుఁగుదును- అదేమన నీవు నాతల్లివి, అందును క్లేశములను హరించునట్టి తల్లివి-

గీ: సంయమంబు వ్రతము సాధన దానంబు
తీర్థయాత్ర లేమి తెలియదింత
మాతృభావమున నమాయకుఁడగు బాలు
విధమునున్నవాఁడ విశ్వమూర్తి ॥

— ౨ —

తల్లీ! నీ * కృపకు పాత్రుఁడు గాకున్నంతవరకెట్టి వా

---

* నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.
కఠోపనిషత్ అ ౧.౨. ౨౩ ముండక 3: .౨. 3,

"ఈ ఆత్మ వేదముచేతను తెలివిచేతను బహుశ్రుతముచేతను తెలిసికొనఁబడజాలదు. ఇది స్వయముగా నెవరిని యెన్నుకొనునో యతఁడే దానిని గాంచగలఁడు. అతని కొరకీయాత్మ తనస్వరూపమును ప్రకాశపరచును.

కని బుద్ధియుపయోగపడదు- వేదపాఠమునయితము లాభదా యకముకాదనియును వినియున్నాను- నీవుస్వయముగా నెవరిని యెన్నుకొందువో వారికే నిన్నుదర్శించుయోగ్యత లభించు చున్నది-

అయినచో నాపైన కృపాకటాక్ష వీక్షణముల నెప్పు డు ప్రసరింపఁగలవు? నే నెంత వర కు నీద్వారముపై నిలిచి "అమ్మా! అమ్మా!" యని యఱచుచుండవలెను. తల్లీ నీ మాటలలోనే నీ విట్లుపలికి యున్నావు.

నబుతే క్రాంతస్య సఖాయ-ఋ-౪_33-౧౧

పూర్ణముగాయత్నించి మనుష్యుఁడెంతదనుక నలసిపో వఁడో యంతవరకు నీశ్వరునిమైత్రి లభింపదు. కాని నేనిప్పుడ లసిపోలేదు. ఎంతయోదూరమునుండి నడచివచ్చియున్నాను- ఆనడకయును, నీద్భుకొనుచునే. తల్లీ! నీచరణములందు పడియు న్నాను. అంగములన్నియు ముక్కలైయున్నవి. నానీరునిండిన కన్నులు, మాలిన్యమును గూడినముఖము, నావణఁకుచున్న భుజములు, మాతా! నీహృదయమునకు బాధగలిగించుటలే దా! తల్లి తనపిల్లవానిని దుఃఖతునిగాఁజూచి యొక్క క్షణము మాత్రముఁనోర్వజాలదు. నారుపనులను విడిచిపెట్టియైనను వాని నెత్తుకొని ముద్దాడును. పవిత్రమగుస్తనములనుండి యమృత మును ద్రావించును. తల్లీ! నన్ను నీయొడిలోనికిఁ దీసికొనుము. ఈహీనస్థితిలోనున్న నన్నెత్తికొనుము. అమృతమును గ్రోల నిమ్ము. ఆపక్షుడింకను ప్రతీక్ష చేయవలెను.

గీ॥ మాత! పరమేశ్వరీ! నీకుమారు నన్ను
నవగుణంబుల సైచి బ్రోవుగదమ్మ
సుతుఁడు దోషంబుల నొనర్చుచోను తల్లి
మనసుకరుగదె వానిశ్రమంబుగనిన

— 3 —

పాపము మాటయెంత బరువైపోయినది? ఇప్పుడెత్తుటకును శక్తి లేదు. నీవుపాపుల పాపమును దూరముచేయుదువనియు, పతితులనుద్ధరింతువనియు,అధముల లేవనెత్తుదువనియు నెందఱోభక్తులు తెలియజెప్పియున్నారు- ఏమీ? యీ మాటలన్నియు నిక్కే వచింపఁబడుచుండునా? అట్లుగాకున్న నాకంటెను మించినదయనీయుఁడెవ్వడుండగలడు? పతితపావనా! నావంటిపతితునినుద్ధరించిన నీవు చాలాగొప్ప పతితోద్ధారకుఁడవని చెప్పఁగలవు, ఒకవేళ నీవాకిటినుండి మంచియోగీశ్వరులకే భిక్షలభించి, కేవలముజ్ఞానులే తృప్తులగుదురేని, యింక నా మొఱవ్యర్థమైనదేనా? సరె చెప్పుము, ఓసత్యశీల మహాత్మా! ఆరోగ్యముగల పురుషుఁడైనను స్త్రీయైనను వైద్యునియొద్దకు గాని, చికిత్సాలయములకుగాని పోవునవసరమేమిగలదు? ధనవంతుఁడు భిక్షమెత్తుకొనుటకు ధనవంతుని మేడలోనికి యేల పోవును? వస్త్రములు బాగుగానున్న వానికి దర్జీవానియిల్లుచూచు పనియేమి? ఎవనియుడుపులు ముండ్లపొదలోఁ జినిగిచినిగిపోవునోయతఁడే మేరెవానిని వెదకుచు దిరుగుచుండును. మాసినమనెడు వస్త్రము మాసిపోయిన యతఁడే శుభ్రముచేయు నివి

త్తము మడివేలు నాశ్రయించును. ఓరజకరత్నమా! నేనుమాసి పోయిన బట్టలను తీసుకొని నీదరిని జేరియున్నాను.

"చాకలి గుడ్డల నుదుకని, మావని"

నామనస్సు రోగగ్రస్తమై యున్నది. ఓపరమేశ్వరా! దీనికిచికిత్సచేయుము. నాయార్తనాదమును వినుము. నాబాధను హరింపుము. నీవునుగుణాగుణములను జూచియే భిక్షపెట్టవలసి యున్ననిన్ను "సమదర్శనుఁడ"ని వదించుటకుముందు నూరు పర్యాయములు యోచింపవలసియుండును. సూరదాసు మీ యిట్టిగుణములను గాంచియే యేకతార (తాంబుర్రా) చేతిలోనికిఁ దీసికొని యేడ్చుచు నేడ్చుచునిట్లు మొఱపెట్టుకొని యున్నాడు.

అవగుణ్ చిత్తునధరో ప్రభుమేరే,
అవగుణ్ చిత్తునధరో
సమదర్శీ హైనామ్ తిహారో చాహోతో పార్ కరో,
ఇక్ నదియా ఇక్ నాల్ కహావే మైలోహీనీర్ భరో
జబ్ మిల్ కర్ ఇక్ వర్ణభయో సురసరీ నామ్ పరో,
ఇక్ లోహా పూజా మేం రాఖయో ఇక్ ఘర్ బధిక్ పరో
పారస్ గుణ్ అవగుణ్ నహిఁ చితవే కంచన్ కరత్ ఖరో
ప్రభుజీ మే రేఅవగుణ్ చిత్తునధరో.

మీరు, జోకు, కొలఁతతోడనే పనిచేయఁదలఁచిన నీక మాకు భిక్షదొరకఁగల యితర గృహమును జూపింపుము. కాని—

క॥ నీయిల్లును విడనాడియు,
నేయింటికినేగవలయుఁ? నిఁకనటుగాదా

నీయిల్లును బోలినగృహా
మేయెడజూపంగవలయు నీవేమాకుఁ—

విడిచిపెట్టము మీావాకిలిని. ఇప్పుడీవాకిటనే మాప్రాణావసానము కాఁగలదు. ఎంతవరకు నీవువినకుందువు? మాకు భజించుటరాదు- గుణవర్ణవిధియు రాకున్న నేమి? మేమునిన్ను పిలుచుచునే యుండగలము. నీనామమునే ఓను నీనామమునే మేమింకెద్దియునెఱుఁగము- కేవలమునీనామమును మాత్రమే.

గీ॥ ఓమ్‌సంస్మరణంబును నోపినట్లు
నిత్యమేమరకనుభక్తినియతితోడ
దీనవత్సలుఁడనియు నహీనుఁడనియు
సర్వశక్తియుతుండని పలుపవలయు.

— ౪ —

మాలోపములు దూరము కానంతవరకు మాకుభిక్ష మీావాకిటలభింపక యే యున్న యెడల నిఁకరండు. ఈపనినే ముందుగాఁజేయుఁడు. త్రుటులనుతొలగించువాఁడవు నీవేకదా! ఎప్పుడేని దోషములతిశయముగాఁజేరిన నన్ను పిలువుఁడనిమీారే వేదములోఁ దెలిపియున్నారు. కావున నిన్ను బిలుచుచున్నాడను. చూడుఁడు మీాపవిత్రవాణిలోనే మామొఱను వినిపించుచున్నాము.

ఓమ్ యదిదివా యదినక్తమేనాగ్ంసి చకృమావయమ్
వాయుర్మాతస్మాదేనసో విశ్వాన్ముఞ్చత్వగ్ంహసః.

యజు ౨౦-౧౫

ఏయవి పగటివేళను, ఏయవిరాత్రిపూటను, తెలియని అపరాధములను మేముచేయుచున్నామో ఆసమగ్రమైన అపరాధములనుండియు, దుష్టవ్యసనములనుండియును మమ్ము వాయువునువలె దూరముగానుంచుము.

ఓమ్ యదిజాగ్రద్యదిస్వప్న ఏనాంసిచకృమావయమ్,
సూర్యోమాతస్మాదేనసో విశ్వాన్ముఞ్చత్వంహసః॥ ౧౬

జాగ్రదవస్థయందుగాని, స్వప్నావస్థయందుగాని, నేను పాపములోఁ జిక్కియుండి, పాపమును జేసియున్నయెడల నా సమగ్రమైనపాపమునుండియు, ప్రమాదమునుండియు, సూర్యునివలె దూరముగానుంచుము-

ఓమ్, యద్గ్రామే యదరణ్యే యత్సభాయాం యదింద్రియే
యచ్ఛూద్రేయదర్యే యదేనశ్చకృమావయమ్ య
దేకస్యాధిధర్మణి తస్యావయజనమసి ॥౧౭॥

మేముగ్రామములోను, అరణ్యములందును, సభలయందును, శూద్రులందును, వైశ్యులందును, ఏనికి పైనధర్మములందును, అటులనేయేయితరఅపరాధములనుజేయుచున్నామో లేక చేయనున్నామో వానియన్నిటివిముక్తికి సాధనమీవా డైయున్నావు.

ఓమ్, యన్మేఛిద్రంచక్షుషో హృదయస్య మనసోవాతి,
తృణ్ణం బృహస్పతిర్మే తద్దధాతు,
శన్నోభవతు భువనస్యయస్పతిః ॥యజు. ౩౬-౨॥

నానేత్రములయొక్కయు, నంతఃకరణము యొక్కయు, గలన్యూనతను, మఱియుమనస్సునందు వ్యాకులతలవలనగలిగిన

లోపములను బృహస్పతియగు పరమేశ్వరుఁడు సంపూర్ణ మొన రించునుగాత! సమస్త ప్రపంచమునకు రక్షకుఁడైనవాడు మాకు కల్యాణకారియగునుగాత!!

చెప్పుము, ఇప్పుడైనను నా మొఱనువినెదవా? లేదా? నీ వేదములనే, నీవు గైకొనిన కర్తవ్యములనే నేను నీజ్ఞాపక మునకు దెచ్చుచున్నాను. మేము పాపములనుండిసర్వదా, సర్వధా వేఱుగానుండ గోరుచున్నాము. కాని యట్లైనను పాపము జరుగుచునేయుండును. ఇందుచేతనీకుసంబంధించినపాపము లేవి జరిగినవో, లేక, జరుగుచున్నవో వానినుండి మమ్ము వేఱుగా నుంచుము. మామనస్సులోనే లోపములుగలవో వానినిసవరించ నీవేసమర్థుఁడవు. వానినిసవరింపుము. త్రుటులను తొలగింపుము. నిన్నేజూచుచునుండగలిగిన దృష్టినొకసారి యొసంగుము.

# స్త్రీలు - భక్తి

ఏవిధమైన, కోమల స్వచ్ఛహృదయము భక్తికి వశమై యున్నదో యట్టిది విశేషించి స్త్రీలకు భగవంతుఁడు దయచేసి యున్నాఁడు. ఇందువలన భక్తియందందఱికంటెను స్త్రీల కధికారము నొందు. "కార్డినల్ న్యూమెన్" "భగవంతుని గలిసికొన నిచ్ఛగించిన స్త్రీవి కమ్మని" అనియు వ్రాసియున్నాఁడు. దీని భావము పురుషుఁ డేరీతిగానైన వాస్తవికరూపమున నాఁడుది గావలెనని కాదు. కాని భావమేమన స్త్రీహృదయ మెట్లుగలదో యటులనే మనహృదయమును గావించుకొనవలయును. స్త్రీల యొక్క హృదయమునందు భక్తిపుష్పము శీఘ్రముగా వికసించి వృద్ధిబొందును. స్త్రీలయొక్క హృదయ మొకరిని దుఃఖము నందును, గష్టములందును జిక్కియుండుటను జూచి ద్రవించును. స్త్రీలయందు సేవాంశము మిక్కిలిగా నుండును. వారియందు శ్రద్ధావిశ్వాసములును, పరాకాష్ఠయును, మేరవరకు జేరు చున్నవి. వారిస్వరము మాధుర్యముగాను, వాక్కు మృదువుగానుండును. ఈసమస్త * గుణములయందును భక్తియొక్క

---

* ఈ వివరించిన సుగుణములు సాధ్వీమణులకే చెల్లును గాని దుశ్చరిత్రలకు గాదని తెలియఁదగును.

అంకురము బాగుగావృద్ధిబొంది ఫలపుష్పముల నీనఁగలదు. కేనోపనిషత్తునందొక చక్కనికథ బ్రహ్మమును గాంచువిషయములోఁ గలదు. దానివలనను స్త్రీయే యాత్మకు బ్రహ్మమును గూర్చి తెలిపెనని తెలియవచ్చుచున్నది. - కథలో నింకను యితర రహస్యములును విస్తరింపబడియున్నవి. కావున దానిని విన నేవలయును.

అగ్ని, వాయువు, ఆత్మగాగల దేవతల గౌరవమును వృద్ధిచేయుటకొరకు పరబ్రహ్మము వారికి విజయమును గలిగించెను. ఈవిజయమునం జేసి యాదేవతలు, ప్రపంచమునందలి శక్తియంతయును తమదేయని యభిమానగ్రస్తులై పోయిరి. ఇది తెలిసికొని బ్రహ్మ యక్షుని రూపమున ప్రత్యక్షమై వారి ముందునకువచ్చెను. దేవత లీవచ్చినదెవరో తెలిసికొనుటకు నగ్ని దేవుని ముందునకు బంపిరి. ఆయక్షుఁ డగ్ని దేవునిజూచి, నీ వెవరనియు, నీశక్తి యెట్టిదనియు నడిగెను-అందులకగ్ని, "నేను జాతదేవుఁడనఁగు నగ్నిని, ప్రపంచమునందలి వస్తువుల నన్నిటిని గాల్పఁగలనని పలికెను. దానికి యక్షుఁడొక గడ్డిపుడకనిచ్చి కాల్చుమని చెప్పెను. అగ్నితనపూర్ణమగుబలముచేత ముందుకు జనెనుకాని, యాపుడకను గాల్పఁజాలకపోయెను. అంతట నవ ఫలుడై యగ్ని తిరిగిపోయి, యాయక్షుడెవరో నేనెఱుఁగనని దేవతలకుఁ జెప్పెను. అప్పుడు వాయువునుముందుకు వెళ్లి యా యక్షుని తెలిసికొనిరమ్మని దేవతలు మఱలబంపిరి- వాయువు పరుగెత్తుకొనిపోయి, యక్షునితో "నేను వాయువును, నను

స్త్రము నెగుఱఁగొట్టఁగలనని పలికెను. యక్షుఁ డతనిముందఱ నొకగడ్డిపఱక నుంచి దానిని యెగుఱఁగొట్టుమని వచించెను. వాయువు తనశక్తి నంతయు నుపయోగించియు, దాని నెగుఱ గొట్టఁజాలఁడయ్యెను. వాయువు నయితము మఱలిపోయి యీ యక్షుఁడెవరో నేను తెలిసికొనఁజాల కున్నానని తెలిపెను. అప్పుడింద్రుడు (ఆత్మ)యక్షుని తెలిసికొనివచ్చుటకు నియమితు డయ్యెను. ఇంద్రుఁడు ముందేగి జూచునప్పటికి యక్షుఁడదృశ్యు డయ్యెను. ఇంద్రుఁడాశ్చర్యముతోనే నిలిచియుండగా, నంతట నాకాశమున మిక్కిలి శోభాయుక్తయై, స్వర్ణ భూషాలంకృతయై యున్న 'ఉమా' నామము గల యువతి యతని యెదుటకు వచ్చెను. ఆమెతో నింద్రుఁడా యక్షుడెవడని యడిగెను. ఉమా దేవి, ఆయక్షుఁడు బ్రహ్మయనియు, అతనిమహిమచేతనే దేవత లందఱును మహిమావంతులై యున్నారనియు ప్రత్యుత్తర మిచ్చెను.

ఈకథయందొక స్త్రీయే బ్రహ్మను తెలియజెప్పినది. ఆమాటయునిక్కువము. శివునిజాడనుమాదేవితప్ప నెవరు చెప్పఁగలరు? ఈకథలోన జడదేవతలగు నగ్నివాయువుల గాని మనుష్యుని యింద్రియములుగాని, సంపూర్ణముగాఁ దెలిసికొనలేవు. వానియందు కేవలమింద్రుఁడు,అర్థాత్తు ఆత్మయే తెలిసికొనగలుగును. అదియును, 'ఉమాదేవి' అర్థాత్తు బుద్ధి సహాయముచేతనే. బుద్ధిని స్త్రీస్వరూపమున జూపించి, యిందు స్త్రీజాతికి గొప్పమహత్త్వము గలిగింపఁబడియున్నది- మఱియు

స్త్రీలును నిట్టిమహాత్త్వమున కధికారముగలవారే. వారిబుద్ధి ధర్మకార్యములందును, సూక్ష్మవిషయములను గ్రహించుట యందును, భక్తి వంటి పవిత్రక్షేత్రములందును శీఘ్రమగు గతి గలిగియుండును. కానియత్యంత శోచనీయమగు విషయమేమన దంభముగల పురుషులిట్టి పవిత్రహృదయములను దురుపయోగముచేసియున్నారు. మఱియు వారు తమ గురుత్వమును (Gurudam) నీచవాసనలకొఱకిట్టి కోమలహృదయములందంధ విశ్వాసమను నగ్నిసిరగుల్కొల్పి వారిని భస్మీపటలముచేసివైచిరి- కాబట్టి స్త్రీలను సంపూర్ణసావధానతతో నిట్టివారి నుండిరక్షింపవలెను. స్త్రీలకుపదేశము స్త్రీలనుండియే లభించిన శ్రేష్ఠముగానుండును. దయానందసరస్వతీ స్వాములవారు కలియుగముయొక్క దాంభికగురులీలలను జూచియే యిట్టిగురుత్వమునకువిరుద్ధముగా నట్టహాసముచేసియున్నారు. దానినిసర్వదా మనయెదుట నుంచుకొనవలయును. కాని దానివలన స్త్రీలు పరమేశ్వరభక్తినుండి వంచితులనుగా నుంచకుండఁదగును.

మనువిట్లు శాసించుచున్నాఁడు:—

శ్లో॥ నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణమ్
పతింశుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే. మను ౫-౧౫౫

"స్త్రీలకు వేరే యజ్ఞవ్రత ఉపాసనములులేవు. కేవలమొక పతికిసేవచేయుటచేతనే పరమపదమునుపొంది దేవతలచేత స్త్రీలు పూజింపఁబడుచుందురు."

మను భగవానుని యీయాజ్ఞ యీదినములలోని ధూర్తగురువులను జూచిన యెడల సర్వథాయుపయుక్తమై

యున్నట్లు గన్పట్టును. విషయమును నిక్కువమైనదే. స్త్రీలు భర్తనువిడనాడి పరులకు సేవ యే చేయవలసియుండి యాలంపటమునందే దవిలియున్న యెడలను, దానికంటె తనపతికి సేవచేయుచుండుటయే మేలుగదా! పతిసేవామహిమముమిక్కిలిగొప్పది. గాంధారి దేవి యేమివచించినదో చూడుఁడు.

“యోగేవశక్తిఃప్రభవేన్నరాణామ్,
పతివ్రతేనాపికులాఙ్గనానామ్”

“పురుషులకు యోగమువలనను, కులాంగనలకు (కులస్త్రీలకు) తన పతివ్రతమువలనను శక్తి లభించును.”

వాల్మీకీయ రామాయణము ౭-౧౫. యందు నిట్లు చెప్పఁబడియున్నది:—

పతిర్హి దేవతా నార్యాః, పతిర్బంధుఃపతిర్గురుః
ప్రాణైరపిప్రియం తస్మాద్భర్తుఃకార్యం విశేషతః॥

“నారికి పతియే దైవము. పతియే బంధువు. పతియే గురువు. నిత్యమును ప్రాణములకంటె ప్రియమగుపతి యొక్క ప్రియకార్యమునుచేయుటయు, దానియందే, ప్రసన్నరాలై యుండుటయు, స్త్రీలకుస్వాభావికమైన ధర్మము”

ఇదియంతయునిజము. స్త్రీలను పతివ్రతాధర్మమునందా రూఢలనుగాఁజేయుటకు నీయుపదేశముచాలును. కాని భర్తృ సేవతోఁబాటు ఆత్మదర్శనముకొరకును గొంత ప్రయత్నము చేయుట యవసరము. ఇందులకే దయానందస్వాములవారు తమ సత్యార్థప్రకాశమునందు, పురుషులకుయోగాభ్యాసమును విధించినట్లే, స్త్రీలకొరకిట్లు శాసించియున్నారు-“స్త్రీయును

నిటులే యోగాభ్యాసము చేయవలెను* — స్త్రీలయొద్దను, ఆత్మదర్శనమునకు వలయుసామగ్రి సిద్ధముగానున్నప్పుడు, వారి నీశ్వరదర్శనమునుండి వంచితలగానుంచుట తగనిపని. స్త్రీలు తాము వేఱుగా యజ్ఞముచేయవలసినపని లేదనుటయు, పురుషుఁడేయజ్ఞముచేసినను స్త్రీవెంటయుండుట యనివార్యమై యుండుటయు నిజమైనవిషయము. పతితోడఁబత్ని విరాజిల్ల నట్టియజ్ఞము సంపూర్ణముకాదు. కాని భక్తి మాత్రము యజ్ఞమునకువిపరీతముగా, స్త్రీలైనను, పురుషులైనను వేర్వేఱుగా నాలౌకికస్వర్గీయానందము ననుభవించుట కధికారులనుగా జేయునట్టి భావనము. దానిని పొందుటకు యోగ్యత యందఱకును గలదు. పురుషునకును, స్త్రీకిని బాలకునకును, బాలికకును, వృద్ధునకును, వృద్ధస్త్రీకిని, యువకునకును యువతికిని, బ్రాహ్మణునకును, ఛండాలునకును, ధనికునకును, నిర్ధనునకును, అందఱకును భగవాను మందిరములోనికి వచ్చిన వాస్తవికమగు నుద్దేశమును పూర్తిజేయు నధికారము చిక్కినప్పుడు స్త్రీయందును పురుషునియందును, నేమిగలదు? అది స్త్రీగాదు. పురుషుఁడును గాఁడు.—అది కేవల మాత్మ. చూడుఁడు. వేదభగవానుఁడీ విషయమున నెంత చక్కని వాక్యమును బలికి యున్నాఁడో!—

త్వంస్త్రీఉతవాపుమానో౽సిత్వం కుమారఉతవాకుమారీ.
త్వంజీర్ణోదండేనవఞ్చసిత్వం జాతోభవసివిశ్వతోముఖః

అథర్వ. ౧౦. ౮.

వేదము జీవాత్మనువర్ణించుచు నిట్లు వచించుచున్నది:—
"నీవు స్త్రీయును, పురుషుఁడవును. నీవుకుమారుఁడవును, కుమారివియునై యున్నావు. నీవు వృద్ధాప్యమును జెంది కఱ్ఱపట్టుకొని నడచెదవు. నీవుపుట్టినప్పుడు వేర్వేఱురూపములు గలదానవగుచున్నావు"

ఈ కేవలము బయటిస్వరూపము స్త్రీపురుషులుగా గనుపడును. లేనిచో నాత్మకెట్టిరూపమును లేదు.

స్త్రీలకొకకష్టము అవశ్యముగాఁగలదు- అదేమన శిశువుల పోషించుటయందును, గృహకృత్యములందును యెక్కువగా సమయమును వ్యయపెట్టవలసియుండి వారికినాత్మ దర్శన సాధనముకొరకు వేళకొంచెముగా దొరకును- కాని వారికీ కష్టములతోఁబాటు భగవంతుఁడు లోపములను కష్టములను దూరముచేయఁగలిగిన నితరగుణములను వారికి దయచేసియున్నాఁడు. పురుషులకు గాయత్రీజపము లేక ఓంకారజపముచేత నేలాభమొక సంవత్సరకాలములోఁ గలుగఁగలదో యదేలాభము మహిళామణులకు ఆఱేఁడు మాసములలోనే ప్రాప్తించును. ఇందువలననే సంతానపాలనపోషణమునుండియు గృహకార్యములనుండియు భీతినిజెందవలదు. అసహ్యపడరాదు. మనస్సును వికలపరచఁజనదు. ఈకార్యములను తపస్సునకొక సాధనమనియెంచి వీనిని జేయుచును భగవత్స్మరణమును, ఆత్మదర్శనమును, భక్తియును నాచరించుటకొరకు సమయమును మిగిలించుకొనవలయును. భగవద్భక్తిక్షేత్రమును సిద్ధము

చేయుటకొరకు సవ్విధియే యాచరణీయము. మొదట (ఓమ్) మఱియు గాయత్రీ మంత్రజపమునుండి యారంభింపవలెను. దానితరువాతివిధి యింతకుపూర్వము వ్రాసినయట్టులే. స్త్రీలా సనము వేసికొనుటయందొక విషయమును గమనించవలెను. వారికిరెండాసనములే యుపయుక్తములు. అవి, పద్మాసనము, అథవా సుఖాసనము. ఈరెండింటిలో నేదైననొకయాసనమును గొని (౨½) మూడున్నరగంటల * కాలము నొకేదానిపై నుండునట్లభ్యసింపవలెను. ఎక్కువకాల మొకేయాసనమున గూర్చుండినందున కాళ్లులాగును. లాగనిండు, మొద్దుబాఱి పోవును. మొద్దుబాఱిపోవనిండు. దానినిగూర్చి చింతింపకుడు. అటుపిదప శరీరమును మొద్దుబాఱిపోవును. దీనినిగూర్చియు విచారపడవలదు. సాధనమును సాగించుడు.

పతిసేవయు, గృహకార్యములును, నవశ్యముగా నాచరణీయములే. వీనినుండిదూరముగా నుండజనదు. దీనితోడ బాటుగానే పరమాత్మస్మరణమును జరుపుచుండవలెను. "సర్వ కాలము భగవంతుని స్మరించుచుండి యుద్ధమునుగూడ నేయుమ"ని శ్రీకృష్ణభగవానుఁడర్జునునకుఁజెప్పినటుల స్త్రీలు కూడ సర్వకార్యముల నొనరించుచుండవలయును.

ఒక కవి సాంసారిక జనులకుఁదమైన యొక యుపమానము నిచ్చి యీసంసారమున నెట్లువసింపవలసినదియు వర్ణించి యున్నాఁడు-అది ఇది —

---

* శ్రీమహాత్మా నారాయణస్వాముల వారి యోగదర్పణమును చూడుడు.

జ్యాంత్రియాపీహర, బసేసురతిరహేపియూంమాహిం।
తైసేనర జగ మేరహే హరికోబిసరేనాహిం॥

“ఏవిధముగ నాస్త్రీ తల్లిగారియింటనుండియు భర్త
యందు ధ్యానముగలిగియుండునో,”
“అటులేమనుష్యుఁడు జగత్తున భగవంతునిస్మరణమును
మఱవకుండవలెను.

ప్రపంచముయొక్క కార్యములన్నిఁటిని జేయుఁడు. పతిసేవయును జేయుఁడు. కాని యీశరీరమూ పరమపతిదర్శనముకొఱకు లభించినదను నుద్దేశ్యమునుమాత్రము మఱవకుఁడు.

# భగవంతునితో భక్తుని మొఱ.

---

నేడు నీకు నాయార్తనాదమును వినుపింప నున్నాను. ఓపరమేశ్వరా! దానిని వినుము. ఇది నీభక్తునియాత్మలోని ధ్వని. నీ సుఖదాయకమగు హస్తము!

క్వస్యతే రుద్ర మృడయాకుర్ హస్తో యో అస్తి భేషజో జలాషః ।
అపభర్తా రపసో దైవస్య, అభీనుమా వృషభ చక్షమీథాః ॥

ఋ. ౨.33.7

"ఓదుఃఖనాశకా! దుఃఖరోగమును హరించునట్టియు, ఆనందము నిచ్చునట్టియు, దేవసంబంధపాపములను దూరము చేయునట్టియు, నీ సుఖదాయకహస్తమెందున్నది? ఓ సుఖవర్ష ప్రదాతా! నీవు నన్నిప్పుడు (అభిచక్షమీథాః) క్షమింపుము.

ఎలుకలు కొఱుకుచున్నవి!

మూషోన శిశ్నా వ్యదంతి మాధ్యః స్తోతారం తే శతక్రతో ।
సకృత్సు నో మఘవన్నింద్ర మృడయాధా పితేవ నో భవ ॥

ఋ. ౧౦.33.3,

ఓ బహుకర్మలుగలవాడా! నీ స్తోతనై యుండియున్నను నన్ను మానసికపీడలు వివిధప్రకారములను నెలుకలు, తమల పాకులనంటియున్న నూలుగుడ్డను తినుచున్నట్లు తినుచున్నవి. ఓ ఐశ్వర్యవంతుఁడా! ఓ యింద్రా! నీవు మమ్ముల నొకసారి సుఖులనుగా జేయుము. తండ్రివలె రక్షింపుము.

హిమాలయ పర్వతను - సాగరము!

యస్యేమే హిమవంతో మహిత్వాయస్య సముద్రం రసయాసహాహుః
యస్యేమా ప్రదిశోయస్య బాహూకస్మై దేవాయహవిషావిధేమ॥

ఋ. ౧౦.౧౨౧.౪

ఎవనిమహిమను హిమాచ్ఛాదిత పర్వతములు కొని యాడుచున్నవో, మఱియు నెవ్వని మహిమమును నదులసహితముగా నీనముగానముచేయుచున్నదో, యీ సకలదిశలును నెవ్వనికి బాహువులై యున్నవో, యట్టి సుఖస్వరూపుఁడగు పరమాత్ముని నేను హవిస్సు ద్వారా పూజించుచున్నాను.

ఎప్పుడాదినములు వచ్చునోకదా!

ఉతస్వయాతన్వాసం వదేతత్ కదాన్వంతర్వరుణే భువాని।
కింమేహవ్య మహృణానోజుషేత, కదామృళీకంసుమనాఅభిఖ్యమ్॥

ఋ. ౭, ౮౬— ౨.

నేను నాయాత్మచేత పరమాత్మునితో సంవాదముచేయ గలుగునట్టిసమయ మెప్పుడు రాఁగలదోకదా! నేనెప్పుడు పరమాత్ముని యాంతరంగికుఁడనై యుండఁగలనో, ఎప్పుడతఁడు నాయుడుగరను గైకొనునో! ఎప్పుడు నేను నాప్రసన్నమైన మనస్సుతో నా సుఖదాయకుని సేవింతునోగదా!

ఆపాపమును జూపరాదా

పృచ్ఛేతదేనో వరుణదిదృక్షూపో ఏమిచికితుషోవిపృచ్ఛమ్।
సమానమిన్మే కవయశ్చిదాహురయం హతుభ్యం వరుణోహృణీతే॥

ఋ-౭-౮౬-౩

ఓ సర్వశ్రేష్ఠప్రభువగు వరుణా! నేనుజూచు నభిలాషతో నేపాపకారణమున నిందు బంధింపబడియున్నానో యట్టి పాప

మును తెలియజెప్పుమని యడుగుచున్నాను. నేను జిజ్ఞాసువును దర్శించు నభిలాషతో నీసమీపమునకు వచ్చియున్నాను- జ్ఞానులనుసయితము ననేకవిధములుగా నడుగుచున్నాను. పూజ్యులగు విద్వాంసులందఱును యీ సర్వశ్రేష్ఠ ప్రభువగు వరుణుఁడే నీయందు రుష్టుఁడైయున్నాఁడని యొకేతీరున నుడువుచున్నారు.

నీదనుక నెట్లు చేరఁగలను?

కిమాగఆ సవరుణజ్యేష్ఠంయత్ స్తోతారంజిఘాంససి సఖాయమ్।
ప్రతన్మేవోచోదూళభ స్వధావోఽవత్వానేనా నమసాతురఇయామ్॥
ఋ-మం-౭-సూ-౮౬-మం౪-

ఓవరుణా! సర్వశ్రేష్ఠ ప్రభువా! ఏయపరాధకారణమున నీయొక్క శ్రేష్ఠాతిశ్రేష్ఠ స్తుతికర్తయును, స్నేహముగల మిత్రుఁడుననగు వానికిని దండనమొసఁగ గోరుచున్నావో యట్టి యపరాధమేమి? ఓదుర్లభుఁడా! ఏ యుపాయముచేత నిష్పాపుఁడనై, భక్తిభావముతో వినీతుఁడనై, అత్యంత శీఘ్రగామినై నిన్ను చేరఁగలనో దానిని వివరింపుము.

ఓ భగవానుఁడా! నీరక్షణములోనే!

నతమంహోనదురితం కుతశ్చన నారాతయస్తితిరుర్నద్వయావినః।
విశ్వాఇదస్మాద్ధ్వరసోవిబాధసే యం సుగోపారక్షసి బ్రహ్మణస్పతే॥
ఋ, ౨. ౨౩. ౫.

అతనికేదిశనుండియు శోకముకాని, దుఃఖముగాని రాదు. అతనిని శత్రువులుగాని వంచకులుగాని భయపెట్టరు. మోహగించువారినందఱను వానికిదూరముగాఁగొనిపోవుచు వానిరక్షకుఁడవై యోప్రభువా! నీవేస్వయముగా రక్షించుచున్నావు.

అక్కడకుతీసుకొనిపొమ్మా భగవంతుఁడా!

యత్రఆనందాశ్చ మోదాశ్చముదఃప్రముదఆసతే।
కామస్యయత్రాప్తాః కామాస్తత్రమామమృతం కృధీంద్రాయేం
దోపరిస్రవ॥

ఎక్కడఆనందము, మోదముగలిగియుందురో, ఎచ్చట మనస్సుయొక్క కామములన్నియును సంపూర్ణములగుచున్నవో, యచ్చటనన్ను అమృతునిగాఁజేయుము. ఓవరాత్పరా! నన్న చ్చటకు గొనిపొమ్ము.

# ప్రతీక్షా కాలము.

అధైర్యమునుబొందు భక్తులొక విషయమును జ్ఞాపకముంచుకొనవలెను. అదేమన పరమేశ్వరదర్శనమునందొక వేళ నాలస్యమైనను దానికొరకు చాలా దిగులుజెంద పనిలేదు. ఎందఱో భక్తి లీమార్గమున నడువప్రారంభించిన కొంత కాలముతరువాతనే నిరాశజెంది పోవుచున్నారు. వారిట్లన దొడఁగుదురు—"ఏమి మేలును గలుగుటలేదు. ఏమియును లభించుట లేదు. మొదట మనస్సునిలువకుండెడిది. ఇదియే పలువిధములుగా నటించుచుండెడిది.— ఇప్పుడుమాత్రము దీని యాట కొంతవరకు తగ్గినదిగాని ముందేమార్గమును గన్పించుటలేదు." ఇట్లు పలికెడు భక్తులు భయపడ రాదు. భగవంతుఁడింకను మిమ్మీ యవస్థయందే యుంచదలచి యున్నాఁడు. ఈస్థితిలో నుండుటయే మీకు మంచిది. అదియే మేలు కలిగించును. తిరిగి యీయవస్థ వదలిపెట్టవలసినంత చెడ్డదియును గాదు. ఈకాలము ప్రతీక్షాకాలమనఁబడు చున్నది. నిస్సందేహముగా దీనియందు ధైర్యసంతోషములు చాలా అవసరము. కాని యొక సత్యమైన ప్రేమగలవాఁడు కలియికకంటె నీప్రతీక్షాకాలమునందే యధికముగా నానందమును పొందును-

గీ॥ కలియికందు వియోగదుఃఖంబుగలదు
దనరువిజ్ఞోదునందునే స్తము సుఖంబు

గానవేఁడు వియోగంబు గష్టమనుచు
కూటమిని మేలటంచును గోరువాఁడు॥

ఏమి నాయకులారా! శ్రీరాముఁడరణ్యమునకు బోవలసిన కడపటి రేయిని రాముఁడింటిలో నుండగా నయోధ్యావాసులు ప్రసన్నులై యుండిరా? లేక రాముఁడయోధ్యకు దూరముగా నరణ్యములోనుండి, యరణ్యవాసకాలము దినదినమును సమాప్తమై పోవుచుండినప్పుడు సంతోషస్వాంతులై యుండిరా? మొదటియవస్థ సంయోగముది- కాని లోకులు ధైర్యములేని వారుగా నుండిరి. రెండవ యవస్థ వియోగముది- కానిజనులు సంతోషమును బొందుచుండిరి- ఇది సాంసారిక ప్రేమమునకుదాహరణము- ఈవిధముగానే పరమేశ్వరుని పొందగోరు ప్రతీక్షాకాలముకూడ ఆనందదాయకమని తలంచవలెను- ఈ సమయమునందే భక్తుఁడు నిత్యనూతన పద్ధతులతో తన మానసమందిరమును శుభ్రము చేయుచుండును- ఆనందాశ్రుపూరముల ప్రవహింపఁజేసి మనోమందిరతలమును గడుగుచుండును- దానిమార్గమునందంతటను బాష్పవారి హిమాంబుపూరమునే జిలికించుచుండును— "నా ప్రియతముఁడు నేఁడు తప్పక రాఁగలఁడు— నేఁడు విశేషప్రయత్నమున మనోమందిరము నలంకరింపవలసియున్నది- దినమంతయును, రాత్రియంతయును శ్రద్ధ, ప్రేమము, భక్తియునను సురభిప్రసూన మాలికలనుగాని యెదురుచూడవలెను- ఇప్పుడువచ్చునో లేక అప్పటికివచ్చునో ఇప్పుడు వాకిలి తెఱువబడినదా? తెఱువఁబడిన

డాయని యెన్నియో పర్యాయములు భక్తుఁడు శబ్దమును విని యు, ప్రకాశజ్యోతియొక్క చిహ్నమేదేనియుగనినతోడనే సంతోషమును జెందును. "అతఁడు వచ్చినాఁడు- కవాటము తెఱువఁబడినది-" కాని మఱల ప్రతీక్ష ఆరంభమగును—మఱియు—నీవిధముగానే యెన్నియో రాత్రులు, యెన్నియో పగళ్లు- ఎన్నియో వానలు- ఎన్నియో చలులు గడచిపోవును- భక్తుఁడు కూర్చుండి యున్నాఁడు- వృత్తులనునిలిపి యున్నాఁడు- అతనికీయవస్థయందే ఆనందము కలుగుచుండును- ప్రాతఃకాలముపిదప సాయంకాలమును, సాయంకాలముపిదప ప్రాతఃకాలమును జరుగుచుండును- భక్తుఁడా ప్రకారముగానే మనోమందిరమును శృంగారించుచు కడుగుచు ఎవరి రాకకో నిరీక్షించుచుండును- భక్తుఁడీ ప్రతీక్షాకాలమునందు భీతుఁడు కాడు- అతఁడు ప్రతినిత్యమును దృఢముగా మనోమందిరమున కూర్చుండి యతని వాకిలిని దట్టుచు, శబ్దము న్నాలకించుచునేయుండి యిట్లు వచించును-,

క॥ నీవాకిట కూర్చుండిన
 నోవిమలా! నిన్నుజూచుటో మృతిగనుటో
 కావవె, లేకుండినచో,
 లేవను ఇచ్చోటుబాసి లేశంబైనన్॥

కాని యీమార్గమున మృతిజెందు నవసరమునులేదు- కూడిక యేలభించును. నేఁడుగాకున్న రేపు రేపుగాకున్న నెల్లుండి. ఈజన్మములోగాకున్నముందు జన్మములో. అట్టి యెడ

భక్తునకు శీఘ్రముగా కూడిక లభింపకున్న, నతఁడు కలఁతజెంద రాదు. ఈ ప్రతీక్షాసమయమున శ్రద్ధనువృద్ధిచేయవలెను. సంశయములను దగ్గరకు రానీయరాదు. దీనితో పాటు నింకొక మాటనుగూడ జ్ఞప్తి యందుంచుకొనవలెను. అదేమన-అధైర్య పడియు, నిరాశజెందియున్నంతనుని కార్యము నెఱవేరదు. సేద్యకాఁడు విత్తనములను విత్తునప్పుడే దాని ఫలమును బొందునా? కాదు. అతఁడు ప్రతీక్షించవలయును. ఎన్ని యోదినములు, యెన్ని యోమాసములు ప్రతీక్షించుటయందు గడుపును. ఒకసారి ఆకాశమువంకకుఁజూచి వర్షమును ప్రార్థించును. వేఱొక తడవ తుపానునుండిరక్షించుటకు పరమాత్ముని వేడుకొనును. మఱల ప్రతీక్షించుచునే యుండును. దీనికొక చక్కని యుదాహరణమును ఐపక్టిటస్ అనువేదాంతి (ఫిలాసఫర్) యొసఁగియున్నాఁడు. దానిని శ్రీలాలా దీవానచంద. ఎమ్. ఏ. కాన్పూరు దయానందకాలేజీ ప్రిన్సిపాల్ తనపుస్తకము "జీవనరహస్యము"నందు వర్ణించియున్నారు. ఐపక్టిటస్ గారిట్లు వ్రాయుచున్నారు.— "ఏ పెద్దవస్తువైనను అప్పుడే సంపూర్ణముకాఁజాలదు. ఒకసామాన్యమగు ద్రాక్షపండ్లగుత్తిగాని లేక అంజూరపండ్లుగాని పండుటకుగూడ సమయము పట్టును. నీవు నన్నొకవేళ నిప్పుడే అంజూరపండునిమ్మని డిగిన నేనిటులందును—దీనికికొంతసమయము కావలెను- మొదట చెట్టుమీఁదపూవులు పూయనిమ్ము- అప్పుడుకాయలు

కాచును- తరువాతపండ్లుపండును- ఒకఅంజూరపండే తక్షణమే పండి సిద్ధముకాఁజాలనప్పుడు మనుష్యుని మనఃఫలమునునీవు కోలఁదికాలములోనే యెట్లుపొందఁగలవు? మనస్సును బాగు చేయుటయందు జేరియున్నపుడు దీనిఫలమును వెంటనే కోరకుము—అందేచేరియుండుము- కాలమును గడువనిమ్ము- మంచిసేద్యకానివలె చక్కఁగాగాపాడుము- అప్పుడే ఫలమునయితము దొరకగలదు-

8 సంసారమనిత్యమైనది. మనుష్యుఁ డన్నమువలె పచనమై, అన్నమువలె పుట్టుచున్నాఁడు. మరణించుట మనుష్యునకు నియతమైయున్నది. ఇది యసంభవమైన విషయముకాదు. (కఠోపనిషత్)

9 పరమాత్మనిపొందుట కుపాయమేమనగా, వాగాది ఇంద్రియముల నన్నింటిని మనస్సునందును, మనస్సును బుద్ధియందును, బుద్ధి లేకజ్ఞానమును మహదాత్మ (మహత్తత్త్వము) యందును ఆమహత్తత్త్వమును శాంతమైన ఆత్మయందు నిలుపవలెను. (కఠో)

10 మూర్ఖులు బాహ్యమైనట్టివియు, సాంసారికములు నగు కామములవెంటఁ జనుచుండి వారు మృత్యుబంధనములలో జిక్కుదురుకాని ధీరపురుషులు అమృతత్వమును తెలిసికొని యిచ్చటి స్థిరమైన వస్తువులను గోరరు.

11 ప్రపంచము యొక్క ప్రతివిధమైన కామములను దీర్చునట్టి వాడొక్కడై యెవ్వడు గలడో, యతనిని యేపురుషుఁడు తనయాత్మయందు స్థిరునిగాఁ జూచుచున్నాఁడో, యతనికి సర్వదా శాంతి లభించును.

12 ఎవరియందు తపము, బ్రహ్మచర్యము సముస్థిరత యునుండి, యెట్టికుటిలతయు ఛలమునులేవో, యట్టివారికిబ్రహ్మలోకముకలదు. (ప్రశ్నో)

(13) ప్రణవము ధనుస్సు, ఆత్మ బాణము. బ్రహ్మ లక్ష్యము. దీనిని సావధానుఁడగు పురుషుఁడు సంధించి కొట్ట గలఁడు.

కంటెను బెద్దది- ఈ లోకములన్నిఁటికంటెను పెద్దది. సమస్త మైన కర్మములును, సమస్తమైన కామములును, సమస్తమైన సుగంధములును, రసములును దానివే. ఈ సమస్తమును జుట్టి యుండియున్నది. అయ్యది యెప్పుడును వచింపదు. అదినిర్లక్ష్య మైనది. ఇదినాఆత్మ హృదయమునందుగలదు- ఇదిబ్రహ్మము- దీనిని నేనిచ్చటినుండి మరణించి పొందగలను- అను నిట్టివిశ్వా సము ఎవనికిగలిగి యెట్టిసందేహమును నుండదో, యతఁడు దానిని గాంచుచున్నాఁడు- (ఛాందోగ్య)

20 ఈసంసార మొకపేటిక- దీనిక్రిందిభాగము పృథివి పైమూఁతద్యులోకము- మరియు మధ్యభాగము అంతరిక్ష లోకము- మనుష్యుని కర్మసాధనములును, ఫలితముయొక్క భండారము దీనియందు నిండియున్నది- (ఛాందోగ్య)

21 వేటకానిచేత దారములోదృఢముగా బంధింపఁ బడినపక్షి ప్రతిదిశకునునెగురుచు, పటపటరెక్కలను గొట్టు కొనుచు నెందునునాశ్రయమునుగాంచక తాను గట్టఁబడిన స్థానమునకే చేరుచున్నయటులనే, యీమనస్సు దిశావసానం బులంద్రిమ్మరుచు నేయెడనుదావును గన్గొనఁజాలక ప్రాణ మునే యాశ్రయించును. ఏలననది ప్రాణముచేతనే బంధింపఁ బడియున్నది. (ఛాందోగ్యము) కావుననే మనస్సును వశ పరచుకొనుటకు ప్రాణమును వశములోనికిఁదెచ్చుకొనుట యావ సరమైయున్నది.

22 పగిలిపోయినకుండలోని జలమువలె మనుష్యుని యాయువు ప్రతిక్షణమును క్షీణించిపోవుచున్నది. ముదిమి

రంగమును బోలిచెంగటనే యెడపెల్లవర బొబ్బరించుచున్నది. మృత్యుదేవత సదాయాదలపైన తాండవించుచున్నది. సిరి నీడవలె చంచలమైయున్నది-యౌవనము జలతరంగమువలె క్షణభంగురమైయున్నది.— కావుననీ మిగిలిన సమయమున నేని భగవంతుని భజింపుమా.

23 ఆత్మప్రాప్తికిని, భగవత్ప్రేమమునకును స్వచ్ఛమగు రాజమార్గముకలదనిన నదికేవలమొక బ్రహ్మచర్యమే. బిందునాశనమువలన మృత్యువును, దానిరక్షణమువలన నమృతమును కలుగును.

24 మీనేత్రములను చంచలము గానివ్వకుండు. స్త్రీలను నిదానించిచూడకుండు. అట్లుచేయుట బ్రహ్మచారిమనస్సు క్షోభించుటకు గారణమగును. (దయానందుడు)

25 "సంగం సతు ప్రవిధీయతామ్" సాధువులసంగతిలో నుండుము:

26 "అటం ప్రసన్నాహి సుఖాయసంతః" సంతులు ప్రసన్నులైనచో వారు మనసుఖకారణు లగుచున్నారు.

27 భద్రంకర్ణే భిశ్శృణుయామ — భగవత్సంబంధమైన శుభ భాషణమును చెవులతో విందుముగాక! (ఋగ్వేదము)

28 భద్రంనో అపివాతయమనః— ఓప్రభూ! మామనస్సులను మంచివిషయములకై ప్రేరేపింతువుగాక! (సామ)

29 భక్తుడు కర్మపరిత్యాగము చేయవలసినవనిలేదు, గాని స్వార్థకర్మములను పరిత్యజించుట యావశ్యకము.

30 ప్రపంచమునందు స్వార్థరహితమగు ప్రేమమును, దానిని విశుద్ధముగాబొందుటయును, భగవంతుని యందలి పూర్ణానురక్తి వలని ప్రయోజనము.

31 ఈఅనిత్య ప్రపంచమునకువచ్చి, అనిత్యమగుజన్మము ధరించి అనిత్యసుఖము— ఐశ్వర్యము సందుమఱచి, యాత్మకు కల్యాణప్రదమైన విషయమునుగూర్చి తెలివితప్పరాదు.

32 సత్పురుషులసంగతి భక్తులకు ముఖ్యమైనది. ఇది యనేకసంశయములను రూపుమాపి విజ్ఞానము నభివృద్ధిపఱచి, మనోనిశ్చలతను గలిగించుటయందు మిక్కిలి సహాయకముగా నుండును.

33 దుర్జనులగువారు విద్వాంసులైనను, వారిస్నేహమును విడిచిపెట్టవలెను. మణితో నలంకృతమైనను సర్పము భయంకరమేగదా!

34 భక్తుడు తన హృదయములో పరమాత్మపిపాసను రగులుగొలుపవలెను. భక్తుడిట్టి పిపాసవలన నస్వస్థుడై యుండినప్పుడు భగవంతునిజ్యోతి సహజముగానే లభించును.

35 ఓభగవంతుని నాహ్వానించు భక్తుడా! ఇది యేమి చేయుచున్నాడవు? ఈపవిత్రమగునట్టి ప్రవాహమును కళంకయుక్తమగు మనస్సులోనికి యేవిధముగాఁగొని తేగలవు? మొదట మనస్సును శుభ్రపఱచుము.—కొంచెమాముఱికిని ప్రక్కకుఁదీసివైచి యాపవిత్రవాహమును గొనిరమ్ము. ఇందుకు భక్తుడిట్లుపలుకును— నేను అలసిపోయితిని. నామలినయుక్తమగు

మనస్సు శుభ్రపడదు. అసమర్థుఁడనుగా నున్నాను. కావుననే యాతనిని పిలుచుచున్నాను. భగవానుఁడా! ఇఁక దయచేయ రాదా?"

36 ఒకరిని పీడింపక, ఒకరిని శ్రమపెట్టక, ఒకరికి హాని కలిగింపక తన భుజబలముచేతగాని, మస్తిష్కబలముచేతగాని సాధనములేక అన్నము సంపాదింపఁబడుచున్నదో యదియే మనస్సును శుద్ధముగా నుంచగలదు.

37 మాటలయందు తియ్యదనములేక సత్యము పలుకు టయు బాగుగా నుండదు. సత్యముపలికినను చేదుగా నుండ గూడదు. ఇతరులహృదయములను జీల్చునటులుండరాదు.

38 మనస్సు, వాక్కు, కాయము, యీమూడింటిచే తను నితరులకుపకారము చేయుచుండుటయే సంతులయొక్క యు, భక్తులయొక్కయు, సహజమైన స్వభావముగానుండును.

39 మంచిభక్తులయొక్కయు, సంతులయొక్కయుసం గతి, యతికఠినముగాఁ బూర్వపుణ్యమువలననే లభించును. మనుష్యుఁడు మంచిగాఁగాని, చెడ్డగాఁగానియుండుట సంగతి పైననే యాధారపడియుండును. జలబిందువు అదియే. కాని యుదికాలుచున్న పెనముపైన పడినందున దాని పైనెనను నిలిచియుండఁ జాలదు. ఆదేబిందువు కమలపత్రముమీఁదఁ బడి యుండుటచేత ముత్యమువలె తళతళలాడును. సముద్రమునం దును ముత్యపుఁజిప్పలోఁబడిన నయ్యది ముత్యమే యగుచున్నది. ఇదియంతయును స్నేహమువలని ఫలితము.

40. ఏపురుషుఁడు విషయములవలని దోషములను వీర్య రక్షణమునందలి సద్గుణములను తెలిసికొనియున్నాడో యతఁడెన్నటికిని విషయాసక్తుఁడు కాఁడు- మరియు నతని వీర్యము విచారాగ్నియందు నింధనమైపోదు- అర్థార్త్తు వ్యయముకాదు- (సత్యార్థ)

41 స్తుతివలన నీశ్వరప్రీతియు, నతని గుణకర్మస్వభావములచేత తమ గుణకర్మ స్వభావములను సవరించుకొనుటయు ప్రార్థనచేత నిరభిమానత- ఉత్సాహము- సాహసము, లభించుటయు, ఉపాసనవలన పరబ్రహ్మముతోడ కూడికయు నతని సాక్షాత్కారమును కలుగును-—కాని యెవరు కేవలము భట్రాజులవలె పరమేశ్వరుని గుణకీర్తనము జేయుచును తమ గుణములను సవరించుకొనరో వారుచేయుస్తోత్రమునిరర్థకమైయున్నది- (సత్యార్థప్రకాశము)

42 ఒకపర్యాయము మనస్సు భగవంతుని రూపరసము నాస్వాదించినయెడల కామములపైన సహజముగానే జయమును పొందఁగలదు-

43 పురుషుఁడు కామమును స్వీకరింపక, త్యజించవలెను- దానియాటలలో నెంతమాత్రమును జేరకయున్న నతఁడుసంపూర్ణముగా ప్రకృతినుండి వేఱైయుండును. వాస్తవముగ నిదియే సంయమసాధనము-

44 మనుష్యుని యీ కనఁబడుచున్న స్థూలశరీరమేగాక, జీవునకింకొక వేఱేశరీరముకలదు. దానిని సూక్ష్మశరీరములేక

లింగశరీరమందురు. దానియందు నైదు జ్ఞానేంద్రియములును, ఐదు కర్మేంద్రియములును, ఐదుప్రాణములును, మనస్సు, బుద్ధి యును — నీ యేడు నుపాదానకారణములై యున్నవి. ఈసూక్ష్మశరీరమునందే వాసనామయసంస్కారములంటి యుండును. ఈనీనియొక్క ఫలస్వరూపము జీవునిపై నవశమును గాంచి కర్మముచేయుటకు బాధించుచుండును. ఇట్టివాసనలను నశింపఁజేయుటయే భక్తునికర్తవ్యమైయున్నది.

45 వాసనలను నశింపఁజేయుటకొరకు ప్రథమసాగన మేమన మనస్సునందు వైరాగ్యమునుత్పన్నముచేయుము. కాని మీ వైరాగ్యము నొకరికి గన్పడనీయవలదు. లోలోపలనే వైరాగ్యలతను వృద్ధిబొందనీయవలయును. ఊరకయే నిశ్శబ్ద ముగా వృద్ధిచేయుచున్న వైరాగ్యమువలన వాసనలు తమం తటతామే పంచబంగాళమై పోవుచుండును.

46 నమ్రభాషణము, వినయము, ప్రేమము నెంతేనియు వెలిబుచ్చుచుండుము. గృహమునం దున్నయెడల సోదరుల తోడను, సేవకులతోడను, తదితరులతోడను నడకువతో భాషించుచుండవలెను.

47 మీ జీవితము నెల్లప్పుడును సవరించుకొనుఁడు. మిక్కిలి కొలఁది వస్తువులలోనే జీవింపుము. ఎంతగా యక్కఱ లను, కోర్కులను తక్కువ జేయుచుందువో యంతగానే యెక్కువగా పరమాత్ముని సమీపించుచుండఁ గలవు.

(48) భగవంతుని కృపాపాత్రుఁడుగా నుండవలెనని కోరినయెడల భగవంతుఁడేస్థితిలో నిన్నుంచునో యాస్థితియందే సంతుష్టుఁడవై యుండ నభ్యసింపుము.

49 నీశత్రువులు సావధానులై నీకు కష్టము లొడవించ నుంకించుచు సమయమును జూచుచున్నారు. నిన్నుఁదమయి నట్టియు, మనోరంజకములును హృదయాకర్షకము లగునట్టియు దృశ్యములందును, కామములందును- జిక్కించి నిన్ను బలహీను నిగాఁ జేసి నిన్ను దోచుకొనగలరు. ఓయువకుఁడా! నీయొవన పటుత్వముచేత, కామక్రోధ లోభ మోహాహంకారము లని యెడు పరిపంథివర్గమును గడతేర్పుము. లేనిచో నిన్ను వృద్ధావస్థయందాపగవారు మిక్కిలి దుర్బోధముగా బాధించుచుండి యానందకోశము నంతయును నపహరింపఁగలరు.

50 ఎప్పుడు జీవుఁడు, మనస్సు, వాక్కు-కర్మలచేత నెవరికి చెరుపు సేయఁడో: కామక్రోధ ఈర్ష్యాసూయాది మనోమల ములను త్యజించుచున్నాడో, యప్పుడతఁడు భగవంతునకు ప్రీతుఁడై యుండగలఁడు-

51 తిన్నతిన్నగా బహిర్ముఖత్వమును విడనాడి, అంత ర్ముఖత్వమును బొందుటయే సాధనమును భక్తికి సత్యమయిన మార్గమున్నై యున్నది.

52 మనస్సు నాలుగువిధములుగా నుండును. 1 ధర్మ విముఖమైయున్న జీవునిమనస్సు నిర్జీవము. 2 పాపియొక్క మన స్సురోగి. 3 లోభియును స్వార్థయునగు వానిమనస్సు ఆలసియును

4. భజన సాధనాదులయందు తత్పరమైన్న మనస్సు స్వస్థమునై యుండును.

53 మొదట మనుష్యజన్మములభించుటయే దుర్లభము. అదిదొరకినచో సంసారసాగరమును దాటుటకు నావలభించినదనితలంపుఁడు. కాని యీనౌకను నడుపగల గురువొకఁడు లభించి, భక్తికిననుకూలమైన వాతావరణము చిక్కినప్పుడే యిది దాటిపోవఁగలము. కావున వీతరాగుఁడును, అనుభవశాలియునగు గురువుయొక్కయు, భక్తియొక్కయు శరణమును పొందుము. ఇట్లుపడియుండు నౌకను పాఱిపోనీయ బోవకుఁడుసుమా!

54 ఏపనిచేయఁదొడఁగినను నీశ్వరుఁడు నిన్ను చూచుచున్నాఁడని జ్ఞప్తియందుంచుకొనుము. ఇట్టిధ్యానము గలిగియున్న నెట్టి నిరర్థకకార్యమునైనను జేయజాలరు.

55 సత్యముయొక్కయు ధర్మముయొక్కయు రక్షణము దృఢతచేతనే చేకూరగలదు. తనప్రాణములపైన మోహముగలవాఁడెవఁడును ధర్మమును పాలింపనేజాలఁడు.

56 ఏవిషయమునందును జేరుటమిక్కిలి సహజమనియు, నందుండితిరిగి విడువఁబడుట యత్యంత కఠినమనియు మఱవవలదు. తెలివిగలిగియుండుఁడు. మఱచియైనను — క్షణమాత్రమునకైనను నేవిషయమునందును జిక్కకుఁడు.

57 ఏవిధముగా వాయుసహాయమునుబొంది యగ్ని యెండుగడ్డిసమూహమును కాల్చివేయునో, యావిధముగానే

చిత్తమునందలి వాసనలను పాపవృత్తులనుదహించు సమర్థమైన దొకభగవద్భక్తియే.

58 జిహ్వాచాపల్యము భక్తునిముట్టడింప నతఁడధికముగా తినుచున్నప్పుడు భక్తి దుఃఖితయైపోవును. భక్తుఁడు భక్తినుండి దూరముగా జను చుండును.

59 విపత్సమయములందు కష్టక్లేశములందు ధైర్యము గలవాఁడును, వానినిసంతోషముతో సహించుచు సుఖాంగు చుండునట్టియు మనుష్యుఁడు తన్నుదాను భగవత్కృపా పాత్రు నిగా నొనరించుకొనును.

60 ప్రాణులు దేహమును ధరించినందులకు, నిర్దంభ, నిర్భయ, శోకరహితవృత్తితో భగవద్గుణగానము సేయుటయు, భక్తియందు దత్పరులైయుండుటయు సఫలతయగుచున్నది.

61 సంతుల సమాగమము నిస్సందేహముగా అమూల్య మైనది.

గావుననే భర్తృహరి యిట్లువలికియున్నాఁడు:—

శ్లో॥ జాడ్యంధియోహరతి సించతివాచిసత్యం
మానోన్నతిందిశతి పాపమపాకరోతి
చేతః ప్రసాదయతిదిక్షుతనోతికీర్తిం
సత్సంగతిఃకథయకిం నకరోతిపుంసామ్?

"గీ॥ సత్యసూక్తి ఘటించు ధీజడిమమాన్పు
గౌరవ మొసంగుజనులకు గలుషమడఁచు,

గీర్తిఁ బ్రకటించుఁ జిత్త విస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబునకలార్థ సాధనంబు.

62 తీవ్ర ప్రవాహముగల నదులయందు పడినతృణము యేవిధముగా నిలుకడగలిగియుండక నటునిటుకొట్టుకొని పోవు చుండునో, యటువలెనే బ్రహ్మచర్యహీనులగువారి చంచల హృదయమునందెట్టి సాధనమును వివేకమును నిలువఁజాలదు. ఇటునటుకొట్టుకొని పోవుచుండును.

63 ఏవిధముగా శీతాతురుఁడు నిప్పునఁజేరినందువలన చలినివృత్తిఁజెందునో యటులనే పరమేశ్వరుని సమీపించినందువలనసమస్తదోషములు దుఃఖములు వదలిపోయి పరమేశ్వరుని గుణకర్మస్వభావసదృశముగ జీవాత్మయొక్కయు గుణకర్మ స్వభావములును పవిత్రములైపోవును. (సత్యార్థప్రకాశము)

64 పరమాత్మస్తుతి ప్రార్థనోపాసనలఁ జేయుటవలన నాత్మబలము వృద్ధిపొందుటచే పర్వతమువంటి దుఃఖమునైనను జూచి మనుష్యుఁడు భీతుఁడుకాఁడు. (సత్యార్థప్రకాశము)

65 విపత్తులు నిజమునకు విపత్తులుకావు. సంపదలును యథార్థముగా సంపదలునుగావు పరమాత్ముని విస్మరించుటయే విపత్తియును నతనిస్మరణముచేయుటయే సంపదయునగుచున్నవి.

శ్లో॥ విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః
విపద్విస్మరణం విష్ణోః సంపన్నారాయణస్మృతిః॥

66 శ్లో॥ విపదస్సంతునశ్శశ్వత్తత్ర తత్ర జగద్గురో
భవతో దర్శనం యత్స్యాదపునర్భవదర్శనమ్॥

ఓజగద్గురూ! మాకు నెల్లప్పుడును విపత్తులేగలుగు చుం గాను గాక! ఏలన మీదర్శనము విపత్తులలోనే లభించును.

67 క॥ కరచరణాద్య వయవముల
భరముడిగెఁ వళులు మొగము పైనిండారెన్
శిర సిల్లఁ దెల్లఁబాఱెను
దరిమాలిసతృష్ణయొకఁడె తరుణంబూనెన్ ॥
(భర్తృహరి)

68

చ॥ కలితమనోరథంబులుదకంబులు తృష్ణలుభూరివీచికా
వళులనురాగముల్ మకరవర్గము మోహవితర్కముల్ సుడుల్
పులుగులుగాఁగ ధైర్యమను భూజముఁగూల్చు దురాశ పేరిపు
ష్కలనదిదాటినిత్యసుఖ సంపదగాంతురు యోగిపుంగవుల్.
(భర్తృహరి)

69 భోగము ఎత్తైననీటియలలవలె చంచలమైనది. ప్రాణములు క్షణములోనశించిపోవునవి. కామినీగణముతో రమించునట్టి యౌవనసుఖస్ఫూర్తియూఁడునాళ్లదే. కావున ఓజ్ఞానులగు పండితులారా! యీసమస్త సంసారమునసారమని తలపోసి లోకోపకారమునందు మనస్సునుజొన్పి బ్రహ్మధ్యానము సేయఁగడంగ రెందులకు? (భర్తృహరి)

70 మనుష్యునియాయువు నూఱువర్షములని ప్రమాణితమైయున్నది.— దానియందర్ధభాగము నిద్రలోనే గడచుచున్నది. ఆమిగిలిన దానినర్ధము బాలత్వ వృద్ధత్వములందుజనుచున్నది. మిగిలినదివ్యాధి, వియోగదుఃఖ సేవాదులయందు వ్యయమగుచున్నది. ఈజీవితము జలతరంగమువలె చంచలమైనది. దీనియందు ప్రాణులకు సుఖమెక్కడిది? (భర్తృహరి)

71 ఎప్పటివరకు శరీరముస్వస్థముగాను, నీరోగముగాను ముదుసలితనము రాకయు, నింద్రియశక్తి న్యూనమై యుండకయు ఆయుస్సు క్షీణముగాకయునుండునో, అప్పటివరకే తననిశ్శ్రేయసమునుగూర్చి పండితుఁడు లెస్సగాఁ బ్రయత్నింప వలయును. అట్లుగానియెడల నింటికి నిప్పంటినప్పుడు బావిత్రవ్వఁబోయినట్లుండును.

(భర్తృహరి)

72 సూర్యుఁడు కమలము నెంతతపింపఁజేసినను కమలముయొక్క ముఖమెప్పుడును వికసితమైయుండును. నీవు నాకష్టములను నివారింపకపోయినను నాహృదయము మాత్రము నీదయచేతనే ద్రవింపఁబడును. ఒకవేళ తల్లి యేకారణము చేతనైనను నీమారుని తనయొడినుండి దించివైచినను, పిల్లవాఁడామెయందే ప్రేమముగలిగియుండును. పతియుతన పతివ్రతయగు భార్యను నదుగురియెదుట తిరస్కరించినను నామెయతనిని పరిత్యజింపదు. ఆవిధముగానే యోపరమాత్మా! నేనునిన్నెట్లువిడనాడఁగలను.

(భక్తకులశేఖరము)

73 ఎవరిమనస్సును సమస్తసౌందర్యరాశియగు పరమాత్ముని [సుభవంసుపేశనం] యందుచేర్చియున్నారో యట్టివారు మనుష్యులకగపడు సౌందర్యమునందెట్లా సక్తులుకాఁగలరు?

[దేవి]

74 ఈశ్వరుఁడు మనకిచ్చినదంతయును కూడబెట్టి నిలువచేయుటకుగాదు. కాని యోగ్యులైనపాత్రులకు దానమిచ్చుటకొరకై యున్నది.

(ఋగ్వేదము)

75. ఎవ్వఁడు లోకులయత్యాచారములచేత వ్యధితుఁడు గాఁడో యతఁడు మహాపురుషుఁడనఁ దగియున్నాఁడు.

76 పశ్చాత్తాపమొందుము! పశ్చాత్తాపము!! నేఁటివరకెంత జఱిగినదో దానినిగూర్చి పశ్చాత్తప్తుఁడవుగమ్ము. కన్నీళ్లుగార్చి మనోమాలిన్యమును గడుగుము. మఱియు భగవంతునితో— "మహాప్రభూ! నేటినుండి నీచరణములందు నాకుస్థానమునిమ్ము. ఇంక నేమైనను, యిమ్ము, లేక యివ్వక పోమ్ము కాని నీయందలిభక్తిభావమును మాత్రము తప్పక ప్రసాదింపుము." అనికోరుము— పశ్చాత్తాపముతోగూడిన రోదనము మనుష్యుని హృదయములోనికి లౌకికశాంతిని గొనితెచ్చును.

77 ఎప్పుడు లోకులునన్ను పిచ్చివాఁడనని తలఁచి వారి పనులకు నక్కఱరానివాఁడనని యెంచుచున్నారో— ఎప్పుడు సాంసారికులు నన్నుదూరముగా నుంచుచున్నారో, యప్పుడే నామనస్సులో వాస్తవికతత్త్వము ప్రకాశించును.

78 సుఖదుఃఖములయునికి కర్మానుసారముగ నుండుట చేత వానిననుభవించుట అందఱకును యనివార్యము. కావున సుఖముననుభవించువేళనుగూడ పరమాత్ముని మఱువకుము. దుఃఖసమయమునందైనను పతనినిందసేయక పోవుటయేగాక యతఁడు మీయొక్క మనోమాలిన్యమును దూరముచేయుట కొరకు మార్గమును ప్రసాదించినాఁడని ధన్యవాదములను సమర్పింపుము. — దుఃఖమును తపమనియు, ప్రాయశ్చిత్తస్వరూపమనియు నెంచుము.

79 కాలమునెందులకు వృథాగా గడుపుచున్నావు.— వ్యర్థముగుమాటలవలనఁ గలలాభమేమి? భగవంతునియందే నీచిత్తమును జేర్పుము. (మధ్వాచార్య)

80 భగవంతుఁడు మీకుజిహ్వ యెందులకు ఇచ్చియున్నాడు?— ఒకభక్తుఁడు దీనికీవిధముగాఁ బ్రత్యుత్తరము నిచ్చియున్నాడు.

జిహ్వాత్తోతదీ హీ భజిజపే హరికా నామ్
నహీఁతో కాన నిహూశే ముఖ్ మేథలోనచామ్॥

81 యజ్ఞశేషమును భుజించు శ్రేష్ఠపురుషులు సమస్త పాపములనుండి ముక్తులుకాఁగలరు. కాని యెవరు తమశరీర పోషణముకొరకు మాత్రమే వండుకొనుచున్నారో వారు పాపమునే భుజించుచున్నవారగుచున్నారు. [గీతా]

82 ఏపురుషుఁడు సంపూర్ణముగా కామములను త్యజించి మమతలేనట్టియు, నహంకారములేనట్టియు, స్పృహలేనట్టియు, వ్యవహారములను జేయుచున్నాఁడో యతఁడు శాంతిని పొందుచున్నాఁడు-

83 ఎవరి సమస్తపాపములును నాశనమైపోయినవో ఎవరి సంశయములు, జ్ఞానముచేత నివృత్తిఁ జెందినవో మఱియు నెవరు సమస్త ప్రాణులహితము నందురతులైయుందురో, యెవరి చిత్తము భగవంతుని ధ్యానమునందేకాగ్రమైనదో యట్టి బ్రహ్మవేత్తలగు పురుషులు శాంతపరబ్రహ్మను పొందుచున్నారు- (గీతా)

84 ధనముకాఁబట్టదు. గృహములువలదు. వాటికలు
వలదు. భగవంతునిభక్తికొరకు కేవలముహృదయమే కావ
యును. హృదయము— మఱియు నాహృదయమున్ప్రేమ—
పవిత్రత పురుషార్థములచేత నలంకృతమైయుండవలయును.

85 జీవాత్మయింద్రియముల వశమునఁజిక్కి నిశ్చయము
గాఁగొప్పగొప్ప దోషములను బొందును. ఇంద్రియముల
తనవశములోనికిఁ గొనినప్పుడె సిద్ధినిపొందును. [మను

86 ఏవిధముగా నగ్నిలో తపించినందువలన సువర్ణా
ధాతువులమలము నశించిశుద్ధినిబొందుచున్నవో యటులేప్ర
ణాయామము చేసినందువ మనస్సు మొదలగు నింద్రియముల
దోషములనువీడి నిర్మలమగు చున్నవి. (మను

87 నిశ్చయమగు విషయమేమవ నింధనములు నెయి
వేయుటవలన నగ్నివృద్ధినిబొందినట్లు, కామోపభోగముచే
కామముశాంతింపక వృద్ధియగుచుండును. కావున మనుష్యుఁడ
విషయాసక్తుఁడు గారాదు. (సత్యార్థప్రకాశము

88 చేసినయధర్మము నిష్ఫలముకాదు. కాని యధర
ముచేయఁగానే దానిఫలముకానరాదు. ఇందువలన నజ్ఞానులగ
వారలధర్మమునుండి భయపడరు. అయినను నధర్మాచరణమ
మెల్లమెల్లగా వినాసుఖమూలములను ఛేదించుచుండుననుట
నిశ్చయమని యెఱుఁగుము- [మను

89 పొందుటకయోగ్యమగు వస్తువునుబొందఁగోరకుమ
నశించినపదార్థములను గూర్చిశోకింపకుము, ఆపత్కాలము

మోహము నొందకుము. అర్థార్తు వ్యాకులపడకుము. అట్టుండు వాఁడెబుద్ధిమంతుఁడగు పండితుఁడు. (మను)

90 ఎంతవరకు సంసారము మనస్సులోనిండియుండునో యంతవరకు భగవంతుఁడు దూరస్థుఁడైయుండును. సంసారము తొలఁగినతోడనే భగవంతుఁడు మనస్సునందు ప్రకాశించును.

91 భగవద్విస్మరణమే మృత్యువు. భగవత్స్మరణమే జీవనము.--- యస్యచ్ఛాయామృతం యస్యమృత్యుః॥

92 మందిరశుద్ధికొరకు ఓంకారజపము మిక్కిలి యావశ్యక మైనది. జపముతోపాటు (ఓం) ఓంకారధ్యానము నయితము చేసిన మొదల నతిశీఘ్రముగా సిద్ధిలభించునని యనుభవశాలురగు వారు తెలిపియున్నారు.

93 నిత్యమును ధర్మసంచయము జేయుచు నుండుము: ధర్మసహాయమువలననే మిక్కిలి గొప్ప దుస్తరదుఃఖసాగర మును జీవుఁడుతరింపఁ గలుగును. [మను]

94 మిథ్యాభాషణములాడువాఁడు చౌర్యాదిసమస్త పాపములను జేయువాఁడగు చున్నాఁడు. (మను)

95 భగవద్భక్తుని వాక్కులనుండియు, కన్నులనుండి యును ప్రేమము వర్షించుచుండును. అతనిమార్గము ప్రేమపూరితమై యుండును.

96 దేహధారియెప్పటికిని సుఖదుఃఖప్రాప్తినుండి దూర ముగానుండఁజాలఁడు. కావున సుఖదుఃఖములను గూర్చి ధ్యాన మీయరాదు. [ఛాందోగ్య.]

97 చేప నీటియందును చాతకపక్షి మేఘమునందును చకోరముచంద్రునియందును ప్రేమగలిగియున్నటులేమా యొక్క ప్రేమమును పరమాత్మునియందు నిలిచియుండునుగాత! పర మాత్మునకు వేఱుగానుండి యొక్క-క్షణ మేనియుసుఖశాంతు లను బొందకుందుముగాత!

98 "భగవానునియందెవరికి సత్యమైన ప్రేమము గలదు" అనునొక ప్రశ్నముగలిగి దానిపైన నిద్దఱు భక్తులలోనిట్లు సం భాషణము జరిగినది:—

ఒకడు — భగవంతుడిచ్చినదుఃఖములను స్థిరతతో నెవఁడు సహింపఁజాలఁడో యతఁడు నిజమైన ప్రేమఁడిగల వాఁడు కాఁడు.

రెండవవాఁడు— కాని దీనియందభిమానగంధముగానవచ్చు చున్నది.

మొదటివాఁడు— దుఃఖములకొరకు భగవంతునకు ధన్యవాద ములర్పింపనివాఁడు సత్యమగు ప్రీతిగలవాఁడు కాఁడు.

రెండవవాఁడు— దీనికంటెను పైమెట్టునుండును—

మొదటివాఁడు—దుఃఖమును సుఖమునుగా గాంచనివాఁడు నిజ మైన యనురాగముగలవాఁడు కాఁడు.

రెండవవాఁడు— ఇదియన్నిఁటికంటెను ఉత్తమమైనదికాదు— దేనియందు మనుష్యుఁడు భగవంతునియందు

లీనుడై దుఃఖమును విషయమునే తెలిసికొనఁ
జాలకుందునో యది యే యన్నిఁటికంటెను
నుత్కృష్టమైన ప్రేమ.

ఓమ్. శమ్.

22-3-51



